





# జీవిత చరిత్ర

## స్వామి- స్నేహితులు[స్వామినాథన్ చరిత్ర]





## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071683

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



ఆర్. కె. నారాయణ్

రు.2/-



# స్వామి-స్నేహితులు



# SWAMI, SNEHITULU

Telugu Translation of

# SWAMI AND FRIENDS

by:

R. K. Narayan

Translated By:

Srinivasa Chakravarti

Illustrations By: R. K. Laxman.

FIRST EDITION 5000 COPIES, JULY, 1959

Translation Right obtained from the Author

Printed at:

Sree Panduranga Printing Works.

Vijayawada-2.

*Published By:*

ADARSA GRANDHA MANDALI

VIJAYAWADA.

**Price: Rs. 2-00**

PUBLISHED UNDER THE AUSPICIES OF

The Southern languages book Trust

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాలప్రచురణకు దోహదంచెయ్యాలనే సంకల్పంతో దక్షిణభారత పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్టు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందువల్ల మానవజీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవితచరిత్రలు, వారుచేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథపరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమిచేసినది, వారికి తా మెంత ఋణపడిఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వా రెన్నెన్ని పాట్లుపడినది ముందుతరాలవారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం — ఈ గ్రంథపరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీన కళాసంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులోఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్నభిన్నవిషయాలను గురించిన ఈ గ్రంథాలు

ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆవిధంగా ఇట్టి ప్రచురణలకు ముందు ముందు విస్తార ప్రచారం కలుగగలదని నా విశ్వాసం.

దక్షిణభారతభాషలలోని ఉత్తమగ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్యభాషలలోకి అనువదింపజేయటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు విద్యావంతులలో ఎక్కువమందిని వివిధవిషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞానపిపాసను తృప్తిపరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్టు అవుతుంది.

ఈ దక్షిణభాషాపుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలంకాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు,
7-10-58.

ఎ. ఎల్. ముదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం,

# స్వామి, స్నేహితులు

## ఒకటో ప్రకరణం

### సోమవారం ఉదయం

సోమవారం ఉదయం స్వామినాథన్ కళ్ళు తెరవకుండా బిగపట్టుకుని పండుకున్నాడు. సోమవారమంతటి ఛండాలపు రోజు ఇంకొకటిలేదని అతనికి అనిపించింది. శని ఆదివారాలు హాయిగా ఇష్టంవచ్చినట్లు తిరిగాక, మళ్ళీ వచ్చి పడే సోమవారంనాడు చదువుసంధ్యల్లో పడడం కష్టం. బడి జ్ఞాపకంవచ్చింది. పసుపుపచ్చని ఆ భయంకరభవనం, క్లాసుటీచరు మిడిగుడ్ల వేదనాయగం, సన్నని పొడుగాటి పేముబెత్తం పుచ్చుకుని తిరిగే హెడ్డుమాస్టరు జ్ఞాపకం వచ్చేసరికి అతను వణికిపోయాడు.



"అది సోమవారంఉదయం" స్వామి

ఎనిమిదిగంటలకల్లా తను చదువుకునే గదిలో వ్రాతబల్ల ముందు కూర్చున్నాడు. నిజానికి ఆ గది వాళ్ళనాన్న దుస్తులగదిలో ఒక భాగం. బల్లమీద అతనివస్తువులన్నీ కోటు, టోపీ, పలక, సిరాబుడ్డి, పుస్తకాలు, చిందరవందరగా పడి

ఉన్నాయి. ముక్కాలిపీటమీద కూచుని ఆరోజు చేయవలసింది జ్ఞాపకం తెచ్చుకోవడానికి కళ్లు మూసుకున్నాడు. లెక్కలు - లాభనష్టాలకు సంబంధించిన అయిదు లెక్కలు - తర్వాత ఇంగ్లీషు - ఎనిమిదో పాఠంలో ఒక పేజీ చూసి రాయాలి; కఠినమైనమాటలకు డిక్షనరీ చూసి అర్థాలు రాయాలి. ఆతర్వాత భూగోళం.

ఈ గంపెడుపనీ చేసి బడికి వెళ్ళేందుకు సిద్ధమవడానికి రెండుగంటలు మాత్రమే వ్యవధి ఉంది.

## II

పొడుగాటి కిటికీవేపు వీపుపెట్టి కూచుని, మిడిగుడ్ల వేదనాయగం పాఠం చెపుతున్నాడు. ఆ కిటికీచువ్వలగుండా కవాతుస్థలం కొంత భాగం, చిన్నపిల్లల తరగతులు నడిచే వరండాలో ఒకమూల కనిపిస్తుంది. ఎడమవేపున పెద్ద పెద్ద కిటికీ లున్నాయి. వాటిగుండా చూస్తే విశాలమైన బహిరంగ ప్రదేశం కనిపిస్తుంది. ఆ బహిరంగప్రదేశానికి అవతలిఅంచున రైలుకట్ట.



మిడిగుడ్ల వేదనాయగం

చిన్నపిల్లలు తప్పటడుగులు వేసుకుంటూ ఒకరిమీద ఒకరు పడడం చూసే అవకాశం పన్నెండున్నరగంటల మెయిలు బండి కట్టమీదుగా సాగిపోతూ సరయూ వంతెనమీద రణ

గోణధ్వని చేయడం చూసే అవకాశం ఉండడం మూలాన స్వామినాథన్ క్లాసులో కూచోగలిగాడు.

మొదటిపీరియడు ఏగొడవా లేకుండా గడిచిపోయింది. రెండోపీరియడు లెక్కలు. వేదనాయగం బయటకువెళ్ళి కొద్ది నిమిషాలలో లెక్కలు చెప్పడానికి తిరిగివచ్చి ఝుమ్మంటూ ఏకధాటిగా పాఠం మొదలుపెట్టాడు. స్వామినాథన్‌కి విపరీతంగా విసుగెత్తింది. మాస్టరుగొంతు వింటూంటే కంపరంపుట్టింది. నిద్ర తోసుకువచ్చింది.

మాస్టరు ఇంటికి ఇచ్చిన లెక్కలు చూపించమని అడిగాడు. స్వామినాథన్ తనసీటుల్లోనుంచి లేచి వేదికమీదకు ఉరికి నోటుపుస్తకం బల్లమీద పెట్టాడు మాస్టరు లెక్కలు సరిచూస్తుంటే స్వామినాథన్ అతని మొహంకేసి తేరిపారజూడ సాగాడు. దగ్గిరనుంచి పరీక్షగా చూసేసరికి మాస్టరుమొహం సాత్మికంగానే ఉంది. కాకపోతే కళ్ళు ఒకదానికొకటి మరీ దగ్గిరసా ఉన్నాయి. బెంచిమీదనుంచి చూసినప్పుడుకంటె గడ్డం వత్తుగాఉన్నట్టు కనిపించింది. మొత్తంమీద చూడడానికి అతను పరమ అసహ్యంగా ఉన్నాడు.

ఈ ఆలోచనలు ముందుకుసాగలేదు. ఎడమ మోచేతి మీది మెత్తటి కండరందగ్గిర విపరీతమైన బాధ కలిగింది. మాష్టారు ఒకచేతితో స్వామినాథన్‌చేతిని నులుముతూ ఇంకో చేతితో లెక్కలు ఒకటొకటే కొట్టివేస్తున్నాడు 'పేజీ అడుగున 'అర్థాన్నంగా వుంది' అని రాసి నోటుపుస్తకం స్వామినాథన్ మొహంనికేసికొట్టి వెనకకు తరిమివేశాడు.

ఆ తరువాత పీరియడు దేశచరిత్ర. పాఠం ఎప్పుడు మొదలవుతుందా అని పిల్లలంతా మహా ఆదుర్దాగా ఉన్నారు. దేశచరిత్రబోధించే మాస్టరు డి. పిళ్ళై దయా దాక్షిణ్యాలకు సరససంభాషణకు పేరు పొందినవాడు. విద్యార్థులమీద ఎన్నడూ మండిపడిగాని, తిట్టిగాని ఎరగడు. ఆయన దేశచరిత్ర బోధించేతీరే వేరు. నేటి విద్యావిధానంలోని ఏవిధానానికి అది కట్టుబడిఉండదు. వాస్కోడిగామా, క్లైవు, హేస్టింగ్సు మొదలయినవారి వ్యక్తిగతచరిత్రలను వివరంగా ముచ్చటగా బోధించేవాడు. చరిత్రలో జరిగిన యుద్ధాలను వర్ణించి చెప్పుతూంటే ఆయుధాలరాపిడులు, టకటకలు మరణించేవారి మూలుగులు వినిపించేవి. చప్పుడు చేయకుండా అడుగులు వేసుకుంటూ తనిఖీనిమిత్తం వసారాలలో తిరిగే హెడ్డుమాస్టరికి మాత్రం ఇదంతా తలనొప్పిగా ఉండేది.

ఉదయం ఆఖరి పీరియడు బైబిలు. అయితేనేం, క్లాసు మందకొడిగా ఉండేదికాదు. మధ్యమధ్య కళ్ళముందు ఎర్రసముద్రం రెండుపాయలై ఇశ్రాయేలువారికి దారి ఇవ్వడం, సామ్సన్ సాహసకృత్యాలు, యేసుక్రీస్తు సమాధిలోనుంచి లేవడం, చలనచిత్రాలలాగా కదలాడుతూంటాయి. అయితే ఉన్న చిక్కల్లా బైబిలుబోధించే ఎబెనెజార్ వట్టి మతపిచ్చిగాడు.

"ఓ తెలివితక్కువదద్దమ్మల్లారా" అంటూ మొదలు పెట్టాడు మాస్టరు పిడికిలిబిగిస్తూ "ప్రాణంలేని వెధవ కొయ్యబొమ్మల్ని, రాతివిగ్రహాలను యెందుకు మీరు పూజిస్తున్నారు? అవేం మాటలాడగలవా? ఊహుఁ - మాటలాడలేవే! చూడగలవా? ఊహుఁ - చూడలేవే! మిమ్మల్ని ఆశీర్వదించగలవా? ఊహుఁ - మిమ్మల్ని స్వర్గానికి తీసుకువెళ్ళ

గలవా ? ఊహుఁ - యెందుచేత ? యెందుచేతనంటే, వాటికి ప్రాణంలేదుగనక. గజనీమహమ్మదు వాటిని ముక్కలుముక్కలుగాచేసి, కాలితోతొక్కి వాటితో పాకీదొడ్డికి మెట్లుకట్టించుకుంటే, మీ దేవుళ్ళు యేంచేయగలిగారు ? ఆ బొమ్మలకు, ఆ విగ్రహాలకు ప్రాణమేఉంటే గజినీమహమ్మదు దండయాత్రను తిప్పికొట్టలేకపోయేవా ?"

ఆతరవాత క్రైస్తవమతంవిషయం ప్రస్తావిస్తూ "యింక మా ప్రభువు జీససువిషయం చూడండి. రోగులకు ఆరోగ్యం చేకూర్చగలడు. బీదలబాధలు తొలగించగలడు. మనందరినీ స్వర్గానికి తీసుకువెళ్ళగలడు. ఆయనే నిజమైన దేవుడు. ఆయనమీద విశ్వాసంవుంచితే స్వర్గానికి తీసుకువెళతాడు. స్వర్గ సామ్రాజ్యం మనలోనే వుంది." ఏసుక్రీస్తురూపం కనులకు కట్టేసరికి ఎబెనెజార్ చెంపలమీద కన్నీరు ధారకట్టింది. మరుక్షణంలో శ్రీకృష్ణుడు జ్ఞాపకంవచ్చేసరికి అతని మొహం కోపంతో కందగడ్డఅయిపోయింది. "మీ కృష్ణుడిలాగా మా జీసను భోగంపిల్లలతో కులుకుతూ తిరగలేదే! మీ అల్లరి కృష్ణుడిలాగా మా యేసుక్రీస్తు వెన్న దొంగిలించలేదే! చుట్టుపట్లవారిని ఆరడిపెట్టలేదే !"

ఊపిరిపీల్చుకోవడానికి ఆగాడు. ఆవేళ బైబిలు మాస్టరుకు పట్టపగ్గాలు లేకుండాఉన్నాయి. స్వామినాథన్‌రక్తం ఉడుకెత్తింది. దిగ్గునలేచి, 'అలాఅయితే ఆయన్ని యెందుకు కొరత వేశారు ?' అని అడిగాడు. క్లాసుఅయిపోయింతరవాత వచ్చి తెలుసుకోమని మాస్టరు సమాధానమిచ్చాడు. ఇలా మృదువుగా సమాధానమిచ్చేసరికి స్వామినాథన్‌కి ధైర్యంహెచ్చి "ఆయనే

దేవుడయితే మాంసం, చేపలు యెందుకు తిన్నాడు? సారా యెందుకు తాగాడు?" అని ఇంకో ప్రశ్న వేశాడు. స్వామినాథన్ బ్రాహ్మణపిల్లవాడేమో, దేవుడు మాంసాహారికావడం ఊహించలేకపోయాడు. ఈ ప్రశ్నకు మాటలతో జవాబు చెప్పకుండా ఎబెనెజార్ కుర్చీలోనుంచి లేచి మెల్లగా స్వామినాథన్ దగ్గిరికి వెళ్ళి ఎడమ చెవి నులిపి పారేయాలని యత్నించాడు.



ఎబెనెజార్

## III

మర్నాడు స్వామినాథన్ పెందలాడే బడికి వెళ్ళాడు. గంటకొట్టడానికి ఇంకా అరగంట వ్యవధిఉంది. సామాన్యంగా ఆవేళపుడు బడిచుట్టూ తిరిగేవాడు, లేకపోతే పెద్ద చింతచెట్టు కింద దాగుడుమూతలాడేవాడు. కాని ఈ రోజున ఎక్కడో దూరాన కూచుని దీర్ఘాలోచనలోపడ్డాడు. జేబులో పెద్ద ఉత్తరం ఉంది. చేతివేళ్ళతో దానిని తాకినపుడల్లా ఏదో తప్పు చేసినవాడిలా భావించుకోసాగాడు.

ఆ కిందటిరాత్రి భోజనాలవేళ ఎబెనెజార్‌నుగురించి తండ్రితో చెప్పడం వట్టి తెలివితక్కువఅని తనను తాను నిందించుకోసాగాడు.

గంటకొట్టగానే హెడ్డుమాస్టరుగదిలోకి సరాసరి వెళ్ళి ఉత్తరం అందజేశాడు. ఆ ఉత్తరం చదువుకోగానే హెడ్డు మాస్టరుమొహం జేవురించింది.

'అయ్యా!

మీ బడిలో ఒకటవఫారం 'ఎ' సెక్షనులో చదువుతున్న నా కుమారుడు స్వామినాథన్‌ని నిన్న బైబిలుమాస్టరుగారు పిచ్చికోపంతో కొట్టినట్టు మీకు విన్నవించుకుంటున్నాను. హిందూమతప్రసక్తివచ్చినపుడల్లా ఆయన అవమానకరంగానూ, ఎదుటివారిని రెచ్చగొట్టేవిధంగానూ మాటాడుతున్నాడని వింటున్నాను. ఇది పిల్లలమీద చెడుప్రభావం కలిగించితీరుతుంది. ఈ విషయాలలో సహనం ఎంతఅవసరమో చెప్పడానికి తగిన స్థలం కాదిది.

'కొన్ని అనుమానాలు తీర్చుకునేందుకు మా కుర్రవాడు వస్తే, ఆయన క్రూరంగా ప్రవర్తించాడని తెలుస్తోంది. కిందటి సాయంకాలం ఇంటికి వచ్చేసరికి మా కుర్రవాడిచెవులు బాగా ఎర్రబారి ఉన్నాయి.

' మీ బడిలో క్రైస్తవేతరులు చదువుకోవడం మీకు ఇష్టంలేదనేనిర్ణయానికి నేను రావలసివస్తోంది. ఇదే నిజమయితే, ఈ విషయం మాకు తెలియజేస్తే మా పిల్లలను ఇంకొక బడికి పంపుకుంటాం. ఈ మాల్గుడిపట్టణంలో ఉన్నది మీ ఆల్బర్ట్ మిషన్‌స్కూలు ఒక్కటేగాదు. ఈ విషయంలో తగువిచారణ చేసి నాకు దయతో జవాబిస్తారని ఆశిస్తున్నాను. అలా జరుగకపోతే ఈ క్రైస్తవమతవిరుద్ధచర్యల విషయం పై అధికారుల

దృష్టికి తీసుకువెళ్ళటం తప్పనిసరిఅవుతుందని తెలియజేయడానికి విచారిస్తున్నాను.

ఇట్లు
భవదీయుడు,

డబ్ల్యు. టి. శ్రీనివాసన్

స్వామినాథన్ హెడ్డుమాస్టరుగదిలోనుంచి బయటికి వచ్చేసరికి బడిపిల్లలంతా అతని చుట్టూ మూగి ప్రశ్నలవర్షం కురిపించారు. కాని ఆమర్దాగా ఆ పిల్లలు వేసే ప్రశ్నలకు స్వామినాథన్ చిరచిరలాడుతూ మభావం వహించాడు.



సోము

అతనికి నలుగురిలోమాత్రమే విశ్వాసం ఉంది. అతని క్లాసుపిల్లలలోకల్లా ఈ నలుగురంటేనే అతనికి ఎక్కువ యిష్టం. ఎక్కువగా వారినే మెచ్చుకునేవాడు. వారిలో మొదటివాడు సోము. ఆ తరగతి పెద్ద. ఆయలా ఫాయిలాగా తిరిగేరకం. ఏపనైనా పూర్తివిశ్వాసంతో హైరానా పడకుండా చేసుకుపోయేవాడు. ఉపాధ్యాయులతో కూడా స్నేహంగా మెలిగేవాడు. క్లాసుటీచర్లు అతనిని ఒక్క ప్రశ్న అయినా అడిగేవారుకాదు. చదువుసంధ్యలలో ఎక్కువ చురుకుగా ఉండేవాడని చెప్పడానికి వీలులేదు. హెడ్డుమాస్టరు ఒక్కడే అతనిని అదమాయించగలడని అందరినమ్మకం. ఇంచుమించు ఆ క్లాసుకు అతను 'మామయ్య' గా తయారయాడు.

ఇక రెండోఅతను మణి. ఎందుకూ పనికిరాని వాజమ్మ. ఆ క్లాసుపిల్లలలోకల్లా ఘటికుడు. ఎప్పుడోకాని అసలు బడికి పుస్తకాలు తెచ్చేవాడు కాదు. మాస్టరు ఇంటికిఇచ్చిన హోంవర్కువిషయం పట్టించుకునే వాడుకాదు. క్లాసులోకివచ్చి ఆఖరు బల్లను ఆక్రమించి, మహాధైర్యంగా నిద్రబోయేవాడు. అతనిని మంద లించాలని మాస్టర్లుఎవరూ యత్నిం చలేదు. ఒకమాటు ఒక కొత్తమా స్టరు అతనిని మందలించాలని యత్నించి ప్రాణంమీదికి తెచ్చు కున్నాడు. పెద్దవాళ్ళుగాని, చిన్న వాళ్ళుగాని తనదారికి అడ్డంవస్తే



మ ణి

మాత్రం వేధించుకుతినేవాడు. దారినపోతుంటే అతనినిచూసి జనం ఒత్తిగిలేవారు. టోపీ ఒకపక్కకు పెట్టుకుని, చంకకింద అరవనవల పెట్టుకుని, ఏనాటినుంచో బడికి వస్తున్నాడు. స్నేహి తులకంటెఎక్కువగా క్లాసులలో అట్టే వుండేవాడు. స్వామి నాధన్ అతనితో మైత్రికుదిరినందుకు గర్వపడుతూండేవాడు. పిల్లలంతా అతనినిచూసి భయంతో వణికిపోతూంటే, స్వామి నాధన్‌మాత్రం చనువుగా 'మణీ' అని సంబోధించేవాడు. భుజం తట్టేవాడు. 'యీ శక్తి నీ కెలావచ్చింది?' అని స్వామినాధన్ మణినిమెచ్చుకుంటూ ఒకపర్యాయం అడిగాడు. తనవంటిమీాద

చేయి వేసినవాడినడుం విరగగొట్టడానికి ఇంటిదగ్గర రెండు దుడ్డుకర్రలున్నాయని మణి సమాధానంఇచ్చాడు.

ఇక మూడో అతను శంకర్. ఆక్లాసు పిల్లలలోకల్లా చురుకైనవాడు. ఎంత కష్టమైన లెక్క ఇచ్చినా అయిదునిమిషాలలో చేసేసేవాడు. సామాన్యంగా నూటికి తొంభయిమార్కులు తెచ్చుకునేవాడు. మాష్టర్ అడగనక అతను ఎదురు ప్రశ్నలు వేయడం మొదలుపెడితే వారికి నోరుపెగలదని కొంతమంది పిల్లలు నమ్మేవారు. కాని కొంతమంది శంకర్ వట్టి దిష్టిబొమ్మఅనీ, ఇచ్చకాలాడి ముందుగానే లెక్కలు,వాటినిచేసేవిధానం తెలుసుకుని క్లాసుకు వస్తూంటాడని



శంకర్

వాదించేవారు. మాష్టర్ బట్టలు ఉతికి నూటికి తొంభయి మార్కులు వేయించుకునేవాడని ప్రతీతి. బాహాటంగా క్లాసులోనే మాష్టరతో ఇంగ్లీషు మాటాడగలడు. ప్రపంచంలో ఉన్న అన్ని నదులను గురించీ, పర్వతాలనుగురించీ, దేశాలనుగురించీ, అతనికి తెలుసు. నిద్రలో దేశచరిత్ర అప్పగించగలడు. వ్యాకరణం అతనికి నల్లేరుమీందబండి. అతని మొహం తెలివితేటలతో వెలిగిపోతూండేది. కాని ముక్కుమాత్రం ఎప్పుడూ కారుతూండేది. చక్కగా జడవేసుకుని పువ్వులుపెట్టుకొని బడికి వచ్చేవాడు. స్వామినాథన్ అతనిని విచిత్రవ్యక్తినిచూసినట్లు చూసేవాడు. మణి తన అభిప్రాయాలతో ఏకీభవించినపుడు సంతోషించే

వాడు. శంకర్‌ను తను జత కూడనిచ్చేవాడు. మణికి కూడా అతనంటే ఇష్టమే. ఆప్యాయతప్రకటించడానికి శంకర్ వీపుమీద గట్టిగా చరిచేవాడు. తల గోక్కుంటూ ఆ తెలివితేటలు ఇంత కుర్రసన్యాసికి ఎలా వచ్చాయనీ, ఆ తెలివితేటల్లో కాస్తో కూస్తో ఎదటివారికి ఎందుకు పారేయగూడదనీ అంటూండేవాడు.

నాలుగో స్నేహితుడిపేరు సామ్యూయల్. బాగా కురచ. అందుకని అతనికి 'బటాణీగింజ'అని ముద్దుపేరు వచ్చింది. అతనివిషయంలో పెద్దగా చెప్పుకోతగిందేమీ లేదు. సామాన్యుడు. చెప్పుకోతగ్గ కాయపుష్టిగాని, తెలివితేటలుగాని లేవు. స్వామినాధన్‌లాగానే అతనికీ లెక్కలువచ్చేవి కావు. స్వామినాధన్‌లాగానే అతనూ భయస్థుడు; బలహీనుడు, ఉద్రేకి. వారిద్దరికి అనుబంధమల్లా నవ్వు. అర్థంపర్థంలేనివిషయాలను ఇద్దరూ ఇట్టే గ్రహించగలిగేవారు. ఇతరులకు తోచని చిన్నచిన్న విషయాలు వీరికి గిలిగింతలుగా ఉండేవి.



'బటాణీగింజ' సామ్యుయల్

బైబిలుటీచరువిషయంలో తనతండ్రి తీసుకున్న చర్యనుగురించి స్వామినాధన్ తెలపగానే అంతా భేష్‌భేష్ అని చప్పట్లుకొట్టారు. ఇలా ఆమోదాన్ని తెలిపినవారిలో మొదటివాడు సోము. పెద్దపెద్ద పళ్ళికిలిస్తూ తనసమ్మతి తెలియజేశాడు. శంకర్ గంభీరంగా కనిపిస్తూ, "యెవరేమన్నాసరే,

యీ వ్యవహారం మీ నాన్నకి వప్పగించి మంచిపనిచేశావ్''
అన్నాడు. ఇక ఆ ఘటికుడు మణి కళ్ళు సగంసగం మూసు
కుని గుర్రుమంటూ తనఆమోదం తెలిపాడు. ఈవ్యవహారంలో
పెద్దవాళ్లు కలగజేసుకోవడానికి తనవిచారం వెలిబుచ్చాడు.
'యిందులో అర్థమేమీలేదు. యిటువంటివిషయాలు క్లాసు
నాలుగుగోడలూ దాటి వెళ్ళగూడదు. నేనే అయితే పెద్ద
వస్తువేదీ దొరక్కపోతే సిరాబుడ్డి మాస్టారుమీద గిరాటేసి
వ్యవహారంఏమిటో మొదట్లోనే తేల్చేసేవాడిని. సరే, యిప్పుడు
స్వామినాథన్ యిలాచేసినందువల్ల కొంపమునిగిపోయిందేమీ
లేదు. చేతులుముడుచుకుని కూర్చుంటే యింకా అధ్వాన్నంగా
వుండేది. ఊఁ, బైబిలుమాస్టారుని కాసుకోమను. వాడిడొక్క
చీల్చి డోలుకడతాను.'

బటాణీగింజ సామ్యూయల్‌పని ఇరకాటంలో పడింది.
నలుగురితోపాటు తనూ ఏదో ఒకటి అనాలి.కాని అతను క్రైస్త
వుడు. ఎబెనెజార్ చెప్పినదాంట్లో అతనికేమీ తప్పు కనిపించ
లేదు. క్రీస్తు ప్రభువు ఆజ్ఞలలో ఒకదానికి అతనుచెప్పింది
వివరణగా తోచింది. ఎబెనెజార్‌పక్షం వహించడమే ధర్మమని
భావించాడు. ఎబెనెజార్ దుస్తులమీద, ఆకారంమీద వేళా
కోళంగా నాలుగు విసుర్లు విసిరి, అంతటితో ఊరుకున్నాడు.

ఈ విషయం క్లాసుఅంతటా గుప్పుమంది. బైబిలు
క్లాసులో ఏదో దుమారంరేగుతుందని అంతా ఊహించారు.
కాని ఏమీ జరగలేదు. ఎబెనెజార్ పూర్వంలాగా హుషారు
గానే ఉన్నాడు. ఆ రోజున భగవద్గీత గట్టిగా చదువుకువచ్చాడు.
చిత్రమేమంటే ఈ ఉద్గ్రంథాన్ని ఎలాబడితే అలా వ్యాఖ్యా

నించవచ్చు. ఎబెనెజార్ హిందూమతాన్ని ఖండించడానికి దీనిని ఆయుధంగా తీసుకున్నాడు.

అతనిగొంతు పూర్వంలానే ఖంగుమంటోంది. కాని అతనివాదంలో ఎక్కువ పాండిత్యం కనిపించింది. భగవద్గీతను ఆధారంచేసుకుని హిందూమతాన్ని వర్ణించి చెప్పి అసలు భగవద్గీతనే తునాతునియలుగా ఖండించివేశాడు. క్రమక్రమంగా అతని ఉపన్యాసం మజాగా తయారయింది. బల్లమీది బైబిలు సంగతే ఎవరికీ పట్టలేదు.

సరిగ్గా ఆసమయానికి హెడ్డుమాస్టరు చక్కా వచ్చాడు.

ఎబెనెజార్ పాఠం ఆపి, కుర్చీ వెనుకకు నెట్టి, కంగారుగా లేచి నిలబడి హెడ్డుమాస్టరువేపు ప్రశ్నార్థకంగా చూశాడు. హెడ్డుమాస్టరు ఉరిమిచూసి పాఠం కొనసాగించమన్నాడు. ఈ లోపున ఎబెనెజార్ ఎవరూ చూడకుండా వేలు బైబిలులోకి పోనిచ్చి పట్టుకున్నాడు. హెడ్డుమాస్టరు పాఠం కొనసాగించమని ఆదేశించగానే అతను నవ్వు ముఖంతో కన్పించాలని యత్నించాడు. ముడతలుపడ్డ నుదురు సాక్షీగాఅయింది. వేలు పెట్టినచోట పుస్తకం తెరిచి కంటపడ్డ పంక్తులు చదవనారంభించాడు. అవి క్రీస్తుపుట్టుకనుగురించిన వాక్యాలు. శుభోదయం. అవతారపురుషుడు పశువులకొట్టంలో పడిఉన్నాడు. ప్రాగ్దేశపు మహర్షులు నక్షత్రాన్ని అనుసరించి నడిచివస్తున్నారు.

పిల్లలు మాత్రం మామూలుధోరణిలో శ్రద్ధ చూపకుండా వింటున్నారు. ఎబెనెజార్ భగవద్గీతను ఆధారంచేసుకుని హిందూమతాన్ని విమర్శిస్తున్నాడో లేకపోతే క్రీస్తుపుట్టుకను వర్ణించిచెపుతున్నాడో వారి కేమాత్రం పట్టలేదు.

హెడ్డుమాస్టరు కొంచెంసేపు విని మెల్లగా సంజాయిషీ కోరాడు. ఏడాదిపరీక్షలు దగ్గరపడ్డాయి. కాని ఎబెనెజార్, ఇంకా క్రీస్తు పుట్టుక దగ్గరే ఉన్నాడు. శిలువవేయడం, పునర్జన్మ లను గురించి ఎప్పుడు బోధిస్తాడు? ఎప్పుడు పాఠాలు తిరగ వేయిస్తాడు? ఎబెనెజార్ నిర్ఘాంతపోయాడు. చెప్పడానికి ఏమీ తోచలేదు. పాతపాఠాలు తిరగవేయించడానికి ప్రతివారంలో ఆరోజు వినియోగిస్తుంటానని చెప్పి తప్పించుకోగలిగాడు. ఊహుం— వెనకబడి ఉండడమేమిటి? 'అంతిమ భోజనం' దరిదా పులో ఉన్నాడు.

సాయంకాలం బడి వదలగానే స్వామినాథన్‌ని హెడ్డు మాస్టరుగదికి రమ్మని చీటీ వచ్చింది. చీటీ చూసుకోగానే ఇంటికి పారిపోదామని అనిపించింది. గాని, ఆ ముక్క చెప్పగానే మణి అతనిని రెండు చేతులతోనూ దగ్గరికితీసుకొని హెడ్డుమాస్టరుగది దగ్గిరికి ఈడ్చుకువెళ్ళి లోపలకు తోశాడు. స్వామినాథన్ హెడ్డుమాస్టరుముందు గజగజా వణుకుతూ నిల బడ్డాడు.

ఎబెనెజార్ స్కూలు బల్లమీద ముంగిలా కూర్చుని ఉన్నాడు. హెడ్డుమాస్టరు "యేవిఁటీ గొడవ స్వామినాథన్?" అని ప్రశ్నించాడు.

"అబ్బే! యేం లేదండీ" అని స్వామినాథన్ జవాబి చ్చాడు.

"యేఁవీలేకపోతే యీావుత్తరం యేవిఁటి?"

"ఓ"అన్నాడు స్వామినాథన్ అసందిగ్ధంగా ఆశ్చ ర్యపోతూ.

ఎబెనెజార్ చిరునవ్వు చిందించాలని యత్నించాడు. ఈ గొడవంతా వదిలించుకుని ఎపుడు బయటపడదామా అని




"ఏమీ లేకపోతే యీ ఉత్తరమేమిటి?"

ఎదురుచూస్తున్నాడు స్వామినాథన్. దేవుళ్ళను వందమంది ఎబెనెజార్ను వెయ్యి తిట్లు తిట్టేమాత్రం తనదేంపోయింది అనుకున్నాడు.

"నే నిక్కడ వున్నదెందుకో నీకు తెలుసా?" అన్నాడు హెడ్డుమాస్టరు.

స్వామినాథన్ ఏమి జవాబుచెప్పాలా అని ఆలోచించసాగాడు. పిల్లల తలిదండ్రులదగ్గరనించి ఉత్తరాలు అందుకోవడానికి హెడ్డుమాస్టరు అక్కడ ఉండిఉండచ్చు. ఎబెనెజార్ లాంటివాళ్ళని చర్మంవలవడానికి అక్కడ ఉండిఉండచ్చు. ప్రతిసోమవారం పన్నెండుగంటలకు పేంబెత్తంతో ఆరేసి దెబ్బలు కొడతానికి ఉండిఉండచ్చు. వీటన్నిటినీమించి అసలీ ప్రశ్న ఎందుకు వేసినట్టు?

"నాకేం తెలియదండీ!" అని స్వామినాథన్ అమాయకంగా జవాబిచ్చాడు.

"మీవిషయాలు చూడడానికే నే నిక్కడున్నాను." అన్నాడు హెడ్డుమాస్టరు.

ఆప్రశ్నకు సమాధానం ఇంత సామాన్యమైనదవడం స్వామినాథన్‌కు భారందించివేసినట్లయింది.

"అందువల్ల" అంటూ తిరిగి ప్రారంభించాడు హెడ్డుమాస్టరు. "మీకేవయినా సాయంకావాలంటే ముందుగా నాదగ్గిరికి రండి. అంతేగాని మీ తలిదండ్రులదగ్గిరికి వెళ్ళకండి."

స్వామినాథన్ ఎబెనెజార్‌వంక నేరచూపు చూశాడు. ఎబెనెజార్ గిజగిజలాడిపోతున్నాడు.

"యింత చిన్నవిషయం మీ నాన్నగారిదాకా వెళ్ళనిస్తావా, తెలివితక్కువకాకపోతే. సరే, యీవిషయం నేను విచారిస్తాను. యీ వుత్తరం తీసుకెళ్ళి మీ నాన్నగారికి యివ్వు."

స్వామినాథన్ ఉత్తరంతీసుకుని స్థిమితపడి గదిలోనుంచి రివ్వున బయటకు పరుగెత్తాడు.

# రెండో ప్రకరణం

## రాజం - మణి

### I

మాల్గుడీపట్టణ ప్రజలు సగర్వంగా చెప్పుకునేది సరయూనది. నూనెవర్తకులు ఎక్కువగా నివసించే ఎల్లమన్‌వీధినుంచి- అదే ఆ పట్టణానికి ఆఖరువీధి - పదినిమిషాల నడకదూరంలో ఉంది ఆ నది. సాయంకాలం ఆ పట్టణప్రజలంతా ఆ నది ఇసుకతిన్నెలమీదికి షికారువెళుతూంటారు. ఎవరైనా గొప్పవారు ఆ పట్టణం వస్తే పురపాలకసంఘాధ్యక్షుడు వారిని పురమందిరంమీదికి తీసుకువెళ్ళి, వెండిపటకాలా వెన్నెల్లో మెరిసిపోతూ ఉత్తరంగా దూసుకుపోయే సరయూనదిని సగర్వంగా చూపెడుతూంటారు.

మామూలుగా జనం ఇసకతిన్నెలమీదికి జేరుకున్నారు. స్వామినాథన్, మణి దూరంగా పావంచాలమీదకూచుని కాళ్ళు, నీళ్ళల్లో ఆడిస్తున్నారు. నదిమీదకు వంగిన రావికొమ్మలు గలగలా చప్పుడుచేస్తున్నాయి. కొమ్మలమీద చెమురు

వాటుగా ఉన్న ఆకులు పిల్లగాలికి రాలి కింది ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నాయి. పక్షుల కిలకిలారావాలతో గాలి నిండిపోయింది. దూరాన నల్లప్ప మామిడితోపు దగ్గర దిగువున పశువులమంద నదిని దాటుతోంది. పల్లెటూరి ఎద్దులబండి ఒకటి ఆ దారిన వెళ్ళింది. బండివాడు కూనిరాగం తీస్తున్నాడు. సూర్యాస్తమానం అయి పదిహేను నిమిషాలు అయింది. పడమటిదిక్కు ఎర్రబారింది.

'యిక్కడ చాలా లోతుగదూ?' అని మణి అడిగాడు.

'అవును. యెందుకేం ?'

'రాజంను యిక్కడికి తీసుకువచ్చి, కాళ్లూ చేతులూ కట్టేసి నీళ్ళల్లో పారేయడానికి !'

రాజం కొత్తగా వచ్చి, ఒకటోఫారంలో చేరాడు. రెండోటరం ప్రారంభమయినరోజున క్లాసులోకి తచ్చాడుతూ వచ్చి ఆఖరిబెంచిమీద మణిపక్కన కూర్చున్నాడు. అక్కడ కూర్చోడం అతనికి సదుపాయంగానేఉంది గాని, ఇంతలో మణి అతనిడొక్కలో పొడిచాడు. రాజంమాత్రం ఊరుకున్నాడా, తిరిగి మణిడొక్కలో పొడిచాడు.

మొదటిరోజునే మణి బడిపిల్లలందరినీ ముగ్ధులను చేసేశాడు. కొత్తగా బడికివచ్చాడు. చక్కగా దుస్తులు వేసుకుంటాడు. మేజోళ్ళు, బూటులు, బొచ్చుటోపి, టై, పసందయిన కోటూ, నిక్కరు వేసుకునేది అతనొక్కడే. బడికి కారులో వచ్చేవాడు. ఇన్నిహంగులతోపాటు పాఠాలు శ్రద్ధగా చదివేవాడు. అతను ఎక్కడో మదరాసులో ఇంగ్లీషుస్కూలులో చదివి వచ్చాడని పుకార్లు వ్యాపించాయి. అచ్చంగా ఇంగ్లీషు

వాడిలాగే ఇంగ్లీషు మాటాడేవాడు. అందుచేత బడిపిల్లలలో బహుకొద్దిమందికే అతనిమాటలు అర్థమయేవి. తోటివిద్యార్థులకు అతనితో మాటాడడానికి దమ్ములుండేవికావు. వాళ్ళకి వచ్చిన ఇంగ్లీషు చాలాతక్కువ. ఆక్లాసులోకల్లా మహా తెలివిగల శంకరన్ ఒక్కడికే అతనితో ఇంగ్లీషుమాటాడడానికి ధైర్యంఉండేది కాని శంకరన్ఇంగ్లీషుకూడా రాజంఇంగ్లీషు ముందు దిగదుడుపు.

ఈ రాజం మణికి పోటీగా తయారయాడు. అతను మణిని లక్ష్యపెట్టేవాడేకాదు. ఇలాంటి నిర్లక్ష్యానికి మణి అలవాటుపడలేదు. మణి తిడితే రాజం తిరిగీ తిట్టేవాడు. మణి మొట్టికాయలుమొడితే రాజం తిరిగీ మొట్టేవాడు. మణిగనక తన్నితే రాజం తిరిగీ తన్నేవాడు. క్లాసు పిల్లలందరిలోకీ మణి మొనగాడు. కాని రాజం మాత్రం ఏమాత్రం తీసిపోయేవాడుకాదు. దీనికితోడు రాజంకి ఎపుడూ నూటికి డెబ్బయిమార్కులు వస్తూండేవి. మార్కుల్లో శంకరన్ తరవాత రాజం. రాజం క్లాసులో కొత్తగా బలం సంపాదించుకుంటున్న సూచనలు కానవస్తున్నాయి. ఆలోచించినకొద్దీ మణికి జీవితంలో కొత్తబెడద వచ్చిపడిందని రోజురోజుకీ స్పష్టపడసాగింది.

పావంచాలమీాద కూర్చుని మణి రాజంను కాళ్ళు చేతులూ కట్టేసి నదిలో పారేస్తాననడంలో ఆంతర్యం ఇదే. స్వామినాథన్ కొద్దిగా భయం వెల్లడిస్తూ అన్నాడు: "వాళ్ళ నాన్న పోలీసుసూపరింటెండెంటని మరిచిపోయావా?" మణి కొంచెంసేపు మాటాడకుండా ఊరుకుని 'అయితేనేం?

యెపుడో ఒకనాటిరాత్రి నా దుడ్డుకర్రతో వాడి యెముకలు విరగ్గొడతాను చూడు.' అన్నాడు.

'నేనయితేమాత్రం పోలీసువాళ్ళకి దూరంగా వుంటాను. వాళ్ళు బహు చెడ్డవాళ్ళు!' అన్నాడు స్వామినాథన్.

'నీకూ నాకూ సాపత్యమేమిటి? నేను నీలాంటి పిరికి పందనుమాత్రం కాను!'

స్వామినాథన్ పెదవి కొరుక్కుని నిట్టూర్చాడు.

'యింతకీ అసలుసంగతి మరిచేపోయాను. ముందుగానే చెప్తున్నా జాగర్త. నువు ఆ రాజంగాడి వెనకాలబడి తెగ తిరుగుతున్నావు, యెముకలు నుసినుసి అయిపోతాయి తెలిసిందా?'

స్వామినాథన్ వాడివెనకాల తిరగడంలేదు మొర్రో అని బిగ్గరగా గోలపెట్టాడు. మణి స్వామినాథన్‌కు ప్రాణస్నేహితుడు, నాయకుడు గదూ! అటువంటపుడు అతనినితప్ప ఇంకెవరిని గౌరవిస్తాడు? అలా అనుకోవడానికి కారణమేమిటి? స్వామినాథన్‌కు జ్ఞాపకండున్నంతలో అతను రాజందరిదాపులకు కూడా ఎన్నడూ వెళ్ళలేదే! ఓ – రాజం అంటే అతనికి ఎంత అసహ్యం! పడమంత్రిపువెధవ! రాజంతో కలిసిఉండగా మణి ఎప్పుడు చూశాడు? ఆఁ – అవును సోమవారంనాడు డ్రాయింగుక్లాసులో అయిఉంటుంది. ఎంత మొహం తిప్పేసుకున్నా రాజం అతనంత టతనే వచ్చి పలకరించాడు. ఆగాడిదకు పెనసలు చెక్కుకోడానికి చాకుకావాలట! 'అంత అవసరమయితే తిన్నగా కోమటి దుకాణానికి వెళ్ళి కొనుక్కుతెచ్చుకో, నా దగ్గర లేదు'అని స్వామినాథన్ చెప్పాడు. ఓ – రాజంకు మణికి అసలు పోలికేమిటి?

ఇలా చెప్పేసరికి మణికి మహా సంతోషమయింది. అంతవరకు నవ్వనివాడు కడుపుబ్బనవ్వాడు. స్వామినాథన్‌ను పట్టుకుని ఊపి, ప్రేమపూర్వకంగా చెవిమెలిపెట్టేసరికి బిగ్గరగా అరిచాడు. హఠాత్తుగా మణి అడిగాడు 'నే తెమ్మన్నది తెచ్చావా ?'

'ఓ, మణి ! క్షమించు. మా అమ్మ వంటిల్లుదాటి యివతలకు కాలుపెట్టనేలేదు. అందుకని తీసుకురాలేకపోయాను' (మణి తెమ్మన్నది నిమ్మ ఊరగాయ)

'ఆఁ– పోదూ, నువు వట్టి పిరికిపందవి. ఓ– యీ నదీ తీరం – యీ చక్కని సాయంత్రం – యెంత బాగుండేది!...'

## II

రాజం మణీలకుమధ్య తపాలాబంట్రోతుగా తయారయాడు స్వామినాథన్. పసుపుపచ్చని గోడకు వీపులు ఆనించి ఆఖరిబల్లమీద ముగ్గురూ కూచున్నారు. స్వామినాథన్ రాజం మణీలమధ్య కూచున్నాడు. పుస్తకాలు వారిముందు వ్రాతబల్ల మీద ఉన్నాయి. కాని మనసులు మాత్రం ఎక్కడో ఉన్నాయి.

ఒక కాగితంముక్కమీద 'నువు మనిషివేనా ?, అని రాసి మణి స్వామినాథన్‌కు ఇచ్చాడు. స్వామినాథన్ దానిని రాజంకు అందించాడు. కొరకొరాచూస్తూ రాజం ఆ చీటీ చదివి, నలిపి అవతలపారేశాడు. దానిమీద మణి ఇంకో కాగితంముక్కమీద మళ్ళీ ఆ ప్రశ్నే రాసి, దానికింద 'యీ ప్రశ్నకు జవాబురాయకపోతే నువు కుక్కలకొడుకువే' అని

కూడా రాసి పంపించాడు. రాజం స్వామినాథన్ మొహంమీద ఉఫ్‌మని ఊది, 'ఫుండాకోర్! నా చదువుకు అడ్డంరాకు' అంటూ ఆ చీటి మళ్ళీ నలిపిపారేశాడు.

అంతటితో ఆటకట్టింది.

'స్వామినాథన్! లేచి నిలబడు' అన్నాడు టీచరు. స్వామినాథన్ మారుమాటాడకుండా లేచి నిలబడ్డాడు.

'లిస్బన్ దేనికి ప్రసిద్ధికెక్కింది?' అని అడిగాడు టీచరు.

స్వామినాథన్ తటపటాయించి ధైర్యంగా 'స్పెయిన్ దేశానికి రాజధానిగనుక' అని సమాధానమిచ్చాడు.

టీచరు పెదవికొరుక్కుని ఇంకోప్రశ్న వేశాడు. 'ఇండియాశీతోష్ణస్థితినిగురించి నీ కేం తెలుసో చెప్పు.'

'వేసవికాలంలో వేడిగా, చలికాలంలో చలిగా వుంటుంది'

'బెంచీయెక్కు' అని గద్దించాడు టీచరు. స్వామినాథన్ కిక్కురుమనకుండా బెంచీఎక్కాడు. పేంబెత్తంతో పూజచేయకుండా అవమానకరమయినదయినా ఈ చిన్నశిక్ష విధించినందుకు స్వామినాథన్ సంతోషించాడు.

మాస్టరు తిరిగి పాఠం ప్రారంభించాడు. ఆఫ్రికానిండా అరణ్యాలే. అక్కడి నదులలోకల్లా ముఖ్యమైనది నైలునది. అర్థమయిందా? అసలు ఆయన ఏంచెప్పాడు? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పమని మొదటి బెంచిమీద కూర్చున్న వారిలో ఒకకుర్రవానిని అడిగాడు. (ఆఫ్రికాలోని నదులలో నైలునది ముఖ్యమయినది అని ఆ కుర్రవాడు టకీమని చెప్పాడు. టీచరుకు సంతృప్తికలిగింది) నైలు ఏమిటి? (ఆఫ్రికాలో అతి

ముఖ్యమయినసది అని ఒక కుఱ్రవాడు ఉత్సాహంతో చెప్పాడు. కాని అడగకముందే చెప్పినందుకు చివాట్లు తగిలాయి). నిశ్శబ్దం! నిశ్శబ్దం! క్లాసులో అంత గందరగోళమేమిటి? ఇలా గందరగోళంచేస్తే పరీక్షల్లో పెద్ద బండిసున్నా వస్తుంది. ఆ విషయం తను చూస్తాడుగా.

స్వామినాథన్ పాఠాలు శ్రద్ధగా వినలేదు. అతనిమనసు పరిపరివిధాల పోసాగింది. బెంచి మీాద నిలబడ్డాడేమో అందరి కంటె ఎత్తున ఉన్నాడు. తలలు అనేకం కనిపించాయి. టోపీలవారీగా వాటిని విభజించాడు. నాలుగు ఎఱ్ఱటోపీలు, ఇరవయి అయిదు గాంధీటోపీలు, నాలుగు బొచ్చుటోపీలు వగైరా వగైరా.

ఆరోజు పాఠాలు ముగియగానే తమతమ మనసులు విప్పి చెప్పుకోడానికి స్వామినాథన్, మణి, రాజం ఒక మూారు మూాల చేరారు. స్వామినాథన్, రాజం మణీలమధ్య తపాలా బంట్రోతుగా తయారయాడు. గుసగుసలాడుకున్నా ఒకరిమాాట ఒకరికి వినిపించేటంత దగ్గరగా నిలబడ్డారు. కాని మధ్యవర్తి ద్వారామాటాడుకోవడం శత్రువులఅలవాటు. మణి స్వామి నాథన్ మొహంవంక రెప్పలార్చకుండా చూస్తూ 'నువు మనిషివేనా?' అని అడిగాడు. స్వామినాథన్ రాజంకేసి తిరిగి ఆ ప్రశ్నే వేశాడు. రాజం మండిపడి బిగ్గరగా 'యెవ డా అను మాానించే వెధవ?' అని అరిచాడు. స్వామినాథన్ మణికేసి కోపంతో 'యెవ డా అనుమాానించే వెధవ?' అన్నాడు.

'నువు మనిషివని రుజువుచేసుకునే ధైర్యం వుందా?' అని అడిగాడు మణి.

స్వామినాథన్ రాజంకేసి తిరిగి ఆమాటనే తిరిగి పల్లించాడు.

'యెలా ?'

'యెలా ?' అని స్వామినాథన్ మణితో మళ్ళీఅన్నాడు.

'రేపు సాయంత్రం నదిఒడ్డున నల్లప్పతోపుదగ్గర నన్ను కలుసుకో.'

'—నల్లప్పతోపుదగ్గర నన్ను కలుసుకో' అని స్వామినాథన్ సంతోషంతో తిరిగి అన్నాడు.

'యెందుకూ ?' అని అడిగాడు రాజం.

'నా తల పగలకొట్టగలవేమో చూదాం.'

'ఆఁ, ముక్క—ముక్కలుగా !' అన్నాడు రాజం.

ఇంతటితో స్వామినాథన్‌తో అక్కరతీరింది. వారి వారి మాటలు తిరిగి సావకాశంగా చెప్పే వ్యవధి ఈయలేదు. రాజం ఒకచెవిలోనూ, మణి ఇంకోచెవిలోనూ అరవడం మొదలు పెట్టారు.

'అలాఅయితే రేపు నదిఒడ్డున మమ్మల్ని కలుసుకుంటా వన్నమాటేగా ?'

'ఆఁ—' అని రాజం నమ్మబలికాడు.

రాజం ఎవరినయినా పత్తాసు తెచ్చుకుంటాడేమో తెలుకోవాలనుకున్నాడు. ఊహుఁ— తెచ్చుకోడు. మణి ఇంకో సందేహం వెలిబుచ్చాడు: 'కర్మంచాలక యేవఁయినా జరిగితే మీ నాన్నకి తెలియనీయవుగా ?' ఇంకోవిధంగా తాను చేస్తా ననే సూచననే నిరాకరిస్తూ చివరికి రాజం తండ్రికి తెలియనీయ నని వాగ్దానంచేశాడు.

# III

నల్లప్పతోపు కొద్దిగజాలదూరంలో ఉంది. సాయం కాలం ఆరుగంటలుదాటింది. సదిమీాద రాకపోకలు ఆగి పోయాయి. మామూలుగా సాయంకాలం షికారువచ్చేజనం వెనక ఎక్కడో ఉన్నారు. స్వామినాథన్, మణి ఇసకతిన్నెల మీాదికి వెళ్ళి కూచున్నారు. ఒక్కరూ మాటాడలేదు. మణి చంకలో దుడ్డుకర్రపెట్టుకుని నేలకేసి తేరిపారజూస్తూ ఆలో చిస్తున్నాడు...కొంచెంసేపటిలో తాను రాజంతలబద్దలుకొట్టి నీటిలోకి తోసేస్తాడు. కాని శవం బయటపడితేనో? అయితే మాత్రం ఆ పనిచేసింది తానని ఎవరికి తెలుస్తుంది? కాని రాజం దెయ్యమయివచ్చి రాత్రిళ్ళు పీడించుకుతింటే? వాళ్ళ తాత గారు చనిపోయినదగ్గిరనుంచీ ఒంటరిగా పండుకుని నిద్రపోతు న్నాడు. రాత్రిపూట రాజం వచ్చి జుట్టుపట్టుకుని గుంజితే? ఇంతకీ అతనిని చంపకుండాఉండడమే ఉత్తమమేమో? ఏము కలువిరగ్గొట్టి వదిలేస్తేసరి. తలబద్దలుకొడితే ఎవరికి తెలుస్తుంది? ఇతడు – అమాయకంగా కళ్ళుమిణకరిస్తున్న స్వామినాథన్ కేసి దొంగచాటుగా చూశాడు – పోలీసులకు తెలియజేస్తేతప్ప.

బూట్లు చప్పుడయేసరికి వెనుదిరిగి చూశాడు. రాజం ప్రత్యక్షమయాడు. కాకీదుస్తులు వేసుకున్నాడు. చంకలో గాలి తుపాకి ఉంది. ఆ తుపాకి రెండునెలలకిందట పుట్టినరోజు పండుగ నాడు బహుమతిగా వచ్చింది. రనాయించి నిలబడి, 'యిదిగో సిద్ధంగావున్నా' అన్నాడు.

'ఆలస్యంగా వచ్చావే?'

'ఆఁ– అవును'.

'సరే, ప్రారంభిద్దాం'.

రాజం తుపాకి బుజానికిఆనించి గాలిలోకి పేల్చాడు. మణి అదిరిపోయి కొయ్యబొమ్మలా నిలబడ్డాడు. దుడ్డుకర్ర చంకలోనించి జారి కింద పడింది.



రాజం

'తుపాకి మోత విన్నారుగా?' అని అడిగాడు రాజం. అంతగా పోరాడాలని ముచ్చటగావుంటే రా, యీ తడవ తుపాకిగుండు నీ శరీరంలోకి దూసుకుపోతుంది!'

'అన్యాయం! అన్యాయం! నీకేమో తుపాకి వుంది. నాకు లేదాయె... చెయ్యీ చెయ్యీ కలిపితే...'

'అలాఅయితే ఆ దుడ్డుకర్ర తెచ్చావెందుకు? నిన్న దాని సంగతి చెప్పలేదే?'

మణి తల వంచేసుకున్నాడు.

'నీ కింత కోపంరగలడానికి నే నేంచేశాను?' అని అడిగాడు రాజం.

'నేను వట్టి పిరికిపందనని అన్నావుటగా?'

'అబ్బే, వట్టిది.'

ఆ పైన ఎవరూ మాట్లాడలేదు. 'నీ కోపానికి యిదే కారణమయితే యిదంతా మరిచేపో. యిక స్నేహంగాఉందాం.'

'నేనూను' అన్నాడు మణి.

స్వామినాథన్ ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరి అయాడు. మణి ముందు ఎంతగానటించినా, రాజంను మనసులో ఎంతగానో మెచ్చుకుంటూ, అతనిస్నేహంకోసం ఉవ్విళ్ళూరిపోతున్నాడు. అనుకోని ఈ బెడద శుభంగా అంతమయింది. సంతోషంతో గంతులువేశాడు స్వామినాథన్. రాజం తుపాకి కిందికి దించాడు. మణి దుడ్డుకర్ర కిందపారేశాడు. రాజంమీాది ప్రీతిని వెల్లడించడానికి జేబులోనుంచి డజను బిస్కట్లు పైకి తీశాడు.

నదిచేసే రణగొణధ్వని, రావిఆకులగలగల, సాయంసంధ్యకనుచీకటి, ఈ ముగ్గురుస్నేహితులు కొత్తస్నేహపు ఆనందముతో బిస్కట్లుతినడం – స్వామినాథన్‌కి ప్రపంచమంతా శాంతిమయంగా తోచింది.

## మూడో ప్రకరణం

### నాయనమ్మ

భోజనాలగదికి ముందుహాలుకు మధ్య నడవ చీకటిగుహారం. గాలివీచే సదుపాయంకూడా లేదు. ఆ చీకటిగుహారంలోనే స్వామినాయనమ్మనివాసం. అయిదుబొంతలు, మూడు పక్కదుప్పట్లు, అయిదుతలగడదిండ్లు, జనపనారపెట్టె, రాగి డబ్బులు, ఏలకాయలు, లవంగాలు, పోకలతోనిండిన చిన్న కొయ్యపెట్టె ఆమెసరంజామా.

రాత్రి భోజనాలు అయాక నాయనమ్మ ఒళ్ళో తలపెట్టి కరుచుకుపండుకుని ఆ ఏలకుల లవంగాలవాసనలో హాయిగా భద్రంగా ఉన్నట్లు ఎంచుకొంటున్నాడు.
'ఓ నాయనమ్మా!' అంటూ ఒళ్ళుతెలియనిసంతోషంతో అరిచాడు - 'రాజం యెంత గొప్పవాడో నీ కేంతెలుసు?' రాజంకు మణికి మొదట విరోధంరావడం, ఆతరవాత స్నేహం కుదరడం, ఆ కథంతా చెప్పాడు.

'వాడికి సిసలయిన పోలీసుడ్రెస్సు వుంది, తెలుసా?' అన్నాడు స్వామినాథన్.

'అలాగా! అయితే వాడికి పోలీసుదిరీసు యెందుకు?' అని అడిగింది నాయనమ్మ.

"వాళ్ళనాన్న పోలీసుసూపరింటెండెంటు. యిక్కడి పోలీసు బంట్రోతు లందరిమీదా అధికారి." నాయనమ్మకు ఈ మాటలు నచ్చాయి. 'అది తప్పకుండా మహా గొప్పకచేరీ అయిఉంటుంది' అంది. ఆమెభర్త అంటే స్వామినాథన్ తాతయ్య సబ్ మాజిస్ట్రేటుపని చెలాయించినరోజులు ఆమెకు జ్ఞాపకంవచ్చాయి. ఆయనముందు పోలీసులు గజగజ వణికి పోయేవారు. గజదొంగలు పలాయనంచిత్తగించేవారు. ఆ కథ ఎప్పుడు పూర్తిచేస్తుందా అని స్వామినాథన్ ఆదుర్దాగా కాచుకూర్చున్నాడు. కాని ఆమె ఆపలేదు. ఏమిటేమిటో చెప్ప సాగింది. తికమకపడ్డది. వివిధ సమయాలలో జరిగిన వివిధసంఘటనలను కలగాపులగంచేసింది.

"యిక చాల్లే నాయనమ్మా!" అన్నాడు స్వామినాథన్ మొహమాటంలేకుండా. "రాజంనుగురించి యింకా చెపుతా

విను. వాడికి లెక్కల్లో ఎన్నిమార్కులువచ్చాయో తెలుసా?”

“అన్నిమార్కులు వాడివేగదూబాబు!.” అందినాయనమ్మ.

“అబ్బే! నూటికి తొంభయి మార్కులు తెచ్చుకున్నాడు”.

“బలే! కాని నువుకూడా వాడు తెచ్చుకున్నన్ని మార్కులు తెచ్చుకోవడానికి పాటుపడాలి...స్వామీ! మీ తాతయ్య అపుడపుడు జవాబులతో పరీక్షచేసేవాళ్ళనే హడల గొట్టేసేవారు. ప్రశ్నకు జవాబుచెప్పడానికి అందరికీ పట్టే కాలంలో పదోవంతు కాలంలో మీ తాతయ్య జవాబు చెప్పేసేవారు. ఆయనగారి జవాబులు యెంత బాగుండేవంటే, మాస్టర్లు రెండువందల మార్కులు యిచ్చేవారు...యఫ్. ఏ. ప్యాసయినపుడు యెంత పెద్ద మెడల్ను యిచ్చారనుకున్నావు? కొన్నిసంవత్సరాలపాటు దాన్ని నేను డాబుగాపెట్టుకునేదాన్ని. యెప్పుడు తీసేశానబ్బా! ఆఁ— మీ అత్తయ్య పుట్టినపుడు... ఊహుఁ... మీ అత్తయ్య పుట్టినప్పుడుకాదు...మీ నాన్న పుట్టినపుడు...యిప్పుడు గ్యాపకంవచ్చింది. పురుడు పదో రోజున ... ఊహుఁ ఊహుఁ - ముందు చెప్పిందే సరి. మీ అత్తయ్య పుట్టినపుడు...ఆ మెడలు యిపుడు యెక్కడుంది, మీ అత్తయ్యకి యిచ్చాను. యిస్తే అది కరిగించి, నాలుగు గాజులు చేయించుకుంది తెలివితక్కువ సన్నాసి! యిట్టే విరిగిపోయే గాజులు చేయించుకుంది! మన కుటుంబంలోకల్లా అదే వట్టి తెలివి తక్కువది!...”

“అబ్బా! చాల్లే నాయనమ్మా! నువ్వు యెప్పుడూ తాతలనాటి పిచ్చికథలే చెపుతూంటావు. రాజం సంగతి చెపుతా వినవూ?”

"ఆc– వింటూ, బాబూ! వింటూ."

"మరే, నాయనమ్మా! రాజం చిన్నపుడు పెద్దపులిని చంపాడు."

"పెద్దపులినే! బలేధైర్యస్తుడు!"

"నన్ను సంతోషపెట్టాలని అలా అంటున్నావుగాని, నా మాటల్లో నీకు నమ్మకంలేదు."

స్వామినాథన్ మహా హుషారుగా కథచెప్పడం ప్రారంభించాడు: రాజంనాన్న అడివిలో మకాంవేశాడు. కూడా కొడుకుని తీసుకువెళ్ళాడు. హఠాత్తుగా రెండు పెద్దపులులు వారిమీదికి ఉరికాయి. ఒకటి వెనకాలేవచ్చి స్వామినాథన్ తండ్రిని కిందపడేసింది. రెండోది రాజంవెంటపడింది. అపుడు రాజం ఒక పొదచాటున నక్కి, తుపాకితో కాల్చి చంపాడు. నాయనమ్మా! నిద్రపోతున్నావా?" అని అడిగాడు స్వామినాథన్ కథ ముగించి.

"అబ్బే! నిద్రపోవడంలేదు బాబూ! వింటున్నా".

"అలాఅయితే చెప్పు, యెన్ని పెద్దపులులు యెంతమంది మీదికి వురికాయి?"

"రెండు పెద్దపులులు రాజంమీదికి వురికాయి" అంది నాయనమ్మ.

నాయనమ్మ సరిగా చెప్పలేకపోయేసరికి స్వామినాథన్‌కి కోపంవచ్చింది. "నేను గొంతుక బొంగురుపోయేట్లు గొప్ప గొప్పవిషయాలు చెపుతూంటే నువు నిద్రపోతూ యేవేవో



కథ సగంలో స్వామినాథన్ గురక ఆమె కథనానికి కళ్ళెం వేసింది.

వూహిస్తావు. యిక నీకు నేనేమీ చెప్పను. నీ కింత ముభావం యెందుకో నాకు తెలుసు, రాజం అంటే నీకు గిట్టదు.''

''అబ్బెబ్బే! రాజం ముద్దులమురిపెం'' అంది నాయనమ్మ ఎన్నడూ రాజంను చూడకపోయినా...స్వామినాథన్ సంతోషించాడు. కాని మరుక్షణంలో ఒక అనుమానం వచ్చిపడింది. 'నాయనమ్మా, ఆ పెద్దపులిగొడవ నువు నమ్మావుకదూ?''

''అబ్బే! అందులో ప్రతిఅక్షరం నమ్ముతున్నా బాబూ!'' అంది నాయనమ్మ బుజ్జగిస్తూ. స్వామినాథన్ సంతో

పించాడు. వాడిని అబద్ధాలకోరని యెనరన్నా అంటే, ఆ అన్న వాళ్ళని తుపాకీతో పేల్చేస్తాడు' అన్నాడు భయపెడతానికి.

నాయనమ్మ ఆ వైఖరికి ఆమోదం తెలిపి, హరిశ్చంద్రుడి కథ చెప్పనియ్యమని బతిమాలింది. హరిశ్చంద్రుడు అన్నమాట నిలబెట్టుకోవడానికి రాజ్యంపోగొట్టుకున్నాడు, భార్య పుత్రులను పోగొట్టుకున్నాడు. కాని చివరికి అందరూ అతనికి దక్కారు. కథ సగంలో స్వామినాథన్ గురక ఆమె కథనానికి కళ్ళెం వేసింది. ఆమెకూడా పండుకుని నిద్రపోయింది.

## II

శనివారం మధ్యాహ్నం. శని ఆదివారాలు అపురూపంగా వస్తాయిగాబట్టి ఇంటిదగ్గిర కూచుని నాయనమ్మతోను అమ్మతోను బాతాఖానీ వేస్తూనో, లెక్కలు చేస్తూనో కాలం వృథాపుచ్చడం స్వామినాథన్‌కు నచ్చలేదు. మధ్యాహ్నంవేళ అక్కడికీ ఇక్కడికీ బలాదూరు తిరగకుండా ఇంటిపట్టునే ఉండి, పాఠాలు చదవాలని స్వామినాథన్‌తండ్రి కఠినంగా ఆజ్ఞాపించాడు. కాని ఈ ఆజ్ఞలను స్వామినాథన్ ఎప్పుడయినా పాటిస్తేనా ?

స్వామినాథన్ చదువులగదిలో ఆదుర్దాగా కూర్చుని, ఇంగ్లీషు వాచకంలోని ఒకపద్యానికి అర్థంలాగాలని యత్నిస్తున్నాడు. వాళ్ళనాన్న అద్దంముందు నిలబడి తలపాగా చుట్టుకుంటున్నాడు. సిల్కుకోటు వేసుకున్నాడు. ఇక కళ్ళజోడు పెట్టుకోవాలి. స్వామినాథన్ ఇదంతా జాగ్రతగా పరిశీలిస్తు

న్నాడు. సరే, కళ్ళజోడు పెట్టుకోవడం అయింది. ఇక మిగిలిం దల్లా గడియారం.

స్వామినాధన్‌కి సంతోషం పొంగిపోయింది. ఇక వాళ్ళ నాన్న కోర్టుకి వెళ్ళిపోతాడు. వాళ్ళ అమ్మ ఒకచేత్తో మంచి నీళ్ళగ్లాసు, ఇంకోచేత్తో తమలపాకులు వక్కలు పెట్టిన తబుకు పట్టుకుని చక్కావచ్చింది. వాళ్ళనాన్న మంచినీళ్ళుతాగి చేయి చాచాడు. ఆమె ఆయనకి వక్కపేడు, చక్కగా చుట్టలు చుట్టిన అరడజను తమలపాకులు అందించింది. అన్ని ఒకమాటే నోట్లో వేసుకుని సంతృప్తిగా నమలసాగాడు. స్వామినాధన్ గొంతెత్తి బిగ్గరగా 'బొచ్చుగొర్రె'మీాది పద్యం చదవసాగాడు. వాళ్ళనాన్న వెండి పొడుండబ్బీకోసం చుక్కలజేబురుమాలు కోసం గడబిడగా వెదకసాగాడు. ఆ జేబురుమాలు ఎన్నడయినా ఉతికిన పాపానపోతేనా! గొడుగు చేతికితగిలించుకున్నాడు. ఇక బయలుదేరడమే ఆలస్యం. స్వామినాధన్ పుస్తకం మూసేసి లేచాడు. వాళ్ళనాన్న గదిలోనుంచి బయటకు అడుగుపెట్టాడు. కాని స్వామినాధన్ బల్లకిందగా కాలుతో నేల తన్నాడు. వాళ్ళఅమ్మ వాళ్ళనాన్నను ఆపి అంది: "యింతకీ మరచాను. నాకు కాసిని చిల్లరడబ్బులు కావాలి. యివాళ దర్జీవాడు వచ్చి కూచుంటాడు. నాలుగురోజులనుంచి డబ్బులకోసం నన్ను వేధించుతున్నాడు."

"రేపు రమ్మందూ" అన్నాడు స్వామినాధన్‌నాన్న. కాని తల్లి మాత్రం పట్టినపట్టు విడవలేదు. వాళ్ళనాన్న బీరువా దగ్గరికి వెళ్ళి, తాళంచేతులకోసం వెదికి బీరువా తెరిచి, పర్సు బయటికితీసి ఆమెకు చిల్లరడబ్బులు ఇచ్చాడు. "యిక నెల

పొడుగునా యెలా సంబాళించడమో తోచకుండావుంది" అన్నాడు. పర్సులోనిడబ్బు చూస్తూ బీరువాకితాళంవేసి, అద్దం ముందు తలపాగా సవరించుకుని పెద్దచిటికెడు పొడుంతీసి రుమాలుతో ముక్కు తుడుచుకుని వెళ్ళిపోయాడు.

స్వామినాథన్ పీడావిరగడయినట్టు సంతోషించాడు.

"తలుపు వేసుకో" అని కేకవేశాడు వాళ్ళ నాన్న వీధిగుమ్మంలోనుంచి. స్వామినాథన్‌కి గడియవేసినచప్పుడు వినిపించింది. కిటికీలోనుంచి తండ్రి వీధిమలుపు తిరిగేవరకు చూస్తూ కూర్చుని, ఆ తరువాత లేచాడు.

అతని తల్లి వంటింట్లో మధ్యాహ్నం కాఫీవిషయం వంటకత్తెకు చెపుతూంది. నాయనమ్మ పక్క మీద కూచునిఉంది. స్వామినాథన్ కంటపడగానే ఆమె'రా నాయనా'అని పిలిచింది.

"ఊహుఁ, యిపుడు నాకు టైం లేదు"

"బాబువు కదూ రా మూడుకానులు యిస్తాగా, రా"

స్వామినాథన్ డబ్బులకు ఆశించకుండా ఉరుక్కుంటూ బయటకు పరుగెత్తాడు.

"యెక్కడికి వెళ్ళడం ?" అని వాళ్ళఅమ్మ అడిగింది.

"వెళ్ళాలి" అన్నాడు స్వామినాథన్ గంభీరంగా.

"యెండలో బలాదూరు తిరగడానికేగా ?"

"అబ్బే!" అని ముక్తసరిగా జవాబిచ్చాడుస్వామినాథన్.

"యిష్టంవచ్చినట్టు తిరిగేది, జ్వరం తెచ్చుకునేది !"

"అబ్బే ! అమ్మా ! నేనేం బలాదూరుతిరగనులేవే."

"సెలవురోజున కదలకుండా యింటిపట్టునే వుండమని మీనాన్న చెప్పలా ?"

"అవునవును. కాని, మా డ్రాయింగు మాష్టారు యెందుకో కనిపించమన్నారు. మాష్టారు రమ్మన్నా వెళ్ళ గూడదన్న మాట! డ్రాయింగుపరీక్షలో నేను తప్పడం నీకు పరమానందంగా వుంటుంది కాబోలు" అనికూడా అన్నాడు. కఠినంగా.

## III

స్వామినాథన్ గ్రోవ్‌వీధి దిగువకు పరుగెత్తి కుడిచేతి వేపుకు తిరిగి, ఆబూసందుగుండాపడి వెళ్ళి బూజుపట్టినఇంటి ముందు నుంచుని సన్నగా ఈలవేశాడు. ఆయింటికప్పుకూడ కిందకువుంది. ఈలవేసి ఒకనిమిషముఆగి చూసి మళ్ళా ఈల వేశాడు. దర్వాజా కిర్రుమని కొద్దిగా తెరుచుకుంది మణి తలుపుసందులోనుంచి తల బయటకుపెట్టి "ఓరి దద్దమ్మా! మా అత్తయ్య యింట్లో వుంది. లోపలికిరాకు. వెళ్ళి అక్కడ నాకోసం కాచుకునివుండు" అన్నాడు.

స్వామినాథన్ వెళ్ళి ఒక చెట్టుక్రింద నిలబడ్డాడు. ఎండ మండిపోతోంది. వీధిలో ఎవరూలేరు. ఒక గాడిదమాత్రం మురుగుకాలవప్రక్కన నిలబడి ఓపిగ్గా నీడ చూసుకుంటోంది. ఆవు ఒకటి వెడల్పాటి అరటిఆకు నములుతోంది. ఇంతలో మణి ఇంట్లోనుంచి చల్లగా బయటపడ్డాడు.

రాజంతండ్రి 'లాలే ఎక్స్టెన్షన్'లో నివసిస్తున్నాడు. (మాల్గుడి సర్కిల్‌కి ఒకప్పుడు సూపరింటెండెంటు ఇంజనీరుగా పనిచేసిన సర్ ఫ్రెడరిక్ లాలేపేరు ఆ పేటకు పెట్టారు.) ఆ పేటలో శుభ్రమయిన బంగళాలు యాభై ఉన్నాయి. వాటిల్లో ఎక్కువగా గవర్నమెంటు ఉద్యోగులే నివసిస్తున్నారు

ఈ బంగాళాలముందు కొద్దిగజాలదూరంలోనె తిరుచినాపల్లికి వెళ్ళే రహదారి ఉంది.

స్వామినాథన్, మణి రాజంఇంటికివెళ్ళేదోవంట భయ పడుతూ భయపడుతూ బయలుదేరారు. యూనిఫారంవేసు కున్న ఒక పోలీసు ఆగమని కేకవేసి, వారివేపుకే పరుగెత్తు కుంటూ వచ్చాడు. స్వామినాథన్‌కి వెనక్కితిరిగి పారిపోవడం మంచిదనిపించింది. పోలీసుతో మాటాడమని మణిని వేడు కున్నాడు. 'ఇక్కడేంచేస్తున్నారు?' అని అడిగాడు వారిని పోలీసు. మణి సిర్లక్ష్యంగా "రాజం యింట్లోవున్నాడేమో చూచిపోదామని వచ్చాం. మమ్మల్ని రమ్మని చెప్పాడు" అన్నాడు. దానిమీద పోలీసు వెంటనే లొంగివచ్చి, రాజం గదికి వారిని తీసుకువెళ్ళాడు.

ఆ గది పెద్దది. గదినిండా కుర్చీలు. పెద్దబల్ల. బల్ల మీద శుభ్రంగా రాజంపుస్తకాలు తీర్చిపెట్టి ఉన్నాయి. బల్లమీదిగడియారం వారిని ముగ్ధులను చేసింది. ఇంత చిన్న పిల్లవాడికి స్వంతగడియారం! వాళ్ళనాన్న బలేవాడయి ఉండాలి!

ఇంతలో రాజం గదిలోకి చక్కావచ్చాడు. స్నేహి తులు తనకోసం గదిలో కాచుకునిఉన్నారన్నసంగతి అతనికి తెలుసు. అయితే వాళ్ళనాన్న స్నేహితులను కాసేపు కాచుకు కూర్చోనిచ్చి ఆతరవాత వెళ్ళి కలుసుకునేవాడు. తనూ చేయ వలసిందే. అందుకని పక్కగదిలో గోళ్ళుగిల్లుకుంటూ కాసేపు నిలబడ్డాడు. ఇంక ఉండబట్టలేక స్నేహితులదగ్గరికి ఒక్కఉరుకు ఉరికాడు.

"కూచోండి, కూచోండి" అన్నాడు వారు నిలబడే ఉండడంచూసి.

కొద్దినిమిషాల్లో పిచ్చాపాటీ, మాస్టర్లనుగురించీ, స్కోటిబడిపిల్లలనుగురించీ, వాళ్ళవాళ్ళ తలిదండ్రులనుగురించీ, ఆటవస్తువులనుగురించీ, ఆటలనుగురించీ మాటాడుకోసాగారు.

వారిని రాజం ఒకఅలమారుదగ్గరికి తీసుకెళ్ళి తెరిచి చూపాడు. దానిలోని బొమ్మరెళ్లు, మోటారుకార్లు, చిత్రవిచిత్రమైన బొమ్మయంత్రాలు, మాజిక్ లాంతరు, సైడ్లు, బోలెడన్ని బొమ్మలపుస్తకాలు, ఇంకా వందలకొలది ఇతరవస్తువులు చూచి ఆశ్చర్యంతో కొయ్యబారిపోయారు. ఒకమూల నిలబెట్టిఉన్న గాలితుపాకి అన్నిటికంటె ఎక్కువగా మణిని ఆకర్షించింది. ఎవరికిష్టంవచ్చినవస్తువు వారు తీసుకుని చూడవచ్చని రాజం చెప్పాడు. ఇంకేం, కొద్దినిమిషాల్లో స్వామినాథన్ ఒక ఇంజన్ని గదిఅంతటా పరిగెత్తించసాగాడు. మణి విల్లుతీసుకుని ఎదురుగోడను బాణంమీద బాణంవేసి కొట్టసాగాడు. బాణాలువేసీవేసీ విసుగెత్తింది. తుపాకితీసుకుని సీసపుగుండ్లతో గదిలోని సామాన్లు పాడుచేశాడు.

"ఆకలేస్తోందా?" అని అడిగాడు రాజం.

"లేదు" అన్నాడు మొహమాటపడి.

"హే" అని కేకవేశాడు రాజం. ఒక పోలీసు జవాను చక్కావచ్చాడు.

"వెళ్ళి ముగ్గురికి కాఫీ, టిఫిను తీసుకురమ్మని వంటవాడితో చెప్పు". ఆవిధంగా పోలీసుమీద రాజం అధికారం

చెలాయిస్తూ మాటాడడంతో అతని స్నేహితులకు ఆశ్చర్యం వేసింది. రాజంను ఎంతగానో మెచ్చుకోసాగారు.

పెద్దపళ్ళెంలో తినుబండారాలు పెట్టుకుని వంటవాడు చకచకావచ్చి, పళ్ళెం బల్లమీద పెట్టాడు. స్నేహితులకి వంటవాడిమీద అధికారం చెలాయించిచూపాలని రాజంకు బుద్ధి పుట్టింది.

"బల్లమీదనుంచి పళ్ళెంతీసేయ్" అని గద్దించాడు రాజం. వంటవాడు పళ్లెం బల్లమీదనుంచి తీసి కుర్చీలోపెట్టాడు.



'తినాలనివుంటే వంటింట్లోకి వచ్చి తినండి ........."

"వెధవగాడిద! అక్కడ పెడతావేం, తీసేసెయ్!"

"అయితే మరి యెక్కడపెట్టమంటావ్, రాజం!" అని అడిగాడు వంటవాడు.

రాజం మండిపడుతూ "దొంగవెధవ! యెదురు చెపుతావా? ఊఁ –"

వంటవాడు మొహం ముడుచుకుని ఏదో గొణిగాడు.

"బల్లమీద పెట్టు" అని అదమాయించాడు రాజం. వంటవాడు పళ్ళెం బల్లమీదపెడుతూ "యిలా వేపుకుతింటే అమ్మగారితో చెపుతా" అంటూ గొణిగాడు.

"ఊఁ – పో– పోయి చెప్పుకో. చెప్పుకుంటే నాకేం భయమా!" అని జవాబిచ్చాడు రాజం.

వంటవాడు ఒక్కక్షణం పైకిచూసి, నెమ్మదిగా పళ్ళెం పైకెత్తి "తినాలనివుంటే వంటింట్లోకివచ్చి తినండి" అంటూ పళ్లెం తీసుకుని చక్కాపోయాడు.

ఎపుడు తినుబండారాలు తిందామా అని లొట్టలు వేస్తున్న స్వామినాథన్‌కి మణికి ఆశాభంగమయింది. కాని రాజంకు ఇది పెద్ద దెబ్బ. నౌకరుకూడా ఖాతరుచేయక పోవడం, అందులోనూ స్నేహితులముందు! కొద్ది నిమిషాల సేపు మాటాడకుండా కూచుని, నవ్వుతెచ్చిపెట్టుకొని "వెధవ! వాడు పట్టి బఫూను ...... ఒక్కనిమిషం ఆగండి" అంటూ లోపలికి వెళ్ళాడు.

కొంచెంసేపయినతరవాత రాజం స్వయంగా పళ్ళెం పుచ్చుకొని తిరిగివచ్చాడు. నౌకరుముందు రాజం ఎందుకూ కొరగాకపోవడం వారికి ఆశ్చర్యంగొలిపింది. రాజం వంట

వాడిని వంచలేకపోయాడని తేలిపోయింది. వంటవాడిని రాజం తుపాకితో ఎందుకు కొట్టిచంపలేదో స్వామినాథన్‌కి బుర్ర బద్దలుకొట్టుకున్నా అర్థంకాలేదు. వంటవాడిని కొద్దినిమిషాల సేపు తనకు అప్పగించి చూడమని అడుగుదామనుకున్నాడు మణి. కాని రాజం "యిది నేనే స్వయంగా తీసుకురావలసి వచ్చింది. లోపలికి వెళ్ళి వాడి తలపాగరు వదిలేటట్లు ఒక్క తన్ను తన్నాను. దాంతో వాడు స్మారకం లేకుండా వంటింట్లో పడివున్నాడు" అని వివరించి చెప్పేసరికి వారి మనసులు కుదుటపడ్డాయి.

# నాలుగో ప్రకరణం

## తోక అంటే?

### I

భూగోళంమాస్టరు క్లాసుకు రాలేదు. ఒకటోఫారం ఎ డివిజను విద్యార్థులకు బుధవారం మూడు మూడు ముప్పావు మధ్య ఆటవిడుపు.

ఎలానో స్వామినాథన్ ఒంటరిగా దిగబడిపోయాడు. స్నేహితులెవరూ కలవలేదు, ఇన్ఫెంటుక్లాసువసారాలో అటూ ఇటూ తిరిగాడు. స్వామినాథన్ నాలుగడుగులయినా ఎత్తు లేడు. అయితేనేం. అతనికి ఇన్ఫెంటు క్లాసుపిల్లలు చీమల్లా అనిపించారు. వాళ్ళందరికంటె తాను గొప్పవాడనీ పెద్దవాడనీ అనిపించింది. నమూనాలు తయారుచేయడానికి వాళ్ళు అడుసు పిసుకుతూంటే అతనికి అసహ్యంవేసింది. బడిలో ఇలాంటి పనులు చేయడంలో అర్థం కనిపించలేదు. ఎవరి ఇంటివెనకదొడ్లో వాళ్ళు ఏనుగులు మామిడిపళ్ళు, ఒక చేమిటి

ఏదిపడితే అది తయారుచేసుకోవచ్చుగా. ఇలాంటివి తయారు చేయడానికి అంతదూరం బడికి రావడమెందుకు ? భూగోళం, లెక్కలు, బైబిలు, ఇంగ్లీషులాంటి పెద్దపెద్ద విషయాలు నేర్చుకోవడానికి బడి.

ఒకగదిలో పిల్లలంతా అరవఅక్షరాలలోని మొదటి రెండుఅక్షరాలు ఒకేసారి వల్లెవేస్తున్నారు. చెవులు మూసుకున్నాడు. ఆ గందరగోళాన్ని మాస్టరు ఎలా తట్టుకోగలుగుతున్నాడా అని ఆశ్చర్యపోయాడు. ముందుకుసాగాడు. ఇంకో గదిలో పిల్లలు గొడవగొడవ చేసేస్తున్నారు. వాళ్ళనంటిమీద బట్టలుకూడా సరిగాలేవు. బెంచీలమీద కూర్చుని కాళ్ళుఊపుకుంటూ వాళ్ళుచేసే కాకిగోల స్వామినాథన్ భరించలేకపోయాడు. ఒళ్ళు మండిపోయింది. తనకోపం మాస్టరు గ్రహించేటట్టు చేయాలని మొహం మాడ్చి ముడుచుకున్నాడు. కాని దురదృష్టవశాత్తూ మాస్టరు స్వామినాథన్‌వేపు తిరిగిలేడు.

రెండుమూడుఫారాల గదులలోకి వెళ్ళే మెట్లు దిగువన ఆగాడు. పైకి వెళ్ళి ఆ క్లాసులు చూసి రావాలని బుద్ధి పుట్టింది. ఎపుడు ఆ క్లాసుల్లో కూచుందామాఅని ఉవ్విళ్ళూరుతున్నాడాయె! రెండు మూడు మెట్లు ఎక్కి మనసుమార్చుకున్నాడు. ఆ క్లాసులు తీసుకునేది హెడ్మాస్టరు. ఆయన అక్కడ ఉండొచ్చు. ఆ క్లాసుమాస్టర్లు చనువుగా దగ్గరికి రానిచ్చేవారుకాదు. ఇక ఆ క్లాసుపిల్లలో వట్టి కొంటెముఠా. దూరాన్నుంచి చెప్పులకిరకిర వినవచ్చింది. హెడ్మాస్టరు అడుగులచప్పుడని గ్రహించాడు. అక్కడ పట్టుబడడం అతనికి ఇష్టంలేదు. అనవసరంగా సంజాయిషీ ఇచ్చుకోవాలి.

అతనిజట్టుకుర్రాళ్లు బళ్ళో లేరనుకున్నాడు. కాని, హఠాత్తుగా వాళ్ళు కనిపించేసరికి ఆశ్చర్యపోయాడు. రాజం, మణి మినహా తక్కినవాళ్ళంతా అక్కడే ఉన్నారు. పెద్ద చింతచెట్టుకింద వాళ్లు ఏదో ఆడుకుంటున్నారు. సంతోషంగా కేరింతలుకొడుతూ స్వామినాథన్ వెళ్ళి వాళ్ళల్లో కలిశాడు. కాని ఎవరూ అతనిని పలకరించలేదు. మనసు చివుక్కుమంది. అతనికేసి చిరునవ్వుపారేసి, మళ్ళీ ఆటలోపడ్డారు. ఎప్పుడూ హుషారుగాఉండే సోము మొహంమాడ్చుకోవడం స్వామినాథన్‌కు మరింత ఆశ్చర్యంగొలిపింది. ఎక్కడో ఏదో పొరపాటుఉంది. స్వామినాథన్ బతిమాలుతున్న గొంతుతో "నన్ను ఆడనివ్వండిరా" అని బిగ్గరగా అన్నాడు. కాని ఒకరూ జవాబివ్వలేదు. స్వామినాథన్ కొంచెంసేపు ఆగి ఆటలోచేరడానికి కాచుకునిఉన్నానని చెప్పాడు.

"ఊహు ! ఉన్నవాళ్ళు చాలు. కొత్తవాళ్ళని చేర్చుకోం" అని శంకర్ నిర్మొహమాటంగా జవాబుచెప్పాడు.

"కొంతమంది తోకలుగా తయారవడంలో మహా మొనగాళ్ళు !" అన్నాడు బటాణీగింజ. ఈ మాటకు తక్కిన పిల్లలంతా ఫక్కుననవ్వారు.

"యేమిటి ? తోకఅనికదూ అన్నావు ?" అన్నాడు శంకర్ "యిపుడు తోకసంగతి యెందుకువచ్చింది ?

"నా యిష్టం. నా యిష్టమొచ్చినట్లు మాటాడతాను. నీకేం ? యేమయినా నిన్నేమనలేదులే !"

"సరే బాగుంది. మరి యిక్కడవారిలో యెవర్నన్నా వుద్దేశించి అన్నావా ?"

"కావచ్చు"

"యింతకీ తోక యేమిటి?"

"గాడిదలకు కుక్కలకు వెనకాల వేలాడేది!"

ఇది తనను మనసులో పెట్టుకుని అన్నముక్కని మాత్రం స్వామినాథన్ గ్రహించాడు. అంతకుమించి అతనికేమీ బోధ పడలేదు. చెంపలు వేడెక్కాయి. ఏడుపువచ్చింది.

గంటకొట్టారు. ఎవరిదారినవారు క్లాసుల్లోకి పరుగెత్తారు. స్వామినాథన్ కూడా వెళ్ళి తనసీటులో కూచున్నాడు. మొహం ఎర్రగా కందగడ్డలా ఉంది.

అది ఇంగ్లీషుపీరియడు. వేదనాయగం పాఠంచెప్తున్నాడు. ముందుతరాలవారికోసం చెట్టునాటిన ముసలి తాతయ్యకు రాజుగారు పదిరూపాయలు బహూకరించడంకథ చదివి వినిపిస్తున్నాడు. కాని స్వామినాథన్ బుర్రలోకి ఒక్క మాటకూడా ఎక్కలేదు. అందులో అంతా బాధా, ఖాళీ. కర్మంచాలక మాస్టరు ఏదయినాప్రశ్న వేస్తే పప్పులోకాలు వేసేవాడే. ఆ గంటంతా బెంచీమీద నిలబడవలసివచ్చేది. కాని అదృష్టం కలిసివచ్చింది.

క్లాసు ఆఖరయింది. ఒంటరిగా, నెమ్మదిగా ఇంటి మొహంపట్టాడు. కాని మనసుమాత్రం ఏం బాగుండలేదు. ముందు కొద్దిగజాలదూరంలో సోము నడిచివెళుతున్నాడు. స్వామినాథన్ "సోమూ! సోమూ! ... సోమూ, కాస్త ఆగు సోమూ" అని బిగ్గరగా అరిచాడు. స్వామినాథన్ వచ్చేవరకు సోము ఆగి నిలబడ్డాడు. కొద్దిసేపు ఎవరూ మాటాడలేదు. స్వామినాథన్ గద్గదస్వరంతో "యేమిటిగొడవ" అని అడిగాడు.

"అబ్బే ! మరేంలేదు" అని జవాబిచ్చాడు సోము.

"అన్నట్టు నీకు కొత్తపేరువచ్చింది తెలుసా ? తోక ! సరిగా చెప్పాలంటే రాజంతోక ! నీకంటికి మేం ఆనతామా! అందరూ పోలీసు సూపరింటెండెంటుకొడుకులు యెలా కాగలుగుతారు? " ఇలా అని సోము చక్కాపోయాడు.

ఇలాంటి దెబ్బతినడం స్వామినాథన్‌కు జీవితంలో ఇదే మొదలయిఉంటుంది. మెదడు పనిచేయలేదు. కొంతసేపటికి తిరిగీ మెదడు పనిచేయడం ప్రారంభించినతరవాత మేలుకుని ఉన్నానా? కలకంటున్నానా? అని కొద్దిగా అనుమానం వేసింది. సోము ఎంతో మంచివాడు, ఎంత నెమ్మదస్తుడు! ఆ సోమేనా అయిదునిమిషాలకిందట ఇలా మాటాడింది? రాజంతో కలిసి మెలిసి తిరిగితే తప్పేమిటి? వాళ్ళకి అంత కోపమెందుకు?

ఇంటికివెళ్ళి కోటు, టోపి, పుస్తకాలు బల్లమీదకు గిరాటువేసి చల్లారిపోయిన కాఫీ గుటుక్కున తాగేసి, వినాయకమొదలివీధికి మణిపూసలాఉన్న మురికికాలవ వంకరటింకరలవంక దిగాలుపడిచూస్తూ కూర్చున్నాడు. నల్లటినీళ్లు జోరుగా ప్రవహిస్తున్నాయి. కాగితంముక్కలు, ఆకులు, కర్ర ముక్కలు తేలియాడుతున్నాయి. ఒక చిన్న తగరంముక్క మెలమెల్లగా మునుగుతూ తేలుతూ కొట్టుకుపోతోంది. మురికి కాలవలో చేయిపెట్టి ఆ తగరంముక్కను పైకితీయాలని స్వామినాథన్‌కి అనిపించింది. కాని దానిదారినదాన్ని పోనిచ్చాడు. మనసుమనసులోలేదు. తళతళామెరుస్తూ తగరంముక్క కొట్టుకు పోతూంటే చూస్తూ కూర్చున్నాడు. ప్రహరీగోడచివరికి చేరింది. చెట్టుకిందగా పోతోంది. తగరంముక్కకి ఇటుకరాయి

అడ్డంవచ్చింది. స్వామినాథన్‌కు కోపం వచ్చింది. ఇటుక రాయి దారికి అడ్డంలేకుండా ముందుకు సాగిపోనన్నా సాగిపోవాలి లేదా ప్రక్కకి తప్పుకోనన్నా తప్పుకోవాలి అన్నాడు స్వామినాథన్. తగరంముక్క దానంతటదే తప్పించుకుని బర్రున సాగిపోతూ వీధిచివరి మలుపులో మాయమయిపోయింది. స్వామినాథన్ ఇంటికి పరుగెత్తి ఒక తావు కాగితం తీసుకొచ్చి పడవచేశాడు. చీమ ఒకటి అటూఇటూ తిరుగుతూ అతని కంటపడింది. జాగ్రత్తగా దాన్నిపట్టుకుని కాగితంపడవలో వేసి, పడవ నీళ్ళల్లో వదిలాడు. అది గబగబా వెళ్ళిపోతూంటే చూసి సంతోషంతో ఉప్పొంగిపోయాడు. కాలవలో ఒకచోట చెత్తా చెదారం నిలిచి అడ్డుగా ఉన్నాయి. అక్కడికి వెళ్ళేసరికి పడవ దెబ్బతింటుందని అతనికి భయంవేసింది. కాని పడవ పసందుగా కుడిచేతివేపుకు తప్పుకుని, అపాయం తప్పించుకుని ముందుకు ఇంకా ముందుకు సాగిపోతోంది. మళ్ళీ ఇంకో గండం. ఒకచోట నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి. పడవ అక్కడికి చేరేసరికి స్వామినాథన్ పడవఆశవదలుకున్నాడు. సుళ్ళల్లో పడి మునిగిపోతుందని నిశ్చయించుకున్నాడు. పడవ అల్లల్లాడుతూ వణికిపోతూ పిచ్చిగా గిర్రున తిరుగసాగింది. కాని అదృష్టవశాత్తు పొరుగింటి వంటగదిలోనుంచి మురుగునీరు వచ్చిపడి వెనుకనుంచి పడవను ముందుకు ఒక్కతోపుతోసి రక్షించింది. కాని పడవమాత్రం విపరీతమయిన వేగంతో కొట్టుకుపోతోంది. ఇక తలకిందులయిపోతుందనుకున్నాడు స్వామినాథన్. ఇంతలో మళ్ళీ మామూలు వేగానికి దిగింది. కాని ఒకచెట్టుకిందుగా సాగిపోతుంటే ఒక ఎండుటాకు రాలిపడేసరికి పడవ తలకిందు

లయింది. చీమనన్నా రక్షిద్దామనే ఉద్దేశంతో స్వామినాథన్ పిచ్చిగా అక్కడికి పరిగెత్తాడు. చాలాసేపు నీళ్ళల్లో వెతికాడు. కాని చీమజాడ కనిపించలేదు. పడవ, పడవలోని 'సరుకు' అయిపులేకుండా పోయాయి. చిటికెడు మన్నుతీసి చీమఆత్మ శాంతికి ప్రార్థనచేసి, ఆ చిటికెడు మన్నూ మురికికాలువలో వదిలేశాడు.

## II

కొద్దిరోజుల్లోనే సోముమురా శత్రుత్వానికి స్వామినాథన్ అలవాటుపడిపోయాడు.

అయినా పాతస్నేహితులతో మాటాడాలనేకోరిక మాత్రం మధ్యమధ్య పీడిస్తూండేది. బైబిలుటీచరు పెదిమలు బిగపట్టి ముక్కుగోక్కుంటూంటే 'బటాణీగింజ' కాలిమీద కాలువేసి తొక్కి నవ్వాలనేకోరిక మిన్నుముట్టింది. కొన్ని సంవత్సరాలుగా ప్రతినిత్యం ఇలాంటి తమాషాలుచేసి ఆనందించటం పరిపాటయిపోయింది. కాని స్వామినాథన్ ఆ కోరికను అణచుకొని, ఒక్కడే తనలోతాను ముసిముసినవ్వులు నవ్వుకున్నాడు. ఇంకా, ఎర్రటోపీపెట్టుకున్నకుర్రవాడు కునికిపాట్లు పడుతున్నాడు. తల కిందకువాలినపుడల్లా అదిరిపడుతూంటే స్వామినాథన్ బటాణీగింజచెవిలో 'అదిగో వాడికేసి చూడు, మొదటిబెంచిమీద మూడోవాడు– యెర్రటోపీ–మళ్ళీ కునుకుతున్నాడు' అనిచెప్పి ముసిముసినవ్వు నవ్వుదామనుకున్నాడు. కాని పెదవులుకొరుక్కుని ఊరుకున్నాడు.

సోము అతనివంకే చూస్తున్నాడు. అతని చూపులో స్నేహభావం కనిపిస్తోందని భ్రమపడ్డాడు స్వామినాథన్.

సోము తనతో తిరిగీ స్నేహం చేయదలచాడని భావించి ఒక్క-క్షణం ఒళ్ళుతెలియని సంతోషంపొందాడు. కొంచెంసేపు ఒకరినొకరు తేరిపారజూచుకున్నారు. స్వామినాథన్ తియ్యటి స్నేహపుచూపుచూడడం ప్రారంభించేసరికి సోము మొహం ముడుచుకుని తిప్పేసుకున్నాడు.

స్వామినాథన్ బడిఆవరణలో కాలుకాలినపిల్లి లా తిరుగుతున్నాడు. వెనకనుంచి ఎరిగినగొంతులు వినిపించాయి. వెనకకుతిరిగి చూశాడు. సోము, శంకర్, బటాణీగింజ అతని వెనకాలే వస్తున్నారు. ఆగి వాళ్ళను కలుసుకోవడమా, లేక వెళ్ళిపోయేదాకా నిరీక్షించి ఆతరవాత ఇంకోవేపుగా వెళ్ళ డమా ? తెల్చుకోలేకపోయాడు. వెనక ముగ్గురుశత్రువులు తనకేసి తేరిపారజూస్తున్నారనేవిషయం చికాకుగలిగిస్తుంది. తనశరీరంలో ఎక్కడ ఏకాస్త కదిలినా అది వాళ్ళు కనిపెట్టి చూసి వేళాకోళంచేస్తారని అతనికి భయంవేసింది. తననడక వాళ్ళకి నచ్చదని అనుకున్నాడు. పుస్తకాలుపట్టుకున్నతీరు చూసికూడా వాళ్ళు నవ్వుకుంటున్నారని భావించుకున్నాడు. మెడవెనక దురద పెట్టింది. గోక్కుందామని చేయిపైకెత్తి మళ్ళీ దించేశాడు. గోక్కోవడం జాగ్రత్తగా వాళ్ళు కనిపెట్టిచూస్తారని అతనినమ్మకం.

కుడిచేతివేపుకు మళ్ళీ స్కూలుహాలులోకి వెళదామని స్వామినాథన్ తలపోశాడు. కాని అలాచేస్తే తననుపిరికిపందకింద జమకట్టేస్తారు. వాళ్ళబారినుంచి తప్పించుకోవడానికి హాలులోకి జారుకున్నాడని భావిస్తారు. పారిపోదామనుకున్నాడు. కాని అదిమాత్రం ఏంమెరుగు ? వెనకకుతిరిగి ఎదుటిదిక్కుగా వెళ

దామనుకున్నాడు. అలా వెళితే, ఇంకేముంది, ముఖాముఖీ ఎదురుపడడమే! తనను అనుసరించి వాళ్ళు వెనకగా వస్తున్న సంగతి తనకు తెలియనట్లు నటిస్తూ, ముందుకు సాగిపోవడమే ఉత్తమమని తోచింది. వీళ్లు, పదిరోజులకిందట, ఎవళ్లు? ఇపుడు అంటకుండా ముట్టకుండా తిరుగుతున్నారే! ఇలాంటి మార్పుకు స్వామినాథన్ నిర్ఘాంతపోయాడు.

ఇక భరించడం కష్టమయిపోతోంది. కాళ్ళు గిర్రున తిరుగుతూ ఒకదానినొకటి పెనవేసుకుంటున్నాయి. పరుగెత్తితే ఇందాకనే స్కూలుహాలులోకి పరిగెత్తాల్సింది. హాలు దాటి వచ్చేశాడు. ఇక తప్పించుకోవడానికి ఒకటేమార్గం ఉంది. పిక్కబలం చూపాల్సిందే. తప్పదు. చిన్న ఎత్తువేశాడు. హఠాత్తుగా ఆగి, దేనికోసమో వెతుకుతున్నట్లు అటూఇటూ చూసి, బిగ్గరగా "నోటుపుస్తకం యెక్కడో వదిలివచ్చాను" అంటూ చేయిపైకెత్తి లేడిలాగా అక్కడనుంచి దౌడుతీశాడు.

# అయిదో ప్రకరణం

## నాన్నగారిగది

## I

ఆవేళ శనివారం. రాజం మధ్యాహ్నం వస్తానని మాట ఇచ్చాడు. స్వామినాథన్‌కి ఒళ్ళు తెలియడంలేదు. రాజంవస్తే ఎక్కడ కూర్చోబెట్టడం? తన స్వంత గదిలోనా? కాని వాళ్ళనాన్న బట్టలు మార్చుకోవడానికి తరచు వస్తూపోతూంటాడు. ఊహుఁ– కోర్టుకి వెళతాడని జ్ఞాపకంవచ్చి మనసు

మనసు శాంతించింది. బల్ల శుభ్రంగాతుడిచి పుస్తకాలుచక్కగా తీర్చిపెట్టాడు. వాళ్ళ నాన్నకి ఆశ్చర్యంవేసింది. కొడుకును మెచ్చుకోసాగాడు. స్వామినాథన్ వాళ్ళనాయనమ్మదగ్గిరికి వెళ్ళి "నాయనమ్మా! రాజంనుగురించి నీకు చెప్పాగదూ? చెప్పలా?" అన్నాడు.

"ఆఁ– చెప్పావు. వాడు మాంచి దుండుముక్కలాంటి వాడు. కాని యేం లాభం? పరీక్ష ప్యాసుగాడు!"

"అబ్బే! వాడా, మణి!"

"ఆఁ– యిప్పుడు జ్ఞాపకంవచ్చింది. ఆఁ వాణ్ణేదో గింజ అంటారుగదూ. ఒకే తమాషాగా మాటాడతాడు?"

స్వామినాథన్ ఇక లాభంలేదని నిట్టూర్చాడు. 'చూడు నాయనమ్మా! 'బటాణీగింజ' అతనే అనుకున్నావు. కాదు. యివాళ వచ్చేది రాజం. రాజం పెద్దపులుల్ని చంపాడు. చాలా గొప్పవాడు. వాళ్లనాన్న పోలీసుసూపరింటెండెంటు."

"ఓ – అలాగా– వాడా! యిక్కడికి వస్తున్నాడూ! బలే బాగుంది!"

"హుఁ ... కాని చెప్పకతప్పదు..."

"నాదగ్గిరికి తీసుకొచ్చి చూపిస్తావా? చూడాలని వుంది"

"సర్లే, చూదాంలే" అన్నాడు స్వామినాథన్ ఖచ్చితంగా చెప్పకుండా. "మాట జారలేను. కాని అతను నాదగ్గిర వున్నపుడుమాత్రం నువు నన్ను పిలవాకూడదు, నా గదిలోకి రానూకూడదు."

"యెందుకనేం?" అని అడిగింది నాయనమ్మ.

"నిజం చెప్పాలంటే – చెప్పాలంటే నువ్వు ముసిలి డొక్కువి" అన్నాడు స్వామినాథన్ మరీ అమాయకంగా. వాళ్ళనాయనమ్మ సంతోషంతో సరేలే అంది.

మంచిమంచి పిండివంటలు స్నేహితుడికి రుచిచూపించాలనే కోరిక అతనిని వెన్నాడుతోంది. తల్లిదగ్గరకు వెళ్ళాడు. ఆమె పక్కన అరటాకులబొత్తి పెట్టుకుని, కత్తిపీటముందు కూర్చుని ఉంది. ఆమెముందు కూర్చుని వణికేచేతుల్లో అరటాకు అటూ ఇటూ నలిపి ముక్కలుముక్కలుగా చీరిపారేశాడు.

"ఆ ముక్కలన్నీ నేలమీద పారేయకు. వూడ్చలేను" అందామె.

"అమ్మా! మధ్యాహ్నం ఫలహారానికి యేంజేస్తున్నా?"

"తొందరేం? సావకాశంగా ఆలోచిస్తాలే"

"యేదయినా మంచి పసందయింది, తియ్యటిది చేయాలి అమ్మా! మధ్యాహ్నం రాజం వస్తాడు. నాకు మామూలుగా యిచ్చే కాఫీలాంటిదిమాత్రం యియ్యకేం. మంచి రుచిగా వేడి వేడిగా వుండాలి" రాజంఇంట్లో ప్రతిదీ వంటవాడు తెచ్చి అందివ్వడం స్వామినాథన్‌కు గుర్తువొచ్చింది. "అమ్మా! కాఫీకి టిఫిన్‌కి నే నిక్కడికిరాను. నా గదికి పంపించు" అంటూ వంట వాడికేసితిరిగి అన్నాడు: "నువ్వు ఆ ధోతీకట్టుకుని నా గదిలోకి రావడానికి వీల్లేదు. శుభ్రంగా వుతికిన తెల్లటిధోతీ కట్టు వేసుకురావాలి. తెలిసిందా?" కొంచెంసేపు ఆగి మళ్ళీ అన్నాడు. "అమ్మా! ఒకటిరెండుగంటలసేపు నాన్నగదిని వాడుకోనిమ్మని నాన్నతో చెప్పవే." ఆమె చెప్పడానికి తనకు తీరుబడలేదు అంది. అతనే వెళ్ళి ఎందుకు అడగకూడదు?

"నువు చెపితే వెంటనే సరే అంటాడు" అన్నాడు స్వామినాథన్.

ఆ తరువాత తండ్రిదగ్గరికి వెళ్ళి "నాన్నా! నిన్నొకటి అడగాలనివుంది" అన్నాడు. వాళ్ళనాన్న తలవంచుకుని కాగితాలు చూస్తున్నవాడల్లా తల పైకెత్తి చూశాడు.

"నాన్నా! నీ గది నాకు కావాలి"

"యెందుకు?"

"స్నేహితుడొకతను వస్తున్నాడు" అని జవాబిచ్చాడు స్వామినాథన్.

"నీ గది వుందిగా?" అన్నాడు తండ్రి.

"దాన్ని రాజంకి యేమొగంపెట్టుకుని చూపించను?"

"యెవడా రాజం? అంత గొప్పవాడా?"

"అతనుపోలీసుసూపరింటెండెంటుకొడుకు. మామూలువాడేంగాదు."

"ఓ – అలానా! సరే, నా గది వాడుకో. కాని బల్లమీది వస్తువులు మాత్రం చిందరవందరచేయకు, జాగర్త!"

"ఓ– జాగర్తగానే వుంటాగా. నువు యెంతమంచివాడివి నాన్నా!"

"వాళ్ళనాన్న ఫక్కున నవ్వి "సరేలే గాని, లోపలికి వెళ్ళి పుస్తకాలు పుచ్చుకో" అన్నాడు.

## III

రాజం రాక, పోక స్వామినాథన్ అనుకున్నంతకంటె ఎక్కువ సాఫీగానే జరిగిపోయాయి. వాళ్ళనాన్న గదితీసి వెళ్ళాడు. వాళ్ళ అమ్మ గోధుమపిండి, ఎండుద్రాక్షపళ్ళు,

పంచదారతో అద్భుతమయిన పిండివంట తయారుచేసింది. కాఫీ మహాపసందుగా ఉంది. వాళ్ళనాయనమ్మ మాటనిలబెట్టు కుంది. తొక్కు—మొహం రాజంకు చూపెట్టలేదు. వంటవాడు ధోతీ మార్చుకోకపోవడం మాత్రం స్వామినాథన్‌కు విచార కారణమయింది.

స్వామినాథన్ వాళ్ళనాన్న తిరుగుడుకుర్చీలో రాజంను కూచోపెట్టాడు. రాజం వచ్చి అప్పటికి మూడుగంటలయింది. మణి, ఎబెనెజార్, రైళ్ళు, పులివేట, పోలీసులు, దెయ్యాలు మొదలైన అనేకవిషయాలనుగురించి మాటాడుకున్నారు.

"నీగది యేది?" అని అడిగాడు రాజం.

స్వామినాథన్ గంభీరంగా, "యిదే నాగది. యెందు కలా అడిగావ్?" అని అడిగాడు.

దీనిని దిగమింగడానికి రాజంకు కొంతకాలంపట్టింది. "యీ పుస్తకాలు నువు చదువుతున్నావా?"అని మళ్ళీ అడి గాడు బల్లమీది గిల్టుఅంచుల లా పుస్తకాలకేసి చూస్తూ, స్వామినాథన్ కంగారుతిన్నాడు.

రాజం ఇంకోప్రశ్న వేసి పరిస్థితి ఇంకా అధ్వాన్నం చేశాడు.

"యింతకీ నీపుస్తకాలు యేవీ?" అతని పెదిమలమీద చిరునవ్వు తాండవించింది.

"అసలువిషయమేమంటే యీ బల్ల మా నాన్నది. నేను యింట్లోలేనప్పుడు యీ బల్లదగ్గిర కూర్చొని క్లయిం ట్లతో మాటాడుతూంటాడు."

"అయితే నువు పుస్తకాలు యెక్కడపెట్టుకుంటావ్?"

ఈవిషయంనుంచి రాజంను మళ్ళించాలని స్వామినాథన్ అనేకవిధాల ప్రయత్నించాడు. "మా నాయనమ్మను చూశావా రాజం ?"

"ఉహుఁ - చూడలా. చూపిస్తావా ? ఆవిడని చూడాలని నాకు యెంతగానోవుంది." అన్నాడు రాజం.

"అయితే ఒక్కనిమిషం ఆగు" అని స్వామినాథన్ గదిబయటికి పరుగుచ్చుకుంటూ వెళ్ళాడు.

నాయనమ్మ నిద్రపోతూంటుంది, పరవాలేదు అనుకున్నాడు. నాయనమ్మను నిద్రపోతున్నపుడు స్నేహితులకు చూపడం అన్నివిధాలా మంచిది.

కాని తీరా వెళ్ళేసరికి నాయనమ్మ పక్కమీద హాయిగా కూర్చునివుంది. అనుకున్నదొకటీ, జరిగిందొకటీ. ఏమీ పాలుపోక స్వామినాథన్ నాయనమ్మకేసి తేరిపారజూస్తూ నుంచున్నాడు.

"యేవిఁటి బాబు ? యేంకావాలి ?" అని అడిగింది నాయనమ్మ.

"అబ్బే, యేవీఁ అక్కర్లేదుగాని, నీకు నిద్రపట్లలా ?" అని అడిగాడు. ఒక్కక్షణం ఆగి, "నిన్ను చూపించడానికి రాజంను తీసుకొచ్చా" అన్నాడు.

"తీసుకొచ్చావా? " అంది నాయనమ్మ బిగ్గరగా.

"యిలా దగ్గిరగా రా, రాజం! నీమొహం సరిగా కనిపించడంలేదు. ముసిలిదాన్ని, కళ్ళుకనిపించవ్ !"

స్వామినాథన్‌కి ఒళ్ళుమండిపోయింది. రాజంతో ఈ చెత్తంతా మాట్లాడడం సరిపడక, తనలో తానుగొణుక్కున్నాడు.

రాజం వచ్చి ఆమెపక్కమీద కూచున్నాడు. నాయనమ్మ అతని తలనిమిరి, వెంట్రుకలు పొట్టిగా సన్నగా ఉన్నా పట్టులా మెత్తగా ఉన్నాయని మెచ్చుకుంది. "మీ అమ్మ పేరేవిటి? సంతానం యెంతమంది? నగలు చాలా వున్నాయా?" అని అడిగింది. "మా అమ్మకి ఒక పెట్టెనిండా నగలు, యింకో పెట్టెనిండా వెండి బంగారుసామాను వున్నాయి" అని చెప్పాడు. ఆతరవాత మదరాసు, లైటుహౌసు, సముద్రం, ట్రాంలు, బస్సులు, సినీమాలు-వీటన్నిటిగురించి నాయనమ్మకు వర్ణించిచెప్పాడు. ఇవన్నీ వింటూ, నాయనమ్మ ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరయింది.

## III

స్వామినాథన్ క్లాసులో అడుగుపెట్టేసరికి పకపకా నవ్వులు వినిపించాయి. 'నన్నుచూసి కాదులే' అనుకుని వెళ్ళి సీటులో కూచున్నాడు. కాని నవ్వులు ఆగలేదు. చుట్టూ చూశాడు. నల్లబల్ల కనిపించింది. దానిమీద తాటికాయలంత అక్షరాలతో 'తోక' అని రాసి ఉంది. స్వామినాథన్ నల్లబల్ల దగ్గిరికి వెళ్ళి చేతులతో అక్షరాలు తుడిచేసి వెనక్కి తిరిగి చూశాడు. శంకర్ తలవంచుకుని నోటుపుస్తకం చూస్తున్నాడు. 'బటాణీగింజ' పుస్తకాలసంచి ఊడదీస్తున్నాడు. మాటాడకుండా 'బటాణీగింజ' దగ్గిరికి వెళ్ళి చెంపమీద చెళ్ళున కొట్టాడు. 'బటాణీగింజ' ఏడుస్తూ తను రాయలేదని మొత్తుకుంటూ శంకర్ వంక దొంగచూపుచూశాడు. స్వామినాథన్ శంకర్ వేపు ి అతని మొహంమీదకూడా ఒక్కటి కొట్టాడు.

ఇంకేముంది, గలభా ప్రారంభమయింది.శంకర్, స్వామి నాథన్, 'బటాణీగింజ' క్రిందపడి దొర్లుతూ, రక్కుకుంటూ, ఒకరిజుట్టు ఒకరు పీక్కుంటూ తన్నుకోసాగారు. గంట మోగింది. రాజం, మణి, సోము క్లాసులోకి వచ్చారు. మాస్టరు వచ్చి చూసి, నిర్ఘాంతపోయాడు. కళ్ళప్పగించి చూడడంకంటె ఏమీ చేయలేకపోయాడు. అతను ముసిలి అరవంమాస్టరు. ఎవరూ అతనిని ఖాతరుచేసేవారుకాదు.

కొట్లాడుకుంటున్నవారిని సోము, మణి విడదీశారు. మాస్టరు వేదికమీదికి ఎక్కి కుర్చీలో కూర్చున్నాడు. క్లాసులో గోల అణిగిపోయింది. సోము లేచి అన్నాడు."సార్! మమ్మల్ని బయటకు వెళ్ళనీయండి. క్లాసు సాగకుండా చేయడం మా కిష్టం లేదు" మాస్టరు గంభీరంగా కూచున్నాడు. కాని అప్పటికే మణి స్వామినాథన్‌ని 'బటాణీగింజ' ను ముందుకు తోస్తూ క్లాసుబయటికి వెళ్ళిపోయాడు. శంకర్‌ను తీసుకుని సోము వారివెనకాలే వెళ్ళాడు.

బడిపక్కనఉన్న పొలంలో ఒక ఏకాంతస్థలానికి వారు చేరుకున్నారు. కొంతసేపటివరకు ఎవరూ 'ఆ ఊ' అని కూడా అనలేదు. మణి ఊరుకోకుండా "యేమిటీ గొడవ, గాడిద ల్లారా!" ముగ్గురూ ఒక్కసారే గొంతులు ఎత్తారు. అందరి లోకీ స్వామినాథన్ గొంతు బిగ్గరగా వినిపించసాగింది. "వీడు—యీ'బటాణీగింజగాడు' తోక అని...పెద్ద తాటికా యంత అక్షరాలతో...నల్లబల్లమీద రాశాడు. తాటికాయ లంత..."

"ఉహుఁ - నేను రాయలేదు. నువ్వు—"అంటూ గోలపెట్టాడు బటాణీగింజ.

"పీడూ రాశాడు" అన్నాడు స్వామినాథన్ శంకర్‌ని వేలితో చూపెడుతూ.

"వెధవ! నేనురాస్తుండగా నువు చూచియేడిచావా?" అని శంకర్ అరిచాడు.

మణి వాళ్ళనోళ్ళు మూసి, "యింతకీ అసలు తోక యేవిఁటి?"అని అడిగాడు. అసలువిషయం ఎవరూ మణికి ఇంతవరకు చెప్పలేదు.

"నన్ను వీళ్ళు 'రాజంతోక' అంటున్నారు."అని చెప్పాడు స్వామినాథన్ వెక్కివెక్కి ఏడుస్తూ.

మణిమొహం ముద్దకట్టుకుపోయింది· "రాజంగురించి మాటాడేగుండె యెవరికుంది?"

"ఓ, గుండె" అన్నాడు సోము.

"మీలో యెవరన్నాగనక ఆ పని చేసివుంటే—"అని అరిచాడు మణి వణికిపోతున్న శంకర్, 'బటాణీగింజ'ల కేసి చూస్తూ.

"చేస్తే, నువేంచేస్తావేం?"అని అడిగాడు సోము నిర్లక్ష్యంగా నవ్వుతూ.

"యేవిఁటి నీవుద్దేశం, సోము ! యేవిఁటి?"

"మణీ ! యిలా చూడు" అన్నాడు సోము. "చాలా కాలంగా ఒకవిషయం నీతో చెప్పాలనుకుంటూ. నువ్వేదో మహా గొప్పవాడివని విర్రవీగుతున్నావులే!" ఇలా అని సోము మణిమెడమీద ఈడ్చికొట్టాడు.సోము ఎదురుదెబ్బ కొడదామని

చేతిని అదరకొట్టేశాడు. మణి సోమును ఒక్కతన్నుతన్ని కింద పడగొట్టాలని చూశాడు. కాని సోము పక్కకుతప్పుకుని మణిని ఒక్కతన్ను తన్నాడు. దాంతో మణి పిల్లి మంత్రం వేశాడు.

మిగిలినముగ్గురు వాళ్ళకళ్ళను వాళ్ళే నమ్మలేక పోయారు. మణి సోము కొట్టుకోవడం! వాళ్ళకి మతులు పోయాయి. సోము మణి ఒకర్నొకరు చంపేసుకుంటారనే తలి చారు. ఒకరికేసి ఒకరు కోరచూపులుచూసుకుని బడివేపు పరుగెత్తారు.

పరుగెత్తుకువెళ్ళి హెడ్ మాస్టరుగదిలో చొరబడ్డారు. పక్కపొలంలో రెండుఖూనీలు ఆ క్షణంలో జరిగిపోతున్నా యనిపించింది హెడ్డుమాస్టరుకు వాళ్ళమాటలనుబట్టి. వాళ్ళ ఉద్రేకం, మొహాలు చూసి హెడ్డుమాస్టరు నవ్వుఆపుకుని గడ్డంగోక్కున్నాడు. జవానును వెంటతీసుకుని పొలంలోకి వెళ్లాడు.

అక్కడ ఆ ఇద్దరూ కిందపడి కొట్టుకుంటూ పొలంలో ఆమూలనుంచి ఈమూలకి దొర్లుతున్నారు. హెడ్డుమాస్టరు, జవాను వాళ్ళిద్దరిని విడదీసి పైకిలేవనెత్తారు. సోముకి మణికి ఉన్నంతబలం ఈ ప్రపంచంలో ఎవరికీ లేదని అంతవరకు నమ్ముతూవచ్చాడేమో, స్వామినాథన్‌కి ఇదంతా చూసేసరికి ఆశ్చర్యం వేసింది.

——

# ఆరో ప్రకరణం

## అక్కరకు ఆదుకున్న మిత్రుడు

### I

మూడువారాలతరువాత ఒకనాటిమధ్యాహ్నం స్వామినాథన్ మణిఇంటిముందు నుంచుని సన్నగా ఈలవేశాడు. మణి వచ్చి అతనిని కలుసుకున్నాడు. ఆ రోజు మధ్యాహ్నం గనక వచ్చి తననుకలుసుకుంటే అద్భుతం చూపిస్తానన్నాడు. ఏమిటయిఉంటుందా అని ఆలోచిస్తూ వాళ్ళిద్దరూ రాజం ఇంటికి బయలుదేరారు.

"ఆఁ, యేంలేదు" అన్నాడు స్వామినాథన్ "రాజం యేదో యెగతాళికి అనివుంటాడు. వాళ్ళయింటికి మనిద్దర్నీ రప్పించుకోవడానికిదో యెత్తు" ఇలా అనుమానంవెలిబుచ్చినందుకు మురికికాలవలోకి తోసేద్దామనుకున్నాడు మణి.

"బహుశా యేకోతినో కొనివుండవచ్చు" అని తిరిగీ అన్నాడు స్వామినాథన్ ధైర్యంగా. మణి అతనిమీద మహా దయచూపుతున్నట్టు 'అయిఉండవచ్చు' అన్నాడు. వాళ్ళకి ఆశ్చర్యంగొలిపేవిషయాలు ఒకొకటే ఊహించుకుని చివరకు లాభంలేదని ఊహించడమే మానుకున్నారు.

ఆలోచనలు శత్రువులమీదికి మళ్ళాయి. "నే నేం చెయ్యబోతున్నానో తెలుసా ?" అని అడిగాడు మణి "సోము నడుం విరగ్గొట్టేస్తాను. వాడు యెక్కడ వుంటున్నదీ నాకు తెలుసు. బజారువెనుక కబీర్‌వీధిలో వుంటున్నాడు. తమలపాకులు కొనుక్కోవడానికి తరచుగా బజార్లో ఒక కొట్టుకు రావడం చూశాను. ముందుగామునిసిపాలిటీదీపంమీద రాయి

విసిరి దాన్ని ఆర్పేస్తాను. కబీర్‌వీధిలో యెంత చీకటో నీకేం తెలుసు?...దుడ్డుకర్రపుచ్చుకని చీకట్లో నుంచుంటాను. వాడు వచ్చీరావడంతోనే—యెముకలు విరగ్గొట్టిపడేస్తాను...." ఈ మాటలు వింటూంటే స్వామినాథన్‌కి వణుకుపుట్టింది. "అంత టితో అయిందీ" అంటూ మళ్ళీ మొదలుపెట్టాడు మణి. " 'బటాణీగింజ'ను కాలికింద నలిపేస్తాను. యిక శంకర్‌ని సరయూనది ఒడ్డుమీది రావిచెట్టుమీద వేలాడగట్టివురేస్తాను."

రాజంఇంటికి చేరుకోగానే మాటాడుకోవడం ఆపేశారు. గేటు వేసిఉంది. గోడఎక్కి లోపలకు దూకారు. ఒక నౌకరు వారివేపు పరుగెత్తుకుంటూ వచ్చి "గోడ యెందుకుయెక్కారు?" అని అడిగాడు.

"యీ గోడ నీ అబ్బసొమ్మా యేం?" అని మణి విరగబడి నవ్వసాగాడు.

"నడుములువిరిగితే"-అంటూ మొదలుపెట్టాడు నౌకరు.

"నీకేం? నీ నడుం విరగదుగా"అని దయాదాక్షిణ్యాలు లేనివాడులా నవ్వాడు స్వామినాథన్.

"యింకొక్కమాట నువేం పోలీసు సూపరెంటు కొడుకువా?" అన్నాడు మణి.

"ఉహుం - కాను" అని నౌకరు జవాబిచ్చాడు.

"అలాయితే, విను" అన్నాడు మణి. "మేము పోలీసు సూపరెంటుగారికొడుకుతో మాటాడాలని వచ్చాం." దాంతో నౌకరు వెనక్కి తగ్గాడు.

రాజంగదితలుపుమీద దబదబా బాదారు. గడియ చప్పుడుకాగానే వెళ్ళి స్తంభంచాటున దాక్కున్నారు. రాజం

తొంగిచూసి ఎవరూ కనిపించకపోయేసరికి మళ్ళీ తలుపు వేసు కున్నాడు.

మణి స్వామినాథన్ స్తంభంచాటునుంచి ఇవతలకి వచ్చి ఏమిచేయడానికీ తోచక గుమ్మంముందు నిలబడ్డారు. స్వామి నాథన్ తలుపుసందున నోరుపెట్టి పిల్లిలాగా మ్యావ్ అన్నాడు. మణి స్వామినాథన్‌ని ఇవతలికి లాగి తాను తలుపుసందున నోరు పెట్టి కుక్కలాగా మొరిగాడు. మళ్ళీ గడియచప్పుడయి తలుపు కొద్దిగా తెరుచుకుంది. మణి స్వామినాథన్ చెవిలో "నువు గుడ్డి పిల్లి పిల్లివి, నేను గుడ్డికుక్కపిల్లను" అన్నాడు.

మణి వంగి చేతులు నేలకుఆనించి, కళ్ళు గట్టిగామూసు కుని, తలతో తలుపుతోసి గుడ్డికుక్కపిల్లలాగా నటిస్తూ రాజం గదిలో ప్రవేశించాడు. స్వామినాథన్ కళ్ళుమూసుకుని మణి వెనకాలే పాక్కుంటూ వెళుతూ మ్యావ్ అని అరవసాగాడు. ఈవిధంగా గదినాలుగుమూలలా తిరగసాగారు. రాజం వాళ్ళ కూతలకు జవాబుగా తానూ నిమిషనిమిషానికీ మొరుగుతూ, మ్యావుఅంటూ ఆ ఆటకు రక్తికట్టించాడు. గుడ్డికుక్కపిల్లకు మనిషికాలు రాసుకుంది. ఆ కాలు రాజం దేననుకొని మెల్లిగా పిక్కమీద కరిచింది కాని, కళ్ళుతెరిచిచూసేసరికి, ఆశ్చర్యం! ఆ కాలు అతనిశత్రువు సోముది. గుడ్డిపిల్లిపిల్ల ఒకకాలుదగ్గిరికి చల్లగా వెళ్ళి పంజాతో గోకసాగింది. కళ్ళుతెరిచి చూసేసరికి ఆశ్చర్యం! అది శత్రువు శంకర్ కాలు!

మణి అలాగే ఒక్కనిమిషం కొయ్యబారిపోయి, లేచి నుంచున్నాడు.సిగ్గుతో కోపంతో చుట్టూ చూశాడు. 'బటాణీ గింజ' ఒకమూల అల్లరికి కళ్ళుమిణకరిస్తూ కూర్చున్నాడు.

గొంతుపిసికేయాలన్నంత కోపంవచ్చింది మణికి. వెనుకకుతిరిగి చూశాడు. రాజం నవ్వుఅణచుకుంటూ అతనికేసి రెప్పలార్ప కుండా చూస్తున్నాడు.

ఇక స్వామినాథన్ ఏకుర్చీకిందో బల్లకిందో ఎవరికంటా పడకుండా చీకట్లో దాక్కోవడం ఉత్తమమని తలచాడు.

"రాజం! యేవిఁటి నీవుద్దేశం?" అని అడిగాడు మణి.

"యెందు కలా మండిపడతావ్?"

"యిదంతా నీ తప్పు"అన్నాడు మణి కఠినంగా. "నాకు తెలవదు —" చుట్టూచూశాడు.

"బలేబాగుంది! నిన్ను కుక్కలాగా నడుస్తూ మొరగ మన్నానా? మొరగమన్నానా?"

సోము, అతనిజట్టు ఫక్కునసవ్వారు. మణి చుట్టూ తేరిపారజూచి, "రాజం, నేను వెళ్ళిపోతున్నా. యిది నేను వుండదగినస్థలంకాదు"అన్నాడు.

"నువు వెళ్ళిపోతే యిక నీతో నేనూ మాటాడను" అన్నాడు రాజం.

ఏంచేయడానికి మణికి పాలుపోలేదు. రాజం అతనిని పక్కకుతీసుకువెళ్ళి శాంతపరిచాడు. అంతులేనికష్టంలో చిక్కు కునిఉన్నా స్వామినాథన్ వేపు తిరిగి, తనజీవితంలో కుక్కలా పిల్లిలా అంతచక్కనినటన ఎన్నడూ చూడలేదనిపొగడి, అతనిని కూడా ఓదార్చాడు. 'కొద్దినిమిషాలవరకు నిజంగానే కుక్కే మొరుగుతోంది, పిల్లే అరుస్తోంది అని భ్రమపడ్డాను. ఏ సంత లోనో ఇలా ప్రదర్శిస్తే మీకు బహుమానాలు వచ్చిపడ తాయి' అన్నాడు. తిరిగీ అలా నటిస్తే, తానెంతో సంతో

పిస్తానని, చూడడానికి వాళ్ళనాన్ననుకూడా పిలుచుకువస్తానని చెప్పాడు.

దీంతో స్వామినాథన్, మణి చల్లబడిపోయి, తమను చూచుకుని తామే గర్వించసాగారు. ఆ తరవాత అంతా ఫలహారాలుచేశారు. ఆగదిలోని ముగ్గురుశత్రువులు తలపుకువచ్చినపుడు తప్ప తక్కినసమయంలో వారిసంతోషానికి హద్దులేదు.

వాళ్ళు ఇలాంటిస్థితిలోఉండగా రాజం స్నేహంమీద ఉపన్యాసందంచనారంభించాడు. 'ఐకమత్యమే బలం'అనే నీతిని గరిపే 'ముసలివాడు – కట్టెలమోపు'అనేకథను ఉదాహరణగా తీసుకుని, అందరికీ నచ్చేటట్టు స్నేహాన్నిగురించి మాటాడాడు. అక్కరకుఆదుకున్న స్నేహితుడే నిజానికి స్నేహితుడు. శత్రుత్వాన్ని పెంచుకునేవారు ఎటువంటి నరకయాతనలుపడతారో ఒళ్లుగగుర్పొడిచేటట్లు వర్ణించాడు. శత్రుత్వాన్ని పెంచుకున్నవాడిని చనిపోయినతరవాత ఒకగదిలో పెట్టి తాళంవేస్తారు. బట్టలు ఊడదీసి ఎర్రగాకాలుతున్న ఇనపదిమ్మెమీద నిలబెడతారు. చుట్టూ తేనెతుట్లు. వాటిల్లో నిమ్మకాయంత తేనెటీగలు. ఆ పాపి దిమ్మెమీదనుంచి కిందకు అడుగుపెడితే, 'ఆగదిలో తిరిగే వందలకొలదీ తేళ్ళు, జెర్రులమీద కాలు పెట్టాలి. ఇదంతా వేదాలలో వ్రాసిఉంది'అని చెప్పాడు రాజం. అంతా గజగజ వణికిపోయారు.

నిద్రాహారాలులేకుండా ఆ పాపి అలా నెలరోజులు నిలబడాలి. ఆపైన అతనిని ఒకవంతెనమీదికి తీసుకువెళతారు. వంతెనకింద కళపెళకాగే నూనెచెరువు. పైగా వంతెన మహా ఇరుకు. కాలిఅడుగుకంటె ఎక్కువవెడల్పు ఉండదు. ఒకొక

అడుగు వేసుకుంటూ వెళ్ళాలి. ఆ వంతెనమీదకూడా కందె రీగగూళ్లు, ముండ్లజెముడుపొదలు బోలెడన్ని ఉన్నాయి. వంతెనమీదుగా సాగిపొమ్మని వెనకనుంచి అదమాయిస్తుంటారు. కళపెళకాగే ఆ నూనెలో కాలుజారి పడకుండా ఎల్ల కాలం నడవాలంటే ఒక్కొక్క అడుగూ వేసుకుంటూ వెళ్ళాలి...

రాజంమాటలు అందరినీ ముగ్ధుల్ని చేశాయి. ముందుకు వచ్చి 'నేటినుంచీ మాకు శత్రువులంటూ లేరు' అని చెప్పమని రాజం వారిని ఆహ్వానించాడు. ఆమాట చెపితే శంకర్‌కి ఒక బైండుబుక్కు, స్వామినాథన్‌కి గడియారంలాపనిచేసే ఇంజను, సోముకి బెల్టు, మణికి చక్కటిచాకూ, 'బటాణీగింజ' కు మహా పసందయిన కలం ఇస్తానన్నాడు.

బీరువా తెరిచి తాను వారికి బహుమానంగా ఇవ్వదలచిన ఆ వస్తువులన్నింటినీ చూపెట్టాడు. గోళ్ళుకొరుక్కుంటూ అంతా మాట్లాడకుండా కొంచెంసేపు నిలబడ్డారు. ఈ రాజీ చేయడంలో హైరానపడ్డాడేమో రాజంకు ముచ్చెమటలు పట్టాయి.

మొట్టమొదట 'బటాణీగింజ' లేచి బీరువాముందు నిల బడి, "ఆ కలం యిలాయివ్వు చూస్తాను" అన్నాడు. రాజం కలం ఇచ్చాడు. కలం అటూఇటూ తిప్పిచూసి, ఏమీ అన కుండా తిరిగి ఇచ్చివేశాడు. "'బటాణీగింజ'! యేం నచ్చలేదా?" అని అడిగాడు రాజం. బటాణీగింజ బీరువాలోకి తేరిపార జూస్తూ "నా కా పెట్టె కావాలి" అన్నాడు ఒక చిన్నపెట్టె చూపిస్తూ. ఆ పెట్టెమీద పసుపుపచ్చటి నల్లటి నమూనా

చిత్రాలు, మూతమీద తాజమహల్ బొమ్మ వేసిఉన్నాయి. "ఉహుం— వీల్లేదు. అది నాకు కావాలి" అన్నాడు రాజం. ఒక నిమిషం గడిచింది. రాజంకు అలాంటిపెట్టెలు ఇంకా రెండు ఉన్నాయి. మనసుమార్చుకుని "నా కక్కరలేదులే. కావలిస్తే తీసుకో" అన్నాడు.

కొద్దిసేపటికి మణి అరచేతితో చాకుకు పదునుపెడుతున్నాడు. సోము బెట్టుపెట్టుకుంటున్నాడు. శంకర్ లావుపాటి బైండుబుక్కు అటూఇటూ తిప్పిచూస్తున్నాడు. స్వామినాథన్ ఆకుపచ్చని ఇంజనును ఆప్యాయంగా గుండెలకేసి అదుముకుంటున్నాడు.

## ఏడవ ప్రకరణం

### తమ్ముడు పుట్టాడు

రెండురోజులుగా స్వామినాథన్ తల్లి పడక వేసింది. వంటింటోకి అడుగుపెట్టలేదు. స్వామినాథన్ విషయమయి శ్రద్ధ తీసుకోలేదు. తల్లిదగ్గరలేకపోయేసరికిస్వామినాథన్‌కిబెంగవేసింది. తల్లి పడుకున్న గదిలోకి అతనిని తీసుకువెళ్ళారు. ఆమె పక్కమీద పండుకుని ఉంది. జుట్టు చెదిరి ఉంది. మొహం పాలిపోయి ఉంది. ఆమె కొడుకుని దగ్గరికి రమ్మని పిలిచి "చిక్కిపోయావేం, సరిగా, తిండి తిని కంటినిండా నిద్రపోవడంలేదా?" అని అడిగింది. స్వామినాథన్ ఆమెకేసి దీనంగా తేరిపారజూడసాగాడు. ఆమె పూర్వంఉన్నట్టుగా లేదు. బిగపట్టుకుని ఏదో మాటాడీ మాటాడనట్లు మాటాడాడు. ఆమెఆకారం చూసేసరికి అతనిమనసు కుంగిపోయింది. పట్టువిడిపించుకుని పరుగుచ్చుకు వెళ్ళిపోయాడు.

"నీకు తమ్ముడు పుట్టబోతున్నాడురా" అని చెప్పింది వాళ్ళనాయనమ్మ. కాని ఆ వార్త అతనికి ఉత్సాహం పుట్టించ లేదు.

ఆ రాత్రి అతనిని నాయనమ్మపక్కలో పడుకోనిచ్చారు. దీపాలు ఆ రాత్రంతా వెలుగుతూనేఉన్నాయి. కళ్ళు తెరచి నప్పుడల్లా నడవలో హడావిడిగా నడుస్తున్న అడుగులచప్పుడు విని పించేది. బాగా పొద్దుపోయింతరవాత స్వామినాథన్‌కు మెలు కువ వచ్చింది. కళ్ళు తెరిచిచూసేసరికి హాల్లో డాక్టరమ్మ కనిపిం చింది. ఆ ఇల్లు తనదే నన్నట్లుగా ఆమె నడుచుకోసాగింది. ఆమె స్వామినాథన్‌తల్లి పడుకున్నగదిలోకి వెళ్ళింది. వెంటనే గదిలోనుంచి గుసగుసలు, మూలుగులు వినిపించాయి. డాక్ట రమ్మ గంభీరముఖంతో గదిలోనుంచి బయటికివచ్చి, అక్కడ ఉన్నవారందరిమీద పెత్తనంచేయసాగింది. చివరకు స్వామి నాథన్‌నాన్ననుకూడా ఏదో పనిచేయమని పురమాయిం చింది. ఆయన వెళ్ళి ఒకనిమిషంలో చేతిలో చిన్నసీసాపట్టు కుని చక్కావచ్చాడు. ఏమీాలోచక అక్కడ తచ్చాడ సాగాడు. గుసగుసలు, తొందర, ఉద్రేకం, వేడినీళ్ళు, మందులు– కొత్తవ్యక్తి ఈ ప్రపంచంలోకి అవతరించడానికి సన్నాహాలు– స్వామినాథన్‌కి ఏమాత్రం అర్థంకాలేదు. నాయనమ్మ వచ్చే పోయేవారిని ఏవో అడుగుతూనేఉంది. కాని ఎవరూ ఆమెకి సమాధానమివ్వడంలేదు.

అయితేనేం? నాయనమ్మపక్కలోని అయిదుజంఘా నాలు హాయిగోలుపుతున్నాయి. అయిదుదిండ్లు వెచ్చగోలుపు తున్నాయి. ఇక పక్కలో నాయనమ్మఉండడంవల్ల మనసు చిట

వుగా ఉంది. అన్నిటినీమించి కనురెప్పలు బరువెక్కాయి. ఇంకేం కావాలి? హాయిగా నిద్రపోయాడు.

## II

అరవంమాస్టరు గడ్డం మాసింది. వెండికట్టు కళ్ళజోడు పెట్టుకుని అరవవ్యాకరణంలోని చిక్కులు విప్పిచెపుతున్నాడు. విద్యార్థులకంటె మాస్టరే ఎక్కువ ఉత్సాహంగా ఉన్నాడు. క్లాసంతా గోలగోలగా ఉంది. పిల్లలు చిన్నచిన్న గుంపులుగా చేరి కబుర్లుచెప్పుకుంటున్నారు. బల్లమీదకొట్టి పిల్లలను ఊరుకోబెట్టాలని మాస్టరు యత్నించాడు. లాభంలేకపోయింది. కొంతసేపయినతరవాత ఆ యత్నంమాని తనమానాన తాను పాఠం చెప్పుకుపోతున్నాడు.

శంకర్, ఇంకా కొంతమంది మొదటిబెంచిమీద చెవులు దోరలు చేసుకుని వింటూ, పెనిసిళ్ళతో రాసుకుంటున్నారు. స్వామినాథన్, 'బటాణీగింజ' ఆఖరిబెంచీమీద కూర్చున్నాడు.

"అరే 'బటాణీగింజా' యివాళ వుదయం నాకు తమ్ముడు పుట్టాడురోయ్!" అన్నాడు స్వామినాథన్.

'బటాణీగింజ'కు ఆసక్తి కలిగింది. "బాగుంటాడా? అని అడిగాడు.

"ఓ, బాగుంటాడు? వేలెడంత వున్నాడు. ముద్దొస్తుంటాడు" అని స్వామినాథన్ తమ్ముడిని అనుకరించడం మొదలు పెట్టాడు. కళ్ళుమూసుకున్నాడు. పెదవులు బిగపట్టాడు. రొమ్ముమీద చేతులు ముడుచుకున్నాడు. నాలికజాపాడు. తల అటూఇటూ ఆడించాడు. 'బటాణీగింజ'కు నవ్వు ఆగలేదు. "కాని" అన్నాడు స్వామినాథన్ "చేతులు బహు చిన్నగా,

లావుగా తమాషాగా వున్నాయి. కాని మొహం మాత్రం బాబోయ్! యెర్రగా మిరపకాయలా వుంది."

మాస్టరు చెప్పే పాఠం కొద్దినిమిషాలపాటు విన్నారు. "చూడు స్వామి!" అన్నాడు బటాణీగింజ "వీళ్ళు యిట్టే యెదిగి పూరుకుంటారు. మీ తమ్ముడంత పసిపిల్లాడొకడిని చూశాను. మళ్ళీ సెప్టెంబరు శెలవుల్లో చూస్తే గుర్తుపట్టలేకపోయాను."

# ఎనిమిదో ప్రకరణం

## పరీక్షలముందు

ఏప్రిల్ పరీక్షలు ఇక రెండువారాలున్నాయనగా తండ్రిలో మార్పువచ్చిందని స్వామినాథన్ గుర్తించాడు. ఆ మార్పు మంచికేంకానట్టు తోచింది. ఆయనగడబిడ రోజురోజుకు హెచ్చుతోంది. ఆయనతో వేగడం కష్టమవుతోంది. కొడుకును వేధించుకుతినాలని హఠాత్తుగా ఆయనకు బుద్ధిపుట్టినట్టుంది. నాయనమ్మతో కబుర్లుచెప్పడం కంటపడితే కఠినంగా "అరే, పరీక్షలు దగ్గరికివస్తున్నాయి. జ్ఞాపకంవుంచుకో" అని మంద లించేవాడు. తల్లి వెనక తిరుగుతూంటే లాక్కువచ్చి రాతబల్ల ముందు కూలవేసేవాడు. తాలూకాకచేరీలో రాత్రి తొమ్మిది గంటలతరువాత అతనిగొంతు వినిపించితే చాలు, వాళ్ళనాన్న గదిలోనుంచి "స్వామీ! యింకా నిద్రపోలా? పెందలాడే లేచి చదువుకోవాలిసుమా" అని మందలింపుమాటలు వినిపించేవి. స్వామినాథన్ జీవితంలో ఇది పరీక్షాసమయం. ఒకరోజున ధైర్యం తెచ్చుకుని, "నా పరీక్షలవిషయంలో అంత గాబరాపడతా వెందుకు?" అని స్వామినాథన్ అడిగాడు.

"నువ్వు పరీక్షతప్పిపోతే?"

"తప్పటమే!"

"బాగా చదివి పరీక్ష బాగారాస్తే, తప్పవు నిజమే... కాని ఒకవేళ తప్పాననుకో, నీ తోటిపిల్లలంతా పైక్లాసులోకి వెళతారు. నువు మళ్ళీ యీక్లాసులోనే కూర్చోవాలి. బాగా చదివి పరీక్ష బాగారాస్తే పరీక్షలు ఆఖరయిపోయినరోజునుంచీ ఇష్టంవచ్చినట్టు చేయచ్చు."

స్వామినాథన్ ఆలోచించాడు. మణి, రాజం, 'బటాణీ గింజ', శంకర్ తననువదలి రెండోఫారంలో చేరారనుకో. వాళ్ళనాన్న చెప్పిందే సరి "అయిదోక్లాసుపిల్లలంతా పరీక్ష ప్యాసయివచ్చి నీ పక్కన కూర్చుంటారు. సరేనా" అని నచ్చేటట్టు చెప్పాడు వాళ్ళనాన్న.

స్వామినాథన్ అరగంటసేపు డెసిమల్ లెక్కలు చేస్తూ కూర్చున్నాడు.

## II

బడిలో ప్రతివాడిని పరీక్షలదెయ్యం పట్టినట్టుంది. శంకర్ మొహంలో చిరునవ్వు కనిపించి ఎన్నివారాలయిందో! సోము చలాకీగా తయారయ్యాడు. ముక్తసరిగా మాటాడటం మొదలుపెట్టాడు 'బటాణీగింజ'కు పరియాచకాలు అర్థంచేసుకోవడానికి వ్యవధిపడుతోంది. పరియాచకాలు ఆడలేకపోతున్నాడు. ఇక రాజం, మొదటిగంటకొట్టేసరికి బడికిరావడం, మాస్టరుచెప్పింది రాసుకోవడం, మళ్ళీ ఆఖరుగంటకొట్టగానే వెళ్ళిపోవడం. స్నేహితులతో సరిగా మాటాడడంకూడా లేదు. మణికి పరీక్షబెంగపట్టింది. వీలయినపుడల్లా శంకర్‌ని పక్కకు

తీసుకువెళ్ళి పాఠాలు చదువుతూంటే తనకువచ్చిన అనుమా నాలు తీర్చుకుంటున్నాడు. బడిగుమాస్తా వెంటపడసాగాడు. ఆ గుమాస్తాకు తెలియనిదంటూ లేదని, పరీక్షల్లోవచ్చే ప్రశ్నలు అతనికి తెలుసనీ బడిపిల్లలనమ్మకం.

ఒకరోజున మణి అతనిఇంటికి వెళ్ళి, అతనిపాదాలదగ్గర కొత్తనంకాయలబుట్ట పెట్టాడు. గుమాస్తా సంతోషించి మణిని ఒక ముక్కాలిపీటమీద కూచోబెట్టాడు.

గుమాస్తా చాలా మెత్తగా కనిపించాడు. ఆసమయంలో ఏమిఅడిగినా చెపుతాడనే ధైర్యం కలిగింది మణికి. గుమాస్తా అతనుపెంచే పిల్లివిషయమయి ఏదో గొణుక్కుంటున్నాడు. బక్కచిక్కి ఆ పిల్లి అతనికిదగ్గిరగా పడుకునిఉంది. కాని ఆయన గొణుగుడు మణికి అర్థంకాలేదు. పరీక్షలోవచ్చే ప్రశ్నలవిషయం ఎత్తాలని మహా ఆదుర్దాగా కాచుకుని కూర్చున్నాడు. ఇంతలో గుమాస్తా పిల్లిగొడవ మానివేసి, కందిరీగలమీద పట్టించాడు. కాని మణికి ఒరిగిందేమీ లేదు. ఎప్పుడు ప్రశ్నలవిషయం ఎత్తుదామా అని కాచుక్కూచు న్నాడు మణి. "యీకందిరీగల్ని కళ్ళదగ్గిరగా యెగరనీయకూ డదు. కళ్ళజబ్బులు పట్టుకుంటాయి. కళ్ళకలకలు వస్తే పచ్చి వుల్లిపాయముక్క తీసుకుని..."

ఇక ఆయననోరు మూతపడదని గ్రహించి మణి ఆయన ధోరణికి అడ్డంవచ్చి "పరీక్షలు యిక వారంరోజులే వున్నాయి సార్!" అన్నాడు.

గుమాస్తా కొద్దిగా కంగారుపడి, "అవునవును, యింకొక్క వారం...చిన్నవుల్లిపాయగాదు, రసమొచ్చేరకం తీసుకొని..."

"సార్ !" అంటూ మణి మళ్ళీ అడ్డం వచ్చాడు. "పరీక్షల విషయంలో నాకు ఆందోళనగా వుంది." అని బిక్క మొహం వేశాడు.

"ఊఁ— బాగా చదివితే నెగ్గితీరుతావు" అన్నాడా జ్యోతిష్కుడు.

"చూడండీ, సార్! నాకు మహా ఆందోళనగావుంది. పరీక్షలమూలంగా రాత్రిళ్లు నాకు నిద్రపట్టిచావడంలేదు... ముఖ్యమయిన వేమిటో చెపితే...చదవవలసింది బోలెడంత వుంది. పరీక్షకు అనవసరమైనవి చదవడం మానేస్తాను." ఇలా డొంకతిరుగుడుగా అడిగాడు. మణి అసలుఉద్దేశమేమిటో గుమాస్తా గ్రహించి అన్నాడు: "పాఠాలన్నీ చదువు. తప్పకుండా ప్యాసవుతావు." డొంకతిరుగుడుగా చెపితే లాభంలేదని గ్రహించి మణి సూటిగా, "పరీక్షలో యేప్రశ్నలు వస్తాయో చెప్పండి, దయయుంచి" అని అడిగాడు.

పరీక్ష పేపర్ల విషయం తనకేమీ తెలియదని చెప్పాడు గుమాస్తా. కాని మణి వదలకుండా 'మీకు తెలియకపోతే యెవరికి తెలుస్తాయి?' అంటూ పొగడసాగాడు. కాసేపు పొగిడేసరికి గుమాస్తా కొంచెం మెత్తబడి, చెప్పడం మొదలు పెట్టాడు. ఆ చెప్పేదంతా చాలాముఖ్యమయిందనుకున్నాడు పాపం మణి! ఆ గుమాస్తాకు మొదటిఫారం పుస్తకా లేమిటో కూడా తెలియదు. కాని ధైర్యంగా "జాగ్రఫీ జాగ్రతగా చదవాలి. మాపులు గీయడం బాగా నేర్చుకోవాలి. యికలెక్కలు— రోజూ అయిదు లెక్కలకు తక్కువకాకుండా చేయాలి. అలా

చేస్తే పరీక్షలో యెటువంటి లెక్క యిచ్చినా యిట్టే చేసేయ గలుగుతావు" అని సలహా ఇచ్చాడు.

'అయితే యింగ్లీషు ?"

"దాని విషయంలో పెద్దగా బాధపడకు. యింగ్లీషు పాఠాలన్నీ చదివావా ?"

"చదివానండీ" అని జవాబిచ్చాడు మణి. కాని ఆ విష యం అతనికే నమ్మకంలేదు.

"యింకేం! ముఖ్యమయిన పాఠాలన్నీ మళ్ళీ చదువు. యింకా వ్యవధి వుంటుదీ మళ్ళీ చదువు; యిక ప్యాసుకాక యేం చేస్తావ్ ?"

ఈ సమాధానాలు మణికి బాగా సంతృప్తికలిగిం చాయి. ఇంటికి తిరిగి వెళుతూ తనలోతాను నవ్వుకుని వంకా యలుకొన్న నాలుగణాలు వృధాకాలేదనుకున్నాడు.

## III

మణి అందరిలోకీ తానేమో ఘటికుడిలా భావించసాగాడు. తోటివిద్యార్థులమీద అతనికి జాలివేసింది. వాళ్ళు బండచదువు చదవాలి. శ్రమతగ్గడానికి తనకులా వారికి ముఖ్యమైనప్రశ్నలు తెలియవు. ఎవరు తనకు చెప్పిందీ బయటపెట్టకుండా ఈ రహస్యం స్వామినాథన్‌కికూడా అందజేయాలని తలిచాడు.

బడినుంచి ఇద్దరూ కలిసి వెళుతున్నారు. ఎవరిదోవను వారు చీలిపోకముందే వినాయక మొదలివీధి గ్రోవ్‌వీధులకూడ లిలో ఆగారు. "పరీక్షల్లో యేంవస్తాయో నీకు తెలుసా? " అని మణి అడిగాడు.

"పుస్తకాలఅట్టలుదాటి నాకేం తెలీదు'

మణి స్వామినాథన్ మాటలలోని హాస్యాన్ని లెక్క చేయకుండా, "నే చెప్పేది జాగ్రత్తగా విను కిందటి రాత్రి ఏడు గంటలదగ్గరినించి పదిగంటలదాకా నే నేంజేశానో తెలుసా?" అన్నాడు.

"వేరుసెనక్కాయలు మెక్కావు."

"తెలివితక్కువా! వేళాకోళాల కిదేనా సమయం? నేను ఇండియామాపులు రెండు, ఆఫ్రికామాపులు రెండు, యూరప్ మాపు ఒకటీ గీశాను."

"అట్లాసులోనిమాపులన్నీ గీశానన రాదూ?"

"కావచ్చు" అన్నాడు మణి. స్వామినాథన్ అలా అనడం అతనికి రుచించలేదు. "కాని ఒకప్రదేశంలో నే గీశాననుకో ... నాకు ఒకటిరెండుప్రశ్నలు తెలుసు. యెవరితో నన్నా అనేవునుమా! చిక్కుల్లో పడిపోతాను" ఇలా గంభీరంగా మణి మాటాడేసరికి స్వామినాథన్ నమ్మి, అతనిహితోపదేశం గ్రహించాడు.

## IV

స్వామినాథన్ ఇంటికి చేరుకున్నాడు. ఏమీతోచలేదు. తల్లి ఇంట్లోలేదు. నాయనమ్మ మాటాడేధోరణిలోలేదు. ఆ రోజున జరిగిన ఉద్రేకసంఘటనలు వర్ణించిచెప్పాడు: "నాయనమ్మా! యివాళ మా బళ్లో యేంజరిగిందో చెప్పుకో చూదాం. ఫస్టు సి లో ఒకకుర్రాడు యింకోకుర్రాడిని ముంజేతిమీద పొడిచాడు."

"యెందుకు?" అంది నాయనమ్మ యథాలాపంగా

"వాళ్ళిద్దరికీ పడదు" అని చెప్పాడు. కాని నాయనమ్మ నమ్మినట్టు లేదు. ఆరోజున జరిగిన ఇంకో గొప్పసంఘటనను గురించి చెప్పాడు. "నాయనమ్మా! నాయనమ్మా! యిది విను. హెడ్మాస్టరుకొటనవేలికి ఎదురుదెబ్బ తగిలింది. అబ్బ! యెంత నెత్తురు కారిందని! ఆరోజల్లా కుంటుతూనేవున్నాడు. మూడోఘారంపాఠం తీసుకోలేదు. యింక వాళ్ళకి ఆటవిడుపు; అదృష్టవంతులు!"

"అలానా?" అంది నాయనమ్మ.

నాయనమ్మ కునికిపాట్లుపడుతోంది. స్వామినాథన్‌కు చెడ్డవిసుగెత్తింది.

తమ్ముడిఉయ్యాలతొట్టిదగ్గర తచ్చాడసాగాడు. మొదట్లో తమ్ముడు ముద్దుగా ఉండడని సందేహించాడు గాని, రోజురోజుకీ ఆకర్షణీయంగా కనిపిస్తున్నాడు. ఆరో నెల వచ్చింది. ముద్దొస్తున్నాడు. ఇక ఆ పసివాడు నేర్చుకున్నది: ఎవరయినా కంటపడితే చాలు బొంగురుగా అరుస్తాడు; పిడికిలి నోట్లోపెట్టుకుంటాడు; మోచేతివరకు తడిచేసుకుంటాడు; కాళ్ళు అదేపనిగా జాడిస్తాడు; మధ్యమధ్య చిరునవ్వునవ్వి బోసి నోరు, ఎర్రటిచిగుళ్ళు బయటపెడుతూంటాడు. స్వామినాథన్ తమ్ముడిని నిలువునా ప్రేమించసాగాడు. ఉయ్యాలతొట్టెమీద ఆనుకుని పసిపిల్లవాడిచేత 'స్వామినాథన్' అనిపించాలని గంటలకొలదీ యత్నించేవాడు. పసిపిల్లవాడు కిలకిలమనేవాడు. ఆ కిలకిల తనపేరును తప్పుగా ఉచ్చరించడంగా తీసుకుని స్వామినాథన్ కెవ్వుమనేవాడు.

ఇపుడు తొట్టెలోకి తొంగిచూశాడు. ఆశాభంగ

మయింది. పిల్లవాడు నిద్రపోతున్నాడు. గొంతు సవరించుకుని బిగ్గరగా దగ్గాడు, పిల్లవాడికి మెలుకువ తెప్పిద్దామని. కాని పిల్లవాడికి మెలుకువ రాలేదు. ఒక్కక్షణం చూశాడు. పసి పిల్లవాడు లేచిన అరగంటవరకు పెంకులుఎగిరిపోయేటట్టు ఏడవటం అలవాటు. ఆ సంగతి జ్ఞాపకంవచ్చి స్వామినాథన్ చప్పుడుచేయకుండా కాలిబొటనవేళ్ళమీదనడుస్తూ వెళ్ళి పోయాడు.

సాయంకాలం ఇంటిపట్టున పడిఉండడం మహా బాధా కరంగాఉంది. సరయూ ఇసుకతిన్నెలు, మణితోస్నేహం తలుచు కుని నిట్టూర్చేవాడు. పరీక్షలు పూర్తయేవరకు బయటకు వెళడానికి వీల్లేదని వాళ్ళనాన్న శాసించాడు. ఆయనను గురించి తా నేమనుకుంటున్నదీ చెప్పేయాలనుకున్నాడు. కాని తీరా ఎదటపడేసరికి నోరుపెగిలేదికాదు. ఏదో ఒక వారంరోజులపాటు సహిస్తే సరిపోతుంది...ఇంతాచేస్తే, ఒకవారంరోజులపాటే గదా ఈ బాధ అనుకునేసరికి హుషారుపుట్టింది.

బల్లముందు కూర్చుని అట్లాసు తీశాడు. యూరపు రాజ కీయమాపుదగ్గర తెరచి, దానికేసి తేరిపారజూస్తూ కూర్చు న్నాడు. యూరపులాంటి వంకరటింకరఖండంలో మనుషులు ఎలా నివసిస్తున్నారో తోచలేదు. సన్నగా తోకలాగా సము ద్రంలోకి పొడుచుకుపోయే భూమిమ్మీద నివసించేజనుల ఆకారం ఎలా ఉంటుందో, అంత సన్నటి చీలికలో ఉక్కిరిబిక్కిరయి ఎలా చావకుండా ఉన్నారో అని ఆశ్చర్యపోయాడు. ఇంకో పెద్ద సమస్య అతనిని వేధించజొచ్చింది. ఒక దేశంయొక్క ఆకారాన్ని ఈ మాపులు గీసినవాళ్ళు ఎలా కనుగొన్నారు?

యూరపు ఒంటెతలలాగా ఉంటుందని వీళ్ళకి ఎలా తెలిసింది ? ఎత్తయిన గోపురంమీద నిలబడి కిందకనిపించేది గీశారేమో ! టౌనుహాలుమీదికి ఎక్కి కిందకు చూస్తే మాపులో ఉన్నట్టే ఇండియా కనిపిస్తుందా ? అత నెపుడూ టౌనుహాలుకు వెళ్ళలేదు. వెళ్ళాలని కుతూహలమూలేదు. స్వామినాథన్ అయితే నమ్మలేదుగాని, దర్జీ రంగా టౌన్‌హాలు మీదకు పఠానులు యువకుల్ని తీసుకెళ్ళి చిత్రహింస చేస్తారని చెప్పాడు.

ఈ ఆలోచనలు కట్టిపెట్టి యూరపుమాపు అట్లాసు చూసి గీశాడు. అట్లాసులో మాపు తనుగీసిన మాపు ఒక దాని సరసన ఒకటిపెట్టి, తన శక్తిసామర్థ్యాలను తానే మెచ్చు కోసాగాడు. కాకపోతే అతను గీసినదాని ఆకారం సగం ఎద్దు మొహం, సగం ఒంటెమొహం గల విచిత్ర జంతువు ఆకారంలా ఉంది.

ఏడుగంటలు దాటింది. తండ్రి ఇంటికివచ్చాడు.కొడుకు చదుకుంటూండడం చూసి, మహా సంతోషించాడు. "బలే బాబూ !" అన్నాడు మాపువంకచూస్తూ కష్టపడ్డందుకు ఫలి తం దక్కిందని స్వామినాథన్ సంతృప్తి చెందాడు. పేజీలు తిప్పి ఆఫ్రికామాపు తీశాడు.

## V

పరీక్షలు రెండురోజు లున్నాయనగా స్వామినాథన్ కావలసిన వస్తువుల జాబితా ఒక కాగితంముక్కమీద రాశాడు.

| | |
|---|---|
| రూళ్లువేయని తెల్లకాగితాలు | 20 తావులు |
| పాళీలు | 6 |

సిరాబుడ్లు 2

క్లిప్పులు, పిన్నులు

పెనసలు నోట్లోపెట్టుకు కొరికి, జాబితా తిరిగి చదివాడు. జాబితా నచ్చలేదు. కావలసినవి ఇన్నే ననుకోలేదు. జాబితా తయారుచేయడానికి కూచున్నప్పుడు రెండుమూడు పేజీలకు దేకుతుందనుకున్నాడు. తీరా రాసిచూస్తే అయిదు పంక్తులు తేలింది. జాబితా శ్రద్ధగా తిరిగి చదివాడు 'రూళ్ళు వేయని తెల్లకాగితాలు 20 తావులు' రూళ్ళు వేయనివే కావాలని అంత పట్టుదల ఎందుకు? అతను ఎంతజాగ్రత్తగా రాసినా పంక్తులు వంకరటింకరగా తయారవుతాయని అందరికీ తెలిసిందే. పరీక్షల్లో అలా రాయడానికి వీల్లేదు. రూళ్ళకాగితాలు ఇన్ని అట్టేఉంచుకోడం మంచిది. ఇక పాళీలు: పరీక్షలకు ఎన్నిపాళీలు కావాలి? ఒకటా? రెండా? అయిదా? ... ఇక సిరా. ఎంత కొంటే సరిపోతుంది? ఆతరువాత క్లిప్పులు, పిన్నులపేచీ. అతనికి ఏవస్తువు ఎంతకావాలో తెలియకపోవడమేకాదు, ఎంతెంత అమ్ముతారోకూడా తెలియదు. ఆరు పిన్నులు, ఆరుక్లిప్పులు కావాలని అడిగితే దుకాణదారుకి కోపం రాదుగదా!

చివరికి జాబితా ఇలా సవరించి రాశాడు:

| | |
|---|---|
| రూళ్ళువేయని తెల్లకాగితాలు | 20 తావులు |
| రూళ్ళువేసిన తెల్లకాగితాలు | 10 తావులు |
| నల్లసిరా | 1 బుడ్డి |
| క్లిప్పులు | 3-6-12 |
| పిన్నులు | 6-12 |

ఇలా సవరించినా జాబితా సంతృప్తికరంగాలేదు. ఇంకా
కాసేపు ఆలోచించి కార్డుబోర్డుఅట్టఒకటి, చిల్లరఖర్చులకు ఒక
రూపాయి జాబితాలో చేర్చాడు.

వాళ్ళనాన్న ఆఫీసుగదిలో కూచుని పనిచేసుకుంటు
న్నాడు. స్వామినాథన్ జాబితాపట్టుకువెళ్ళి ఎదురుగా నిలబ
డ్డాడు. నాన్న పనిలోమునిగిపోయిఉన్నాడేమో స్వామినాథన్ని
చూడలేదు. ఇంకెప్పుడయినా రావడం మంచిదని స్వామినా
థన్ గుర్తించాడు. భోజనాలుఅయింతరువాత ఈవిషయం
ఎత్తితే నాన్న సుముఖంగాఉంటాడు. బొటనవ్రేళ్ళమీద నడిచి
వెళుతున్నాడు. గుమ్మందాటుతూంటగా 'యెవరది?' అని
వాళ్ళనాన్న కేకవేశాడు. గొంతు సౌమ్యంగాలేదు. 'యెవ
రది? మాటాడవేం?' అని మళ్లా బిగ్గరగా గద్దించాడు. చల్లగా
జారుకుందామా, ఆగి జవాబు చెప్పుదామా అని స్వామినా
థన్ ఆలోచిస్తూంటగానే మండిపడుతూ వాళ్ళనాన్న వచ్చి
పక్కన నిలబడ్డాడు.

"నువ్వా!"

"అవును"

"గాడిద! 'యెవరది?' యెవరది?" అని గొంతు బొంగురు
పోయేటట్టు అరుస్తూంటే పలకవేం? ... యీ యింటో ఒక్క
సెకండుకూడా హాయిగా కూచునే ప్రాప్తిలేదు. పనిచేసుకుం
టూంటే నిమిషనిమిషానికీ ఎవరోఒకరు వచ్చి, చొప్పదంటు
ప్రశ్నలు అడుగుతూంటారు. యిక నా పని సాగడం యెలా?
యీవాళ నా గదిలో ఎవరూ అడుగుపెడతానికి వీల్లేదని వెళ్ళి

మీ అమ్మతో చెప్పు. నూనెవాళ్ళు, కూరగాయలవాళ్ళు దండెత్తివచ్చి డబ్బుకోసం గొడవగొడవచేసినా లెక్కచేసేది లేదు. వాళ్ళందరినీ తరిమేయమను. మీఅమ్మ—ఆచేతిలో ఆ కాగితమేమిటి? ”

“యేంలేదు నాన్నా!”అని జవాబిచ్చాడు స్వామి నాథన్ కాగితం జేబులో పెట్టుకుంటూ.

“యేమిటది ?” అని అరిచాడు కాగితంలాక్కుంటూ. మండిపడుతూ కాగితంచదివి వెళ్ళి కుర్చీలో కూచుని, “యేమి టిదంతా ?”అని అడిగాడు.

గొంతుసరిచేసుకోవడానికి స్వామినాథన్ రెండుసార్లు దగ్గవలసివచ్చింది.

“నా...పరీక్షజాబితా.”

“పరీక్షజాబితా యేవిఁటి ?”

“యెల్లుండి మా పరీక్షలు మొదలవుతాయి.”

“అయినా యింకా ఇంటో తాడుతెంచుకున్న గాడిదలాగా తిరుగుతున్నావన్నమాట! యేవిఁ టీ వెధవజాబితా! రూపా యలు, అణాలు పైసలు ఆకాశాన్నుంచి ఊడిపడతాయను కున్నావా?” స్వామినాథన్ సరిగ్గా అలా అనుకోలేదుగాని ఇంచుమించు అలాఅనుకున్నట్లే తండ్రి డ్రాయరుసొరుగులాగి, అందులోకి తొంగిచూసి “నీకుకావలసినవి నాదగ్గరనించి తీసు కోవచ్చు. నాదగ్గిర క్లిప్పులు లేవు. అవి నీకు అవసరంలేదు కూడాను. ప్యాడుయెందుకు? మీబళ్ళో డస్కులు లేవూ? మేం చదువుకునేరోజుల్లో పలకలతోనే గడుపుకునేవాళ్ళం. కాని యిప్పుడు నీకు కలం, కాగితం, సిరా, కాగితాలకిందకి అట్ట

కావాలి !" ఎర్రపెనసలుతీసుకుని జాబితాలోనుంచి అట్టపద్దు కొట్టేశాడు. దాంతో అసలు జాబితాయే ఇంచుమించు కొట్టే సినట్టయింది. తండ్రి జాబితా తిరిగి ఇచ్చేశాడు. స్వామినాథన్ విచారంతో దానికేసి చూశాడు. అమీర్‌మార్ట్‌కు వెళ్ళి, నాణేలు ఘణేలుమని మోగిస్తూ కావలసినవస్తువులు కొందా మని తియ్యటికలలుకన్నాడు పాపం!

వెళ్ళిపోబోతూండగా తండ్రి అతనిని వెనకకుపిలిచి అన్నాడు. "యిదిగో వెళ్ళేటప్పుడు చంటిపిల్లాడిని హాల్లోనుంచి అవతలికి తీసుకువెడుదూ, పుణ్యముంటుంది. వాడివెధవయేడుపు వినలేకుండావున్నా... యెందుకలా యేడుస్తాడు? మీ అమ్మ కేమయినా చెముడా? బండమనసా? శోషవస్తే యేం జేస్తుంది?...

# తొమ్మిదో ప్రకరణం

## బడి ఆఖరిరోజు

### I

పరీక్షలు ఆఖరురోజున పరీక్షహాలులోనుంచి స్వామినా థన్ బయటికి వచ్చాడు. పెదవులు గొంతు ఎండిపోయాయి. వేళ్ళనిండా సిరా అంటింది. ఒక వేపున అలసట, ఇంకోవేపున హుషారు పెనగొన్నాయి.

వరండాలో నిలబడి వెనకకు తిరిగి చూశాడు. కష్టం వేసింది. తనలాగానే ఇరవయి నిమిషాలముందుగానే పిల్లలంతా పరీక్షఇచ్చేసిఉంటే హాయిగా ఉండేది. ఎడమభుజం గోడకు ఆనించి, శంకర్ ఈ ప్రపంచాన్నే మరిచిపోయి రాస్తున్నాడు.

రాజం రెండో పంకాక్రింద ఇద్దరు మూడోఫారం పిల్లలమధ్య కూచుని యంత్రంలా రాసుకుపోతున్నాడు. మణి ఇంకా దూలాలవంక తేరిపారజూస్తూ కలంతో గడ్డంగోక్కుంటున్నాడు. 'బటాణీగింజ' సీటుకు ఆనుకుని జవాబులు సరిచూసుకుంటు న్నాడు. ఒక పరీక్షాధికారి కుర్చీలో కూర్చుని కునుకిపాట్లుపడు తున్నాడు. ఇంకొకతను ఎక్కడో ఆలోచిస్తూ అటూ ఇటూ పచార్లుచేస్తున్నాడు. పాళీల గరగర, కాగితాల గలగల, గొంతుసవరింపులు నిశ్శబ్దంగాఉన్న హాలులోనుంచి వినవస్తు న్నాయి

హఠాత్తుగా స్వామినాథన్‌కి తానుముందుగా రాకుండా ఉంటే బాగుండేదనిపించింది. కాని అంతకన్న ఎక్కువసేపు హాలులో ఎలా ఉండడం? అయిదుగంటలదాకా అరవంపేపరు రాయవచ్చు. కాని స్వామినాథన్ ఆఖరిప్రశ్న పూర్తిచేసేసరకు నాలుగున్నరే అయింది. ఇచ్చిన ఆరు ప్రశ్నలలో మొదటి దానికి సంతృప్తికరంగా జవాబు రాశాడు. రెండోది అనుమా నం. మూడోదానికి జవాబు సంతృప్తికరంగానే రాశాడు. నాలుగోదానికి రాసిన జవాబు తప్పు సరయిన జవాబేమిటో కూడా తెలియదు. అన్నిటికంటె ఆరోప్రశ్నకు జవాబు బాగా రాశాడు. జవాబు రాయడానికి ఒక్క నిమిషంకంటె ఎక్కువ పట్టలేదు. నాలుగున్నరకు ఇంకా రెండు నిమిషాలు ఉండనగా ప్రశ్న చదివాడు. ఒక నిమిషం తరువాత రాయడం మొదలు పెట్టి సరిగ్గా నాలుగున్నర అయేసరికి పూర్తిచేశాడు. ప్రశ్న : 'బ్రాహ్మణుడు-పెద్దపులి కథ బోధించే నీతియేమిటి?'

(ఒక బ్రాహ్మణుడు ఒక చెరువుకట్టవెంటే వెడుతున్నాడు. అవతలిఒడ్డునుంచి ఒక పెద్దపులి కేకవేసి 'యిదిగో బంగారు కంకణం, వచ్చి తీసుకో' అంది. మొట్టమొదట బ్రాహ్మణుడు తనకేమీఅక్కరలేదన్నాడు గాని, పెద్దపులి తన అమాయక త్వాన్ని చిత్తశుద్ధిని నమ్మేటట్టు చెప్పి, తప్పకుండా వచ్చి కంకణం తీసుకోమంది. దానిమీద బ్రాహ్మణుడు అవతలి ఒడ్డుకు ఈదుకు వెళ్ళాడు. కంకణంకోసం చేయిజాచేలోగా నే పెద్దపులి అతనిని మింగివేసింది). ఈకథలో నీతిఉందని స్వామి నాథన్ ఎన్నడూ అనుకోలేదు ప్రశ్న అడిగారు కాబట్టి, నీతి తప్ప కుండా ఉండిఉంటుందని స్వామినాథన్ నిశ్చయించుకున్నాడు. ఆ నీతి ఏమిటి అనేది నిశ్చయించుకోవడానికి ఒకనిమిషం పట్టింది. ఆ నీతి, 'పెద్దపులి ఇస్తానంటే బంగారుకంకణం పుచ్చు కోరాదు' అనేదా లేక 'దురాశ దుఃఖానికిచేటు' అనేదా? రెండోదే సబబుగాఉందని తోచింది. అదే రాశాడు. రాసి, గడియారంకేసి చూశాడు. ఇంకా అరగంట ఉంది! ఈ అర గంటా ఏంచేయాలి? మొదటగా బయటికివెళ్ళిపోవడానికి సిగ్గే సింది. తక్కినపిల్లలుకూడా తనలాగా త్వరత్వరగా, సరిగా రాసి ఎందుకు ముగించకూడదు?

కాలంగడపడం కష్టంఅనిపించింది. రెండున్నరగంటల వ్యవధిఇస్తే సరిపోయేదానికి మూడుగంటలు ఇవ్వడం ఎందుకు? బయటివరండాకేసి కోరికమీరా చూశాడు. కాస్త ధైర్యం చిక్కపట్టుకుని పరీక్షపేపరు ఇచ్చేసి బయటికి వెళ్ళిపోతే, ఇంకెంతో కాలానికిగాని పరీక్షలబెడద ఉండదు; యిష్టంవచ్చి నట్టు పేషులవెంట .సాయంకాలం, మధ్యాహ్నం, ఉదయం

తిరగవచ్చు. పుస్తకాలు అవతలపారవేసి నాయనమ్మను పెద్ద పెద్దకథలు చెప్పమని అదలించవచ్చు.

ఒక పరీక్షాధికారి తనకేసే చూస్తూండడం గమనించాడు స్వామినాథన్. జవాబులుచూస్తున్నట్లు నటించాడు. ఇంతలో జవాబులు సరిచూసుకోవచ్చుగదా అనుకున్నాడు. మొదటిప్రశ్నకు జవాబులో కొద్దిపంక్తులు చదివాడు. విసుగు పుట్టింది. పేజీలు తిరగవేసి ఆఖరిప్రశ్నకు జవాబుకేసి చూడసాగాడు. జవాబులు సరిచూసుకుంటున్నట్టు నటించాలి. పెద్దపులికథలోని నీతికేసి తేరిపారజూశాడు. చివరకు అది అర్థంకాని అయోమయంలో పడ్డాడు. రాయడం మొదలుపెట్టాడు. ఆఖరిపంక్తి కిందపెట్టినగీటుకు నగిషీలుచెక్కాడు.

దగ్గరదగ్గర అయిదు అయి ఉంటుందనుకుని, గడియారంకేసి చూశాడు. నాలుగన్నరఅయి పదినిమిషాలు దాటింది. ఇద్దరు ముగ్గురుపిల్లలు పేపర్లుఇచ్చి బయటికివెళ్ళిపోవడం చూసి సంతోషపడ్డాడు. తొందరతొందరగా పేపరుమడిచి పైన వివరంగా పేరు పగైరా ఇలా రాశాడు.

తమిళం తమిళం

డబ్లుయూ. యస్. స్వామినాథన్

ఫస్టుఫారం ఎ సెక్షన్

ఆల్బర్ట్ మిషన్‌స్కూలు

మాల్గుడి

సౌత్ ఇండియా

ఆసియా

గంటకొట్టాడు. ఇద్దరిద్దరు, ముగ్గురుముగ్గురు చొప్పున పిల్లలు హాలులోనుంచి బయటకువచ్చారు. మూడుగంటలకు ఇప్పటికీ ఎంతో తేడాఉంది. ఉద్రేకంతో మాటాడుకోవడం గోలకింద తయారయింది.

“ఆఖరిప్రశ్నకు జవాబు యేంరాశావు?”అని స్వామినాథన్ తోటిపిల్లవాడినొకనిని అడిగాడు.

“ఏదీ, ? నీతిప్రశ్నా ? ...క్లాసులో మాస్టరుచెప్పింది జ్ఞాపకంలేదూ...‘దురాశ దుఃఖానికిచేటు’ ”.

“జవాబు యెంతరాశావు ?”

“ఒకపేజీ !”

స్వామినాథన్‌కి ఈ జవాబు నచ్చలేదు. అతను జవాబు ఒకపంక్తిమాత్రమే రాశాడు. “యేమిటి? అంత పెద్దగా రాయకూడదే!”

కొద్దిసేపటికి రాజం, శంకర్ కనిపించారు. “పేపరు యెలా రాశారు ?”

“నువ్వెలారాశావు ?”

“పరవాలేదు”అన్నాడు స్వామినాథన్.

“తమిళంలో తప్పుతానేమోనని భయంవుండేది. యిపుడు ఆ భయంయేమీ లేదు. ప్యాసుమార్కులు వస్తాయనే అనుకుంటున్నా”

“ఉహుఁ-యింకా యెక్కువే వస్తాయి. క్లాసుఁ స్తుంది లేనోయ్ !”అన్నాడు శంకర్.

“చూడండి, కొంతమంది దద్దమ్మలు ఆ నీతిప్రశ్నకు ఒకపేజీ జవాబురాశారు.”అన్నాడు స్వామినాథన్.

"నేను ముప్పాతిక పేజీమాత్రమే రాశాను" అన్నాడు రాజం.

"నేను సగానిపైగా రాశాను" అన్నాడు శంకర్. ఇలాంటివిషయాలలో శంకర్ మాటే వేదవాక్యం.

"నేనూ అంతే, అరపేజీదాకా రాశాను" అని అబద్ధమాడాడు స్వామినాథన్. మనసును సమాధానపచ్చుకోవడానికి ఇలా అబద్ధమాడే ఆ క్షణంలో నిజమేనని నమ్మాడు.

"రేపటినుంచీ బడిలేదు....జ్ఞాపకం వుందా?"

"అరె, ఆ విషయం మరిచేపోయాను" అన్నాడు రాజం.

"అయితే శెలవుల్లో యేం జేయదలచుకున్నారు?"

"పుస్తకాలు పొయ్యిలో పెడతాను" అన్నాడు స్వామినాథన్.

"శెలవుల్లో చదువుకోడానికని మా నాన్న చాలా పుస్తకాలు కొన్నాడు. సిన్బాద్ ది సైలర్, ఆలీబాబా, యింకా యింకా యెన్నో" అన్నాడు శంకర్.

మణి చేతులు పైకెత్తి ఏడుస్తూ "టైం చాలలేదు కాని, ఆఖరు ప్రశ్న దంచేద్దును" అన్నాడు.

'బటాణీగింజ' ఎక్కడినుంచో ప్రత్యక్షమయ్యాడు ఎడమచెంపనిండా సిరాయే. "శంకర్! ఫస్టుక్లాస్ వస్తుందిగదూ?"

"ఊహుఁ-ముప్ఫయిఅయిదుమార్కులు వస్తాయేమో!"

"ఛా! అబద్ధం నీకుఫస్టుక్లాసువస్తే నీ సిగతరిగేయనా" అన్నాడు మణి.

పదిహేను నిమిషాలతరవాత మళ్ళీ గంట మోగింది. బడిపిల్లలంతా హాలులో గుమిగూడారు. అందరి మొహాలలో

సంతోషం, మాటల్లో మంచిదనం వెల్లివిరుస్తున్నాయి. మాస్టర్లు కూడా చనువుగా సంతోషంగా మెలగసాగారు. మణి కనిపించగానే ఎబెనెజార్ "హల్లో, మణీ! శెలవులు యెలా గడవదలచావ్?" అనిఅడిగాడు.

"హాయిగా నిద్రపోదామనుకుంటున్నాను సార్!" అని జవాబిచ్చాడు మణి, స్నేహితులకేసి కనుగీటుతూ.

"మళ్ళీ బడికి వచ్చేసరికి బుర్ర బాగుపడుతుందా?"

"అది యెలా సాధ్యం సార్! శంకర్ తల కోసి, నాకు బహుమతిగా యిస్తే తప్ప!" ఈ మాటలకు అంతా విరగబడి నవ్వారు. ఈ మాటలకేకాదు, దేనికయినా అప్పుడు విరగబడి నవ్వుతారు. ఆనాటిపరిస్థితి అంతే. డ్రాయింగుమాస్టరు మహా సంతోషంతో వరసగా అందరిపాదాలమీద పేంబెత్తంతో కొట్టుకువస్తున్నాడు. కారణంగోళ్ళువిపరీతంగా పెరిగిపోయాయట!

హెడ్డుమాస్టరు వేదికమీదకు ఎక్కాడు. గోల అణిగిపోయేదాకా ఆగి, చిన్న ఉపన్యాసం మొదలుపెట్టాడు. ఆ ఉపన్యాసంలో బడి జూన్ 19వ తేదీవరకు మూసి ఉంటుందనీ, 20వ తేదీన మళ్ళీ తెరుస్తామనీ చెప్పాడు. "శెలవుల్లో కాలం వృథా చెయ్యకుండా కథలపుస్తకాలు చదువుతారనీ, పై క్లాసు పుస్తకాలు తిరగవేస్తారనీ ఆశిస్తున్నాను. అంతేగాదు, మీలో చాలామంది పరీక్ష ప్యాసవుతారనికూడా నమ్ముతున్నా. యింక ఒక్కనిమిషం, ప్రార్థన జరుగుతుంది. ఆతరవాత అంతా యింటికి వెళ్ళిపోవచ్చు."

ప్రార్థనఅయినాక తుపాను చెలరేగింది. బిగ్గరగా పిచ్చిగా కేకలువేస్తూ పిల్లలు ఒకేగుంపుగా బయటికి వెళ్ళారు. ఈ అల్లరి

గందరగోళం పొడుగునా స్వామినాథన్ మణికిదగ్గిరసానే ఉన్నాడు. ఆఖరిరోజున విరోధంఉన్నవాళ్ళు ఒకరినొకరు పొడుచుకుంటారని పిల్లల్లో నమ్మకం ఉంది. జ్ఞాపకంఉన్నంతలో స్వామినాథన్‌కు విరోధులెవరూ లేరు. కాని ఏం చెప్పగలం? బడి మంచిదికాదు.

బడిగేటుదగ్గిర మణి పిల్లలదగ్గరనుంచి సిరాబుడ్లు, కలాలు లాక్కుని పగలగొట్టేయడంలో మునిగితేలుతున్నాడు. అతనిచుట్టూ పిల్లలు గుంపుగా సంతోషంగా ఆవేశంతో గంతులువేస్తున్నారు. ఒక్కొక్కవస్తువూ నాశనమయిపోతూంటే పిల్లలు సంతోషంతో వెర్రికేకలు వేయసాగారు. ఒకరిద్దరు చిన్నపిల్లలుమాత్రం ఈ అల్లరిపనులకు అంగీకరించలేదు. కాని మణి వాళ్ళ చేతుల్లోనుంచి సిరాబుడ్లు గుంజుకుని, టోపీలు చించివేసి, బట్టలనిండా సిరాపోశాడు. ఆ హుషారులో తనసిరాబుడ్డిలోసిరా నెత్తినపోసుకుని, కారుతున్నసిరాతో కళ్ళకింద భయంకరంగా సున్నాలుచుట్టుకున్నాడు.

రోడ్డువెంట ఒక పోలీసు వెళుతున్నాడు. మణి "యేయ్ పోలీసాయన! పోలీసాయన! యీ పిల్లల్ని అరెస్టుచెయ్యి!" అని బిగ్గరగా అరిచాడు. వందగొంతులనుంచి జయజయనినాదాలు బయలుదేరి ప్రతిధ్వనించాయి. ఇంకా కొన్నిసిరాబుడ్లు నేలమీద పేలిపోయాయి. ఇంకా కొన్ని కలాలు విరిగిపోయాయి. ఈగోలలో మణి అరిచాడు: "సింగారం తలగుడ్డ యెవరు తీసుకురాగలరు? చక్కగా రంగువేస్తాను."

బడిబంట్రోతు సింగారం ఒక్కడే ఆనాడు అల్లరిబాజాకు లోనుగాలేదు. తలగుడ్డకు రంగువేస్తానన్న మణిమాట చెవుల బడగానే పెద్ద కఱ్ఱ పుచ్చుకుని, గుంపులోకి చొరబడి ఆ అల్లరి మూకను చెల్లాచెదరుచేశాడు.

# పదో ప్రకరణం

## బండివాడికొడుకు

### I

స్వామినాథన్‌కు రెండురకాలస్నేహితులు ఉన్నారు. ఒక రకానికి చెందినవారు సోము, శంకర్, బటాణీగింజ. ఈ స్నేహం పూర్తిగా చదువుకు సంబంధించినస్నేహం. బడిమూసివేయగానే ఈ స్నేహం అంతరించిపోయింది. ఇక రెండోరకానికి చెందినవారు రాజం, మణి.వీరితోస్నేహం సహజమయింది. బడి లేదుగా, కాలంసంకెళ్ళనుంచి తప్పించుకున్నారు. ఈ ముగ్గురూ ఎప్పుడూ కలసితిరుగుతూ శెలవులు హాయిగా గడపసాగారు.

స్వామినాథన్‌కి జీవితంలో ఇపుడు ఒకచక్రం సంపాదించాలనేకోరిక విపరీతంగా పుట్టింది. రాత్రింబగళ్ళు దానిని గురించే కలలుకనసాగాడు. టైరు, ఆకులులేనిసైకిలుచక్రం కంటబడితే దానివంక కనులపండువగా చూడసాగాడు. గాడిలో కఱ్ఱముక్క పెట్టి నొక్కితే చాలు; ఇక పరుగు మొదలుపెడుతుంది. అది అడ్డంకులను తప్పించుకుని, మెల్లిగా వంకరలు తిరుగుతూంటే చూడడానికి ఎంత ముచ్చటగా ఉంటుందని! పరుగెత్తుతూ అది ఝుమ్మని ఒకటే మోతచేస్తుంది. ఆ మోత స్వామినాథన్ చెవులకు సంగీతంలా తియ్యగాఉంటుంది. మార్గు

డీకి మైలుదూరంలోఉన్నవారైనాసరే, దాని ఝంకారంతో అతనిరాకను గుర్తిస్తారు. ఈ చక్రాన్నిగురించే ఆలోచిస్తూ రాత్రిళ్లు పదిన్నరదాకా మేలుకొనిఉండేవాడు. తండ్రిస్నేహితులదగ్గరనించి, ఎరుగున్న మున్సిపలుస్వీపరుదాకా అందరినీ ఒకసైకిలుచక్రం సంపాదించిపెట్టమని అడిగాడు. మంచి సైకిలు కంటపడితే చాలు, ఇక అతనిఊహాలకు అంతంఉండేదికాదు. ఒకనాటిరాత్రి సరయూనదిని నల్లప్పతో పుఖగ్గర చక్రంమీద దాటినట్టు కలగన్నాడు. కల మంచి రంజుగా ఉంది. ఉక్కు చక్రం ఇసకతిన్నెలమీద గరగరమని చప్పుడుచేసుకుంటూ వెళ్ళింది. అవతలిబడ్డుకు చేరేసరికి ఒకవిధమయిన గుర్రంలా తయారయింది. తిరిగీ ఒక్కగంటలో ఇంటికి వచ్చిపడింది. తిన్నగా వంటింటికి, అక్కడనుంచి పక్కమీదికి చేర్చి పక్కన పండుకుంది. ఇదంతా మహా అద్భుతంగాఉంది. కలమొదటి భాగంమాత్రం నిజం. కాని నిద్రలేచేసరికి పక్కలో చక్రం లేక పోయేసరికి పిచ్చెత్తినట్టయింది.

ఆశ పూర్తిగా నశించి, తనుఎరుగున్న ఒకబండివాడితో మనసులోఉన్నదంతా విప్పిచెప్పాడు. వాడూ సానుభూతి చూపాడు. చక్రంలేకుండా బతకడం కష్టంఅని అంగీకరించాడు. అయిదురూపాయలిస్తే కొద్దిగంటల్లో స్వామినాథన్‌కి చక్రం సంపాదించిపెట్టగలనని చెప్పాడు. అది చాలా పెద్దమొత్తం తండ్రిఅంత అయింతరవాత ఎప్పుడో సంపాదించగలుగుతానని స్వామినాథన్ ఆశిస్తున్నాడు. అలా చెప్పాడు. దానిమీద బండివాడు ఆ సొమ్ము సంపాదించడం ఎలాగో నచ్చేటట్టు చెప్పాడు. ముందుగా ఆరుపైసలు ఇస్తేచాలు. కొద్దికాలంలో

దాన్ని ఆరుఅణాలుచేసి, ఆ తరువాత దాన్ని ఆరురూపాయలు చేసేస్తాడు. ఆ ఆరురూపాయలలో అయిదురూపాయలు పెట్టి చక్రం కొనుక్కుని తక్కినరూపాయలు ఇష్టంవచ్చినట్టు వాడుకోవచ్చు. ఆ పై రూపాయి బండివాడికి బహుమానంగా ఇవ్వడం కంటె సంతోషకరమయిన విషయం లేదని స్వామినాథన్ వెల్లడించాడు. స్వామినాథన్ మనసులో ఏదయినా అనుమానం లేకెత్తితే బండివాడు తియ్యటిమాటలతో దానిని తీర్చాడు. బండివాడు పెద్దరాణేలు తయారుచేసే విధం ఇది:



వాడూ సానుభూతి చూపాడు. చక్రం లేకుండా బ్రతకటం కష్టమని అంగీకరించాడు.

ఇంటిదగ్గర ప్రత్యేకంగా ఒకలోహపుపాత్ర ఉంది. రాగిడబ్బులు, ఒక వేరు కలిపి (ఆ వేరుపేరు చంపినా వాడు చెప్పడు) ఆ

పాత్రలో వేసి, దానంతటినీ భూమిలో పాతిపెట్టి, దానిమీద అర్ధరాత్రివేళ కూర్చుని యోగాభ్యాసంచేస్తాడు. ఇక ఆశ్చర్యం! రాగి డబ్బులు వెండినాణేలుగా మారిపోతాయి. బంగారం కూడా చేయగలడుగాని, దానికి కావలసిన వేరు సంపాదించడానికి 250 మైళ్ళు వెళ్ళిరావాలి. మహా ప్రయాస.

ఆరుపైసలు సంపాదించడానికి బాగా ఆలోచించి మరీ ఎత్తువేయాలి గనక మళ్ళీ ఎప్పుడు కనిపిస్తావని బండివాడిని స్వామినాథన్ అడిగాడు. వెంటనే డబ్బులు తెచ్చివ్వకపోతే కొన్ని వారాలవరకు కలుసుకోవడంపడదనీ, యజమానికూడా తనూ గ్రామాంతరం వెళుతున్నాననీ చెప్పాడు బండివాడు. దానిమీద స్వామినాథన్ ఆరుగంటలు వ్యవధిఇమ్మని గడ్డం పుచ్చుకు బతిమాలుకుని ఇంటికి పరుగెత్తాడు.

నాయనమ్మదగ్గిర డబ్బులులాగాలని ముందుగా ఎత్తు వేశాడు. కన్నీళ్ళు పెట్టుకుని తనదగ్గిర డబ్బులులేవని చెప్పి కొయ్యపెట్టె బోర్లించి చూపింది.

"నాకు తెలుసు నాయనమ్మా! తలగడాకింద బోలెడన్ని డబ్బులు దాచావ్"

"అబ్బే లేదురా. కావలిస్తే వెతుక్కో."

స్వామినాథన్ నాయనమ్మనుపక్కమీదనుంచి లెమ్మని, తలగడాలకింద జంఖానాలకిందా తెగ వెదికాడు.

"నీ కిపుడు డబ్బులెందుకు బాబూ?" అని అడిగింది నాయనమ్మ.

"వుంటే యియ్యి. అంతేగాని యీ వెధవప్రశ్న లెందుకు?"

నాయనమ్మ కోడలిని కేకేసి "వుంటే వీడికి ఆరుపైసలు యియ్యి" అంది. కాని ఒక్కారగా స్వామినాథన్‌కి డబ్బులివ్వడానికి ముందుకురాలేదు. తండ్రి పో పొమ్మన్నాడు. పో పొమ్మనేసరికి క్లయింటులదగ్గిర తీసుకున్న డబ్బంతా ఏంచేస్తున్నాడా అని స్వామినాథన్‌కి అనుమానం వేసింది.

ఆఖరిసారిగా సాహసంచేసి యత్నించాడు. మోకాళ్ళమీద చేతులమీదా ఆనుకుని, చెంపలు నేలకుఆనించి వాళ్ళ నాన్న బట్టలబీరువాకిందకు తొంగిచూశాడు. అక్కడ చిల్లర డబ్బులు పడివుంటాయని అతని పిచ్చినమ్మకం. బీరువాకిందికి చేయిపోనిచ్చి నలుమూలలా వెదికాడు. దుమ్ముకొట్టుకు పోయిన కవరుఒకటి, ఒక బొద్దెంక, దుమ్ము – ఇవీ బీరువాకింద దొరికినవి.

శ్రద్ధపడితే మాజిక్‌చేయగలననికూడా స్వామినాథన్‌కి నమ్మకంఉంది. ప్రార్థించినవారికి వెంటనే దేవుడు సహాయం చేస్తాడని ఎబెనెజార్ చెప్పడం జ్ఞాపకంవచ్చింది.

చిన్న అట్టపెట్టెఒకటి సంపాదించి, దాంట్లో రెండు గులకరాళ్ళు వేసి, ఇసుకతో ఆకులతో నింపాడు. ఆ పెట్టెను పూజామందిరంలోకి తీసుకువెళ్లి ఒకమూల పెట్టాడు. ఆ గది చిన్నది. గోడలకు దేవుళ్ళపటాలు వేలాడుతున్నాయి. చిన్న కొయ్యదిమ్మమీద కంచు, రాగివిగ్రహాలున్నాయి. పువ్వుల వాసన, కర్పూరపువాసన ఎడతెగకుండా కొడుతోంది.

దేవుడివిగ్రహాలముందు చేతులుకట్టుకుని నిలబడి ఆ పెట్టెలో ఏమున్నదీ, ఆ రెండుగులకరాళ్ళను మూడేసిపైసల నాణేలుగా మారుస్తాడని ఎలా తాను నమ్ముతున్నదీ, అత్యవ

సరంగా తనకు డబ్బులు ఎందుకు కావలసివచ్చిందీ విన్నవించు కున్నాడు. ఈవిషయంలో సహాయంచేస్తే బొటనవేలుకోసు కోనని ప్రమాణంచేశాడు. కళ్లుమూసుకుని "ఓ శ్రీరామా! పదితలల రావణాసురుడిని చంపినవాడికి నాకు ఆనుపైసలివ్వడం ఒక లెక్కా! ... ఆనుపైసలు యిప్పుడు యిస్తే, చక్రం యెప్పుడు యిస్తాన్? ఆ నేకేమిటో చెప్పుదూ — కాదే! చక్రం సంపా దించేరహస్యం చెప్పనా? — ఓ రామా! నాకు ఆనుపైసలు యిచ్చావా సంవత్సరంవరకు బొటనవేలు కోసుకోవడం మానేస్తాను ..."

దాన్లో ఊరికే తిరగసాగాడు. కొద్దినిమిషాల్లో గులక రాళ్లు డబ్బులుగా మారిపోతాయని నమ్మాడు. ఇదంతా జరగడానికి అరగంట వ్యవధిపెట్టుకున్నాడు.

పదినిమిషాలతరువాత పూజామందిరంలోకి వెళ్లి దేవు ళ్ళకు సాష్టాంగనమస్కారంచేసి, లేచి పెట్టెతీసుకుని దాన్లో ఒకమూలకు పరుగెత్తాడు. గుండె టకటకా కొట్టుకోసాగింది. పెట్టెతెరిచి నేలమీద గుమ్మరించి ఇసుకలో వేళ్ళుపెట్టి వెది కితే గులకరాళ్లు చేతికి తగిలాయి. ఆ పెట్టెవంక, చెల్లాచెద రుగా పడిఉన్న ఆకులవంక, ఇసకవంక, డబ్బులుగామారని గులక రాళ్ళవంక చూసేసరికి ఒళ్ళుమండిపోయింది. దేవుళ్లు దయ జూపకపోవడంవల్ల విపరీతమయిన కోపంవచ్చింది. కన్నీళ్లు కారాయి దేవుళ్ళను తిట్టిపోయాలనిపించింది. కాని భయం వేసింది. దేవుళ్ళమీదికోపం అట్టపెట్టెమీద చూపుతూ దానిని అటూఇటూ తన్నాడు. ఆకులను, ఇసకను కాళ్ళతో తొక్కాడు. కొంచెం ఆగి ఈ పనిచేయడం దేవుళ్ళకు ఇష్టం

ఉంటుందా అని సందేహించాడు. డబ్బు లేకపోయినా పరవా లేదుగాని, దేవుళ్ళకు కోపంవస్తే ప్రమాదం. వాళ్లు తనను పరీక్షలో తప్పించొచ్చు. తండ్రినో తల్లినో, నాయనమ్మనో, తమ్ముడినో చంపేయొచ్చు. మళ్ళీ పెట్టెతీసుకుని తాను ఏ ఇసు, కను ఆకుల్ని గులకరాళ్ళను అన్ని కలిపిపారవేశాడో వాటి తోటే పెట్టె నింపాడు. అరటిచెట్టుకింద గొయ్యితీసి భక్తితో పెట్టెను పాతిపెట్టాడు.

## II

పదినిమిషాలతర్వాత స్వామినాథన్ ఆ సందులోకి వెళ్ళి మణిఇంటిముందు నిలబడి, రెండుమూడుసార్లు ఈల వేశాడు. కాని మణి బయటకు రాలేదు. స్వామినాథన్ మెట్లు ఎక్కి తలుపుకొట్టాడు. లోపల గడియచప్పుడవుతూంటే సందేహంతో ఊగిసలాడుతూ నిలబడ్డాడు. మణిగాక ఇంకెవ రయినా తలుపుతీస్తే తానక్కడికి ఎందుకువచ్చిందీ చెప్ప లేకపోతానని భయపడ్డాడు. తలుపు తెరుచుకుంది. గుండె గటుక్కుమంది. బొద్దుకనుబొమల భారీమనిషి ఎదురుగా కని పించి "యెవరు నువ్వు ?" అని అడిగాడు.

"నువ్వెవరివి ? మణి యేడీ ?" అని అడిగాడు స్వామి నాథన్. తాను మణిని కలుసుకోవడానికి వచ్చాననీ, ఈమనిషిని చూసి ఆశ్చర్యపోయాననీ, అందుకని అతనెవరో తెలుసుకో దలచాననీ ఈ ప్రశ్న వేయడంలో స్వామినాథన్ ఉద్దేశం. కాని కంగారులో సరిగా చెప్పలేకపోయాడు.

"నాయింటికొచ్చి యెవరునువ్వని నన్నడుగుతావా !" అని అరిచాడు ఆ బొద్దుకనుబొమలవ్యక్తి. స్వామినాథన్

వెనుదిరిగి పారిపోదామని మెట్లకిందికి దూకాడు. కాని ఆ వ్యక్తి "యిలా రా అబ్బాయి"అని గట్టిగా పిలిచాడు. అతనిమాటను త్రోసెయ్యటం అసాధ్యం. స్వామినాథన్ నెమ్మదిగా మెట్లె క్కాడు. భయంతో గుడ్లు ముందుకు పొడుచుకువచ్చాయి. "పారిపోతావేం? మణిని చూస్తానికి వస్తే లోపలికివెళ్ళి చూడవేం?" ఇది యుక్తియుక్తంగానే ఉంది.

"పరవాలేదు" అన్నాడు స్వామినాథన్ అసందర్భంగా.

"సరే, లోపలికి వెళ్ళి చూడు అబ్బాయి."

స్వామినాథన్ భయపడుతూ భయపడుతూ ఇంట్లో ప్రవేశించాడు. మణి తలుపువెనక గంగిగోవులా నిలబడి ఉన్నాడు. ఒక్కమాటకూడా మాటాడకుండా ఇద్దరూ ఒకరి నొకరు తేరిపారజూచుకోసాగారు. బొద్దుకనుబొమల వ్యక్తి వీపు వారికేసిపెట్టి గుమ్మంలో నుంచుని వీధిలోకి చూస్తు న్నాడు. స్వామినాథన్ భయంతో వేలుసాచి చూపుతూ ఆయన ఎవరేమిటి అని అర్థంవచ్చేటట్టు తలపంకించాడు. మణి మెల్లిగా' "మామయ్య!" మామయ్య అకస్మాత్తుగా వెనుదిరిగి "అలా ఒకరినొకరు తేరిపారజూసుకుంటూ నిల బడ్డారేం! మాటాడుకోండి" అన్నాడు. ఇలా సలహాఇచ్చి ఇంటిముందు కొట్లాడుకుంటున్న రెండుకుక్కలను పారదోల డానికి వీథిలోకివెళ్ళాడు. మాటవినిపించనిదూరంలో ఉన్నాడు. "ఏమి మామయ్యా? యెరగనే మణీ! యిపుడు బయటికి రాలేవా? రాలేవూ... నేను చాలా పనివుండి వచ్చాను. అత్యవసరం_ఆరు పైసలు కావాలి-బండివాడు కొన్నివారాలకి కాని తిరగిరాడు. అవకాశం పోగొట్టుకోకూడదు... చక్రం

లేందే గడిచేటట్టులేదు.'' అని ఆగాడు. మణిమామయ్య కుక్కల చుట్టూ తిరుగుతూ, తిడుతూ, రాళ్ళకోసం వెదుకుతున్నాడు. ''నా జీవితమంతా దానిమీద ఆధారపడివుంది. నువు యివ్వక పోతే నాపని ఖాళీ. తొందరగా డబ్బులు తీసుకురా.''

''నా దగ్గిర లేవు. యెవరూ నాకివ్వరు'' అన్నాడు మణి.

స్వామినాథన్ లాభంలేదనుకున్నాడు. ''మీమామయ్య డబ్బు యెక్కడ దాస్తాడు? ఆ పెట్టెలోనేమో చూడు...''

''నాకు తెలీదు''

''మణీ! యిలా రా'' అని వాళ్ళమామయ్య వీధిలో నుంచి పిలిచాడు. ''యిలావచ్చి యీ దెయ్యాల్నితోలేసెయ్. రాయి ఒకటి యిలా యియ్.''

## III

''రాజం! పోలీసువాడిని నాతో పంపించు'' అన్నాడు స్వామినాథన్ రెండువారాల తరువాత.

''పోలీసునా! యెందుకు?''

''ఒక దొంగవెధవ నాదగ్గిర డబ్బుకొట్టేశాడు.'' బండి వాడితో వ్యవహారమంతా స్వామినాథన్ రాజంకు తెలియ జేశాడు. ''యిపుడు'' అంటూ తిరిగి మొదలుపెట్టాడు తన విషాదగాథ: ''నన్ను చూసినపుడల్లా యెరగనట్టు నటిస్తున్నాడు. వాడియింటికి వెళితే ఇంటోఉండికూడా లేడనిపిస్తున్నాడు. నేను మొండికేస్తే కుక్కనుఊడదీసి వుసికొలుపుతానని బెదరి స్తున్నాడు.''

''వాడిదగ్గిర కుక్క వుందా?''

''వుందేమో నేను చూడలేదు''

"అలాఅయితే యింటోకి . జొరబడి రెండు తన్నక పోయావా? "

"చెప్పడానికేం యెన్నయినా చెప్పచ్చు. వాడిని కలుసుకోవడానికి వెళ్ళినపుడల్లా నాకు వణుకుపుడుతుంది. బండి వాళ్ళయిళ్ళల్లో యేంవుంటాయో యెవడికి తెలుసు? ... నామీందికి గుర్రాన్ని వురికించవచ్చు."

"వురికించనీ! అది నిన్నేం మింగేస్తుందా?" అన్నాడుమణి.

"అలాగా! సంతోషించాన్లే! ఒకనాడు నాతోవచ్చి గుర్రాలవిషయం– దర్జీ రంగ చెపుతాడు – విను. గుర్రాలు ఒకొకప్పుడు పెద్దపులులకంటె కూడా ప్రమాదమయినవి." అన్నాడు స్వామినాథన్, ఆమాటలు నిజంగా నమ్ముతూ.

"యేదో ఒకరోజున కాపువేసి గేటుదగ్గిర వాడిని పట్టుకోరాదూ? " అని సూచించాడు రాజం.

"అదీ యత్నించిచూశాను. కాని బయటికివచ్చినప్పు డల్లా బండిమీంద వస్తాడు. నన్నుచూడగానే కొరడా పైకి తీసే వాడు. దూరంగా వెళ్ళి కేకేసేవాడిని. కాని యేంలాభం? వాడి గుర్రం యెగిరిపోతుందనుకో–నాకు రెండణాలు టోపీపెట్టడం తలుచుకుంటే! "

"ఆరుపైసలు కదూ? "

"కాని మళ్ళీ రెండుసార్లు ఆ రేసిపైసలు చొప్పున పుచ్చు కున్నాడు ... "

"అలాఅయితే మొత్తం అణాన్నర! " అన్నాడు రాజం.

"కాదు రాజం! రెండణాలు"

"అరె అబ్బీ! పన్నెండు పైసలు ఒక అణా. తడవకు ఆరు పైసలుచొప్పున మూడుతడవలు యిచ్చావు. అంటే పద్ధెనిమిది పైసలు–అణన్నర యిచ్చావన్నమాట"

"యిదెందుకూపనికిరాని చర్చలే. అణాకి యెన్నిపైసలయితే యెవరి కేం పట్టింది?" అన్నాడు స్వామినాథన్.

"కాని డబ్బువిషయంలో ఖచ్చితంగా వుండాలి. సరే కానీ."

"బండివాడు 'మొదట రెండురోజులలో వెండినాణేలుగా మార్చియిస్తానని ఆరుపైసలు తీసుకున్నాడు. నాలుగు రోజులు నన్ను తప్పించుకుని తిరిగాడు. ఆ తరవాత 2 పైసలు పెట్టి వేసుకొన్నాను. యింకా ఆరుపైసలిమ్మన్నాడు. ఆ తరువాత యింకో ఆరుపైసలు కావాలి, లేకపోతే అంతా వృధా అయిపోతుంది, అని చెప్పి యింకో ఆరుపైసలు పుచ్చుకున్నాడు. ఆ తరవాత నేను వెళ్ళినపుడల్లా యేదో ఒక వంక చెప్పి తప్పించుకుంటున్నాడు. వాతావరణం సరిగా లేనందున పని మెల్లగా సాగుతోందని తరుచు చెపుతూవచ్చాడు. రెండు రోజులక్రితం వెళితే 'నిన్నెరుగను, నీ డబ్బెరుగను' అన్నాడు. యిపుడు యెలా ప్రవర్తిస్తున్నదీ నీకు తెలుసు. డబ్బుకేమొచ్చె గాని, వాడి కొడుకంటె నాకు పరమాసహ్యం. నేను కనిపించినపుడల్లా వెక్కిరిస్తాడు. మురికినీరు నెత్తిమీద పోస్తానని బెదిరించాడు. ఒకరోజున చాకు తీసి చూపించాడు. వాడిని చితకదన్నాలి. వాడినితంతే వాళ్ళనాన్న రెండణాలు తెచ్చిస్తాడు."

# IV

మర్నాడు స్వామినాథన్ మణి బండివాడి ఇంటికి బయలుదేరారు. ఈ విషయం స్నేహితులముందు ఎత్తకుండా ఉంటే బాగుండిపోయేదని సామ్వినాథన్ పస్తాయించసాగాడు. వ్యవహారం అతని చేయి దాటిపోతోంది. ఈ వ్యవహారంలో రాజం, మణి చూపెడుతున్న ఆసక్తినిబట్టి చూస్తే ఎక్కడికి దోసతీయిస్తారో ఎవరికీ తెలీదు.

బండివాడికొడుకును మోసగించి ఎత్తుకుపోవడానికి రాజం ఒక చిన్న ప్లాను వేశాడు. ఆ ప్లాను ఆచరణలో పెట్టవలసింది మణి. బండివాడికొడుకుతో స్నేహం నటించాలి. మొదటిదశలో స్వామినాథన్ ఎక్కువగా పాల్గొనక్కరలేదు. మణికి బండివాడిఇంటిని చూపించడంతో అతనిపని తీరిపోతుంది.

బండివాడు స్వామినాథన్ఇంటికి పడమరగా మైలు దూరంలో కీలాచెరీలో నివసిస్తున్నాడు. అక్కడఉన్నదల్లా పాగచూరిపోయి, మురికికంపుకొడుతున్న డజను తాటాకు గుడిసెలు. ఒకదానిమీద ఒకటి ఉన్నాయి.

ఆ స్థలానికి కొద్దిదూరంలో వారుఉండగా పగతీర్చుకునేయత్నం మానిపించాలని ఆఖరిసారిగా యత్నించాడు.

"మణి! బండివాడికొడుకు డబ్బు తిరిగి యిచ్చివేశాడనుకుంటా."

"యేమిటీ!"

"అనుకుంటా..."

"అనుకుంటున్నావా? అయితే యేదీ చూపించు"

"మణీ! పోనీ వాడినివదిలేద్దూ. వాడినంటిమీద చేయి వేస్తే ఠోంచిక్కుల్లోయిరుక్కుంటామో!"

"నోరుమూస్తావా లేకపోతే మెడకాయ పిసికేసేయనా ?"

"మణీ! పోలీసులు – లేకపోతే ఆ పిల్లాడు మహా చెడ్డవాడు. యేమయినా చెయ్యగలడు."

ఆపిల్లవాడంటే స్వామినాథన్‌కు లోపల చెడ్డభయం. మధ్యమధ్య రాత్రిళ్లు ఆ పిల్లవాడిమొహం భయంకరంగా కళ్ళకుకట్టేది. ఇంకేముంది, స్వామినాథన్ వణికిపోయేవాడు.

"మూడోయింటో వుంటాడు"అని స్వామినాథన్ ఆ ఇల్లు చేతితో చూపించాడు.

ఆఖరిక్షణంలో మణి ప్లానుమార్చి స్వామినాథన్‌ను కూడా రమ్మని పట్టుపట్టాడు. కాని స్వామినాథన్ ససేమిరా రానని వీధిలో కూచున్నాడు. మణి తనపట్టు విడువలేదు. బండివాడిఇంటిముందువరకు స్వామినాథన్‌ని ఈడ్చుకువచ్చి అతని మీాద ధూంధాంలు మొదలుపెట్టాడు.

"మణి! యేవిటీగొడవ ?"

"గాడిదకొడకా!"అంటూ తిడుతూ కొట్టడానికి చేయి ఎత్తాడు.

స్వామినాథన్ ఏడుపు మొదలుపెట్టాడు. మణి అతని గొంతునులిమేయాలనిచూశాడు. ఇంతలో వారిచుట్టూ జనం– బానకడుపులతుంటరిపిల్లలు, నల్లటిస్త్రీలు, వాళ్ళమగవాళ్లు గుమిగూడారు. కోడిపిల్లలు అరుస్తూ అటూఇటూ పరుగెత్తుతున్నాయి. సూర్యుడు దయాదాక్షిణ్యాలుచూపడంలేదు.

ఒక చెట్టునీడను రెండుమూడుజంతువులు గురకపెడుతూ నిద్ర పోతున్నాయి. కోళ్ళగూళ్ళకంపు, మాసినబట్టలకంపు గుప్పు మంటోంది.

స్వామినాథన్ చూపించిన గుడిసెలోనుంచి మూడడుగులవ్యక్తి బయటికి వచ్చాడు. బట్టలు సరయినవి లేవు. స్నానంచేసిఎరగడు. జనంలోనుంచి దారిచేసుకుంటూవచ్చి, అనువయినస్థలం చూసుకుని బొటనవేలు చీకుతూ పోట్లాట మహాసంతోషంతో చూస్తున్నాడు. స్వామినాథన్‌ని చూపిస్తూ మణి జనంకేసితిరిగి, "వీడెవడో తుంటరివెధవ రెండణాలివ్వమని డబాయిస్తున్నాడు. వీడిని యిదివరలో యెన్నడూ నేను చూడలేదు. నేను వీడికి రెండణాలు బాకీయట!" ఈ ధోరణిలో మణి పదిహేనునిమిషాలసేపు మాటాడాడు. ఆ తరవాత బండివాడికొడుకు నోట్లోనుంచి బొటనవేలుతీసి వేసుకుని "జైలుకుపంపించాల్సిందే" అన్నాడు. దానిమీద మణి వాడికేసి అవునన్నట్టు చిరునవ్వునవ్వి "పోలీసుస్టేషనుకు తీసుకువెళతాను, కాస్త సాయంచేస్తావా?" అని అడిగాడు.

"ఊహుఁ" అన్నాడు బండివాడికొడుకు. వాడికీ పోలీసుస్టేషనంటే భయమే.

"పోలీసుస్టేషనుకు తీసుకువెళ్ళాలని నీ కెలా తెలుసు?" అని అడిగాడు మణి.

"నాకు తెలుసు,"

"నిన్నూ యీవిధంగానే చిక్కులుపెట్టాడా?"

"లేదు"

'మీనాన్న నాదగ్గిరతీసుకున్న రెండణాలు యేవీ?"

అని స్వామినాథన్ అడిగాడు, కన్నీళ్ళతో తడిసిన మొహం ఆ పిల్లవాడికి చూపుతూ. శాంతపరుద్దామని జనం సగంమనసుతో యత్నించి, చల్లగా జారుకోసాగారు. మణి ఆ పిల్లవాడిని హఠాత్తుగా "నీ కీ బొంగరం కావాలా?" అని అడిగాడు తళ తళా మెరిసే ఎర్రటిబొంగరం తీసిచూపిస్తూ. ఆ పిల్లవాడు బొంగరంకోసం చేయిచాచాడు.

"యిది యివ్వడానికివీల్లేదు. నాతోవస్తే యింతకన్నా



"నిన్నూ ఈవిధంగానే చిక్కులుపెట్టాడా?" మణి

పెద్దబొంగరం యిస్తాను. మనం స్నేహంకడదాం" అన్నాడు మణి.

ఆ పిల్లవాడు అభ్యంతరం చెప్పలేదు."యేదీ చూడనీ" అన్నాడు. మణి బొంగరం వాడికి ఇచ్చాడు. ఆ పిల్లవాడు దానిని చేతులో రెండుమూడుసార్లు తిప్పి రెప్పపాటుకాలంలో అక్కడనుంచి మాయమయినాడు. మణి పరిస్థితిని వెంటనే గ్రహించలేకపోయాడు. కొద్దికాలంపట్టింది. పరిస్థితి గ్రహించి చూసేసరికి ఆ పిల్లవాడు దూరంగా ఒక గుడిసెలోకి వెళు తున్నాడు. మణి అతనివెంటపడ్డాడు.

మణి ఆ గుడిసెదగ్గిరికి వెళ్ళేసరికి తలుపు మూసిఉంది. తలుపు పన్నెండుసార్లు కొట్టింతర్వాత ఒక ముక్కోపిమనిషివచ్చి పిల్లవాడు అక్కడ లేడని చెప్పి మళ్ళీ తలుపువేసుకున్నాడు. మణి తిరిగీ తలుపుకొట్టసాగాడు. ఇరుగుపొరుగువాళ్ళు ఇద్దరు ముగ్గురువచ్చి 'యిక్కడ గొడవచేస్తే పాతిపెట్టేస్తాం'. అని బెది రించారు. తిరిగివచ్చేయమని స్వామినాథన్ మణిని వేడుకో సాగాడు. కాని మణి ఒకపట్టున కదలలేదు. తలుపు కొడుతూనే ఉన్నాడు.

ఇరుగు పొరుగువాళ్ళు కొద్దిగజాలదూరంలో చేతుల నిండా రాళ్ళు పుచ్చుకుని నిలబడి చెట్లకింద నిద్రపోతున్న కుక్కలను లేపసాగారు.

కుక్కలు ఉరుక్కుంటూ మీదికి వస్తూంటే మణి "పరుగెత్తు" అని స్వామినాథన్‌కి కేకవేసి చెప్పి తనూ పరు గెత్తసాగాడు.

రెండురాళ్ళువచ్చి స్వామినాథన్‌వీపుకు తగిలాయి.

ఒకటి రెండు మణికికూడా తగిలాయి. సూదిలాంటి రాయి తగిలి మణి కుడిమడమచర్మం ఊడింది. ముందు దోవ తప్ప వారి కింకేమీ కనిపించలేదు.



"పరుగెత్తు" అని స్వామినాథన్‌కి కేకవేసి చెప్ప
మణి తనూ పరుగెత్తసాగాడు.

# పదకొండో ప్రకరణం

## తండ్రిముందు

### I

వేసవికాలంలో దక్షిణభారతదేశంలోకల్లా దారుణ మయిన పట్టణం మాల్గుడి. అపుడప్పుడు వేడిమి నీడలోనే నూటపదిడిగ్రీలదాకా ఉండేది. వేసవిలో వీధులలో ఎవరూ కనిపించరు. వీధులనిండా దుమ్మూ ధూళి. అస్తమానమూ అటూఇటూ తిరిగే గాడిదలు కుక్కలుకూడా వీధిఅంచున నీడకుచేరేవి. మండిపోయేసూర్యుడు పడమటిమొహంపట్టగానే భవంతులపిట్టగోడలు చూరులు నీడను ప్రసరిస్తాయి.

అయితే ఈ ఎండకికూడా ఒక విచిత్రమయినస్వభావం ఉంది. దానినిగురించి పట్టించుకున్నవారినే అది బాధపెడుతుంది. మాల్గుడిలో ఎండభరించడం కష్టంఅని ఎవరయినా అంటే స్వామినాథన్‌కి, మణికి, రాజంకి ఆశ్చర్యంవేస్తుంది. మధ్యాహ్నంవేళ వారికి ఎక్కువ ఆకర్షణీయంగా కనిపించేది. మిల్లు మానేజరు మిస్టర్ హెన్సెల్‌మీదపడి అతనిని కొడయికెనాల్‌కు తరిమినఎండే, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు మిస్టర్ కృష్ణన్‌మీదపడి ఎండా వానా అనక తిరగవలసిన తన ఉద్యోగం మహా కష్ట మయిందనిపించిన ఎండే, స్వామినాథన్ గిరజాలతలమీద, మణి జడలతలమీద, రాజం పొట్టిక్రాఫుతలమీదా పడేది కాని. వారినేమీ చేయలేకపోయింది. పట్టణానికివెలుపల ఒక బియ్యంమిల్లు ఉంది. దానియజమాని మిస్టర్ రెట్టీ యూరో పియన్ అయినా ఇండియాకు అలవాటుపడిపోయాడు. అతని

పుట్టుపూర్వోత్తరాలు అక్కడివారికి ఏమీ తెలియవు. మంచి అరవంలో కొడుకును, వాడకందార్లను తిట్టేవాడు. షర్టు, నిక్కరు, పాంకోళ్ళు తొడుగుకుని తిరుగుతూండేవాడు. ఒక రోజున పాంకోళ్ళు తొడుగుకోవడం మరిచిపోయి, కాలేనేల మీద అడుగుపెట్టి కెవ్వుమన్నాడు. కాని ఆ ఎండలో ఆ ముగ్గురు స్నేహితులకు నీడపట్టున కూర్చోవడమంటే అసహ్యం వేసేది.

మునిసిపల్ సరిహద్దులకు అరమైలులో ట్రంక్ రోడ్డు మీద చిన్న వంతెనమీద ఆ స్నేహితులు ముగ్గురు కూర్చున్నారు. వంతెన కిందుగా ఇసుకపర్రమీదనుంచి చిన్న నీటికాలువ ప్రవహిస్తూ దిగువన సరయూనదిలో కలుస్తోంది. వారు కూర్చున్న చోట చెట్టు అంటూ లేదు. సూర్యకిరణాలు వచ్చి సూటిగా వారి తలలమీద పడుతున్నాయి. రోడ్డుకు రెండుపక్కలా పొలాలు. కాని ఇప్పుడుమాత్రం ఆ పొలాలనిండా ఎండుదుబ్బులు, మధ్య మధ్య మామిడి, కొబ్బరితోపులు మాత్రం ఉన్నాయి. ట్రంక్ రోడ్డుమీద జనసంచారం లేదు. అపుడపుడు ఏ పల్లెటూరిబండో రోడ్డుమీద సాగిపోతూంటుంది.

"నేను చెప్పినట్టు చేసి వూరుకుంటే బాగుండిపోయేది" అన్నాడు రాజం మణితో.

"అవును రాజం! బండివాడికొడుకును చూపించి, మనం ముందుగా అనుకున్నట్టు వెళ్ళిపోదామనుకుంటూంటే హఠాత్తుగా నన్ను ఖూనీచెయ్యబోయాడు ..." అంటూ స్వామినాథన్ మణివంక కోపంగా చూశాడు.

మణిని ఎవరూ సమర్థించలేదు. "నేను తెలివితక్కువ దద్దమ్మని. అప్పటికపుడు తోచినట్టుగా చేయాలనిచూశాను.

బొంగరాన్ని గనుక గట్టిగా పట్టుకున్నట్టయితే, వాడికి టోక్సీ వేసేవాడిని. యీపాటికి వాడు ఒంటరిగా గుడిసెలోపడి యేడుస్తూండేవాడు." అతనిగొంతులో పస్తాయింపు వినిపించింది.

స్వామినాథన్ మెడ వెనక చేతితో రుద్దుకుంటూ "యింకా నెప్పిగానేవుంది." అన్నాడు. కీలాచెరిలో జరిగిన సంఘటనతరువాత స్వామినాథన్‌ని మెకనులమాలనిచూడడం పట్టి నటన అని నచ్చచెప్పడానికి మణికి మూడుగంటలుపట్టింది.

"కాని స్వామిమీద అంత మోటుగా చేయిచేసుకోకుండా వుండవలసింది" అన్నాడు రాజం.

"బాబూ!" అన్నాడు మణి చేతులుముడుచుకుంటూ. "పదినిమిషాలసేపు తలమీద నిలబడతాను, శిక్షగా. స్వామి నా శత్రువని బండివాడికో మకుని నమ్మించడానికి మెకనులుము తున్నట్టు నటించాను, అంతే."

ఇంతలో గలగలమని చప్పుడయింది. తెల్లటిఎద్దు లాగుతున్న బండి రోడ్డువెంట వస్తోంది. బండికి తాటాకుగుడిసె. నంతెనకుటక గజందూరంలోకి రాగానే వాళ్ళు లేచి ముందుకు వెళ్ళి వరసగా నుంచుని, "యెద్దును వూడదీయ్" అని బిగ్గరగా అరిచారు.

బండితోలుతున్నది పల్లెటూరిపిల్లవాడు.

"బండి ఆపు దద్దమ్మా!" అని అరిచాడు రాజం.

ఆపకపోతే అరెస్టుచేసి బండి జప్తుచేద్దాం" అన్నాడు స్వామినాథన్.

బండికుర్రాడు అన్నాడు:

"బండిఆపమంటా రెందుకు?"

"నోరుముయ్!" అని మణి గదమాయించి, గంభీరంగా బండిచుట్టూ తిరిగి, చక్రాలు పరీక్షగాచూశాడు. వంగి బండిఅడుగుభాగం పరీక్షించాడు. "యేయ్ బండివుాడా! దిగు."

"అబ్బాయిలూ! నేను తొందరగా వెళ్ళాలి" అంటూ వేడుకున్నాడు బండివుాడు.

"అబ్బాయి లేవిటి?" అన్నాడు రాజం బెదరిస్తూ.

"మే మెవరమో నీకు తెలీదా?"

'నీ లాంటి దొంగవెధవల్ని పట్టుకోడానికున్న గవర్నమెంటు పోలీసులం" అన్నాడు స్వామి.

"యికనోరెత్తావో తుపాకితో కాల్చిపారేస్తాను"అన్నాడు రాజం. బండివుాడు తేలిగ్గా మోసపోయేవాడు కాదు, గాని, వారు చెప్పిందాంట్లో ఏదో ఉందనిమాత్రం భావించాడు

మణి చక్రంమీాద కొట్టి "వంతెన గట్టిగాలేదు. రహదారిచీటి చూపిస్తేగాని, నిన్ను వెళ్ళనీయం"

బండివుాడు తడబడుతూ "దయయుంచండి బాబూ! వెళ్ళాలి" అన్నాడు.

"నోరుముయ్!" అని రాజం అదమాయించాడు.

స్వామినాథన్ ఎద్దును పరీక్షగాచూసి "యిలా రా!" అని పిలిచాడు.

బండివుాడికి దిగి వెళ్ళడం ఇష్టంలేదు. మణి వాడిని బండిలోనుంచి కిందికి లాగి స్వామినాథన్ వేపు తోశాడు.

స్వామినాథన్ మండిపడుతూ, ఎద్దును చేతితోచూపించి "యెద్దును కడగలేదేం?" అని అడిగాడు.

"కడిగానండి" అని జవాబిచ్చాడు బండి కుఱ్ఱవాడు భయపడుతూ.

"అయితే యిదేవిఁటి?" అని అడిగాడు స్వామినాథన్ గోధుమరంగు మచ్చను చూపిస్తూ.

"ఓ అదా! పుట్టినప్పటినుంచీ వుందండి"

"పుట్టినప్పటినుంచీ! నాకు నేర్పాలనిచూస్తున్నావా ?" అని అరచి, స్వామినాథన్ తన్నడానికి కాలు పైకి ఎత్తాడు. వాళ్లు కొంచెం మెత్తపడసాగారు.

"యీ వెధవకి ఒక రహదారిచీటి యిచ్చిపంపించెయ్" అన్నాడు రాజం దయ ఒలికిస్తూ. స్వామినాథన్ పెనసలు ముక్క, చిన్న నోటుపుస్తకం తీశాడు. ఈ రెండూ ఎప్పుడూ స్వామినాథన్ జేబులో ఉంటాయి. వివిధవిషయాలు రాసుకోవడం అతని అలవాటు. సైకిలు నంబర్లు, చెప్పులు లేకుండా తిరిగేవారిసంఖ్య, చెప్పులు పాంకోళ్లు తొడుగుకొని తిరిగేవారి సంఖ్య వగైరా వగైరా రాసుకుంటాడు.

కాగితం పెనసలు సిద్ధంగా పట్టుకున్నాడు. మణి ఎద్దు తాడు పట్టుకుని వెనకకు తిప్పాడు. బండి కుఱ్ఱవాడు 'నేను యిటు వెళ్ళాలి' అన్నాడు.

"మరేం పరవాలేదు. యిక్కడ నిలబెట్టాలి. యిది సరి హద్దు" అన్నాడు మణి.

"నేను యిలా వెళ్ళాలండి ?"

"అటు తిప్పుకు వెళుదువుగానిలే"

"నీ పేరేమిటి?" అని అడిగాడు రాజం.

"కరుప్పన్ " అని జవాబిచ్చాడు బండికుఱ్ఱవాడు.

స్వామినాథన్ ఆ కుర్రవానిపేరు రాసుకున్నాడు.

"నీ కెన్నేళ్లు ?"

"తెలీదండి"

"తెలీదూ? స్వామీ! నూ రేళ్ళు రాయి" అన్నాడు రాజం.

"అబ్బే! నాకు నూరేళ్లు లేంది! "

"నోరుమూసుకుని నీ పనేవిఁటో చూసుకో. నీకు నూరేళ్లు. కాదన్నావా చంపేస్తాను. నీ యెద్దుపేరేవిఁటి? "

"నాకు తెలీదండీ"

"స్వామి! కరుప్పన్ అని మళ్ళా రాయి."

"అది నా పేరు, యెద్దుపేరు కాదు."

ఆమాట ఎవరూ పట్టించుకోలేదు. ఎద్దుపేరుకు ఎదురుగా కరుప్పన్ అని స్వామినాథన్ రాశాడు.

"యెక్కడికి వెళుతున్నావు? "

"సెతూంర్"

"అక్కడ యెంతకాలం వుంటావు? "

"అది మావూరేనండి"

"అది మీవూరయితే యిక్కడి కెందుకొచ్చావు? "

"మా మునసబుగారు రైలుష్టేషనుకి పదిబస్తాలకొబ్బరికాయలు పంపారు."

స్వామినాథన్ ప్రతిమాటా నోటుపుస్తకంలో రాసుకున్నాడు. తరువాత ఆపేజీలో ముగ్గురూ సంతకాలుపెట్టి పేజీ చించి, బండికుర్రవాడికి ఇచ్చి సాగిపొమ్మన్నారు.

## II

మే నెల రెండో వారంలో కోర్టులు మూసివేశారు. స్వామినాధన్ తండ్రి మధ్యాహ్నం వేళ ఇంటిదగ్గిరే గడపసాగాడు. ఇదంతా స్వామినాధన్‌కి సంతోషంగా లేదు. రాజం, మణిలతో మధ్యాహ్నం షికార్లు ఇక సాగవని భయంవేసింది. భయం వేసినట్లుగానే శెలవులిచ్చిన మూడో రోజునే ఇంటోనుంచి బయటకువెళ్ల బోతుంటే వాళ్ళనాన్న "స్వామి! యిలా రా" అని పిలిచాడు.

వాళ్ళనాన్న ధోవతి, బనీను వేసుకుని ముందు ఆవరణలో నిలబడిఉన్నాడు. స్వామినాధన్‌కి ఇంటిదుస్తులలో తండ్రి ఉండడం ఇష్టంలేదు. బయటికివెళ్లకుండా ఇంటోనే ఉండిపోతాడనడానికి ఈ దుస్తులు సూచన.

"యెక్కడికి వెళుతున్నావు?"

"అబ్బే! యెక్కడికీ లేదు."

"నిన్న యీ వేళపుడు యెక్కడున్నావు?"

"యిక్కడే."

"అబద్ధాలాడుతున్నావు. నిన్న నువిక్కడ లేవు. యిపుడు బయటకు వెళ్ళండలేదూ?"

"అవునవును" అంది తల్లి ఎక్కడినుంచో ఊడిపడుతూ. 'యెండలో తెగతిరుగుతున్నాడు. యిలాగే తిరిగితే యెప్పుడో వడగొట్టి చస్తాడు."

భార్య వత్తాసుఇవ్వకపోయినా ఆయన ఎటూ ఊరుకునే వాడుగాదు. ఆమెమాటలు చర్యతీసుకోవడానికి పురికొల్పాయి. గదిలోపలికి తనవెంట రమ్మని తండ్రి పిలిచాడు.

"పుస్తకాలుముట్టుకుని యెన్నిరోజులయింది?" అని అడిగాడు స్వామినాథన్‌పుస్తకాలమీదిదుమ్ము దులిపివేస్తూ. బల్లమూలకు పుస్తకాలదొంతరకు మధ్యగా ఓపిగ్గా ఒక సాలీడు అల్లుతున్నగూడును తీసిపారవేశాడు.

స్వామినాథన్ ఈప్రశ్నను మాటతప్పడంకింద జమకట్టుకున్నాడు. "బడిలేనప్పుడుకూడా చదువేనా?" అన్నాడు.

"నువేం బి. ఏ. ప్యాసయ్యావా?" అని తండ్రి అడిగాడు.

"బడి మూసివేశారు. పరీక్షరోజులు కావు. అయినా చదవాలసిందేనా, నాన్నా?"

"యేమిటా వెధవప్రశ్న? చదవాలి."

"కాని నాన్నా! పరీక్షలముందేవన్నావు? పరీక్షలు అయిపోతే యిక చదవక్కర్లేదనలా? రాజంకూడా చదవడం లేదు."

ఈ ఆఖరివాక్యం అంటూ దానినినమ్మాలనే యత్నించాడు. వారానికి మూడుసార్లు ట్యూషనుమాస్టరు వచ్చి రోజుకు రెండేసిగంటలు తనదుంప తెంపుతున్నాడని రాజం గోలపెట్టడం స్వామికి జ్ఞాపకంవచ్చింది. తండ్రి అతనిమాటలు చెవినిపెట్టలేదు. తండ్రి దగ్గరఉండి, పుస్తకాలదుమ్ము దులిపించి బల్ల శుభ్రంచేయించాడు. పుస్తకాలఅట్టలమీదిదుమ్మును స్వామినాథన్ గబగబా దులిపివేశాడు. సాలీడును జాగ్రతగా పట్టుకుని బయట పారవేయడానికి కిటికీదగ్గరకు తీసుకువెళ్ళాడు. కిటికీబయటగా దానినిపట్టుకుని కాసేపు చూస్తూ నిలబడ్డాడు. అది వందరకాలరంగులతో మెరిసిపోతూ దారపుపోగునుంచి ఊగిసలాడుతోంది.

"ఊఁ - సాలీడును బయటపారేయడానికి రోజురోజల్లా పట్టేట్టుందే" అన్నాడు తండ్రి. సాలీడును బయటికి పారవేస్తే ఏంవస్తుందీ, పెంచితే బాగుండుననీ హఠాత్తుగా తోచింది స్వామికి. తండ్రిచూడకుండా సాలీడును జేబులో వేసుకుని బయట ఉత్తిచేతిని ఆడించి, బల్లదగ్గిరికి వచ్చి కూచున్నాడు.

"చూడు, యింగ్లీషుటెక్స్టు యెలావుందో? సిగ్గు లేదూ?" స్వామినాథన్ ఎర్రబైండు నాలుగోవాచకం పైకి తీసి తెరిచి దుమ్మువదలడానికి అట్టలురెంటినీ ఒకదానికొకటి వేసి కొట్టాడు. తరవాత చమురుఅంటినఅట్టలను అరచేతితో గబగబా రుద్దాడు.

"గుడ్డముక్క తీసుకో. తుడవడానికి అదికాదు, పద్ధతి. గుడ్డముక్క తీసుకో, స్వామీ!" అన్నాడు తండ్రి సగం దయతో, సగం ఆదుర్దాతో.

స్వామినాథన్ చుట్టూచూసి, "యిక్కడ గుడ్డముక్క లేదు నాన్నా!" అన్నాడు.

"లోపలికి వెళ్ళి తీసుకురా"

ఇలా అనడం బాగుంది. స్వామినాథన్ తొందర తొందరగా గదిబయటికి వెళ్ళాడు. నాయనమ్మదగ్గిరికి ముందుగా వెళ్ళి "నాయనమ్మా! యింత గుడ్డముక్క వుంటే యిద్దూ, తొందరగా!" అని అడిగాడు.

"నే నెక్కడినించి తీసుకురానురా?"

"యెక్కడినించో" అని చిరచిరలాడుతూ అడిగి, "శెలవుల్లోకూడా చదవాలసివుంటే, మరి శెలవులు యివ్వడం దేనికి?" అన్నాడు.

"యేమిటి గొడవ ?"

ఆమెదయ సంపాదించడానికి ఇదే మంచి అదను అను కుని ఏడుస్తూ "యిక్కడ నేను పిచ్చిచదువు చదువుతూ కూచుంటే అక్కడ రాజం, మణి కొచుకున్చుని యేమనుకుం టారో? నాయనమ్మా! నాన్నకు వేరే పనిలేకపోతే హాయిగా పడుకుని నిద్రపోగూడదూ ?"

హాలులోనుంచి తండ్రి "గుడ్డ కనిపించలేదూ ?" అని కేక పెట్టాడు.

"నాయనమ్మదగ్గిర లేదు. అమ్మదగ్గిర వుండేమో చూస్తాను". వాళ్ళఅమ్మ వెనక నడవలో చాపమీద కూచుని ఉంది. తొడమీద పిల్లవాడు పడుకుని నిద్రపోతున్నాడు. స్వామినాథన్ ఆమెకేసి తేరిపారజూచాడు. కొద్దినిమిషాలసేపు ఆమె భర్తకు ఇచ్చిన సలహా అతని మనసులో మెదిలింది.

"బలే దొరసానిలా వున్నావు అమ్మా! నాబోటి బీద వాళ్ళని మా కర్మానికి మమ్మల్ని వదిలేయకూడదూ?" అన్నాడు మెల్లగా.

"యేమిటి ?" అని ఆమె అడిగింది. అతనిమాటలలోని ఎత్తిపొడుపు ఆమె గ్రహించలేదు. కొద్దినిమిషాలక్రితం భర్తకు ఏమి చెప్పిందికూడా మరిచేపోయింది.

"వెళ్ళి నా మీద పితూరీలు చెపుతావా ? నేను నీకేం విషం పెట్టాను?" ఈవిధంగా ఇంకా కొంత సేపు మాటాడేవాడేగాని తండ్రితుడుపుగుడ్డకోసంకాచుకునిఉన్నాడు.

"కొంచెం గుడ్డముక్క వుంటే యివ్వు" అని అడి గాడు అసలువిషయానికి వస్తూ.

"యేం గుడ్డ?"

"యేం గుడ్డో నాకేం తెలుసు? నేను ఆ పుస్తకాలు శుభ్రంగా తుడవాలట, శెలవులు పసందుగా గడపడంఅంటే యిదే!"

"యిప్పుడేంలేదు."

"ఊఁ– లేదు, లేదు?" చుట్టూ చూశాడు. పసిపిల్లవాడికింద గుడ్డముక్క కనిపించింది. మెరుపులా ముందుకువంగి, పిల్లవాడిని పక్కకుపెత్తిగించి, గుడ్డలాక్కొని పారిపోయాడు. తనకువచ్చినకష్టాలన్నింటికీ తల్లే కారణమని అతనినమ్మకం. పిల్లవాడిని లేపి, గుడ్డగుంజుకుపోవడంవల్ల మనసుభారంతీరింది.

పిచ్చిసంతృప్తితో స్వామినాథన్ బల్ల పక్కకువంచి, దానిమీదివస్తువులన్నింటినీ నేలమీదకు జారవిడిచాడు. మళ్ళీ ఒకొక్కటి తీసి, బల్లమీద వరసాగ్గా పెట్టాడు. ఇదంతా కని పెట్టిచూస్తున్న తండ్రి "యిలాగేనా పెట్టుకోవడం? తేలిక వస్తువులన్నీ కిందా, బరువువస్తువులన్నీ పైనా పెట్టావు. ఆ నోటుపుస్తకాలు తీసేయ్. అట్లాసు అడుగున పెట్టు." చంటి పిల్లవాడినిఎత్తుకుని తల్లి వచ్చింది. "వాణ్ణిచూడండి, చంటిపిల్ల వాడికిందిగుడ్డ తీసుకు చక్కావచ్చాడు. వాడిని అదుపులో పెట్టే వాళ్ళెవరూ యింటోలేరు. యింకా శెలవులు యెన్నాళ్ళో!"

స్వామినాథన్ మహా ఆసక్తితో తనపని చూసుకుంటున్నాడు. తండ్రి తల్లిమాటలు వినిపించుకోలేదు. నిద్రపోతున్న పసిపిల్లవాడిబుగ్గలు గిల్లాడు. దానిమీద ఆమెకు కష్టంవేసి, బయటకు వెళ్ళిపోయింది.

అరగంటతరవాత స్వామినాథన్ వాళ్ళనాన్నగదిలో కుర్చీమీద పలక బలపం పుచ్చుకుని కూచున్నాడు. తండ్రి



స్వామినాథన్ మహాఆసక్తితో తనపనిచూసుకుంటున్నాడు. లెక్కలపుస్తకం తెరిచి లెక్కచెప్పాడు. "రాముడి దగ్గిర పది మామిడికాయలు వున్నాయి. వాటిమీద 15 అణాలు సంపాదించ దలిచాడు. కృష్ణుడికి నాలుగు మామిడికాయలుకావాలి. అయితే కృష్ణుడు ఎంత యిచ్చుకోవాలి?" అదీ లెక్క.

స్వామినాథన్ ఆ లెక్కవంక అదేపనిగా తేరిపార జూశాడు. చదివిన ప్రతితడవా కొత్త అర్థం తోస్తోంది. ఏదో

భయంకరమయిన ఊబిలో చిక్కుకున్నట్లు అనిపించింది.

మామిడికాయలు తలుచుకోగానే నోరుఊరింది. పది మామిడికాయలఖరీదు పదిహేను అణాలు రామూ యెలా పెట్టాడు? రామూ ఎటువంటివాడు? శంకర్‌వంటివాడు కావచ్చు. ఏమయినా సరే, పది మామిడికాయలకి పదిహేను అణాలు రావలసిందే అని పట్టుపట్టాడంటే తప్పకుండా శంకర్ వంటివాడు అయివుంటాడు. రామూ శంకర్‌లాగా ఉంటే, కృష్ణ బటాణీగింజలాంటివాడు. ఎందుకో కృష్ణ అంటే స్వామినాథన్‌కి జాలివేసింది.

"లెక్క చేశావా?" అని తండ్రి అడిగాడు చదువుతున్న వార్తాపత్రికమీదుగా చూస్తూ.

"నాన్నా, కాయలు పచ్చివా పండువా?"

తండ్రి ఒక్క క్షణం కొడుకుకేసి నిదానించి చూసి, చిరునవ్వు నవ్వి "ముందు లెక్కచెయ్యి, ఆ తరవాత కాయలు పచ్చివో పండువో చెపుతా."

స్వామినాథన్ ఇక ఏమాత్రం లాభం లేదనుకున్నాడు. రాము పచ్చికాయలు అమ్మజూపాడో, పండువో నాన్న చెపితే ఎంతబాగుండును! తరవాత చెపితే ఆయనకేం ఊడిపడుతుంది? ఈ ప్రశ్నకు జవాబుమీదనే ఆ లెక్క చేసే పద్ధతి ఆధారపడి ఉందని స్వామినాథన్ గట్టిగా నమ్మాడు. పది పచ్చికాయల ఖరీదు పదిహేను అణాలా? తప్పు తప్పు! అలా అమ్మినా రామూ స్వభావానికి అదేం విరుద్ధంకాదు. స్వామినాథన్ రామూని మెల్లిగా అసహ్యించుకోసాగాడు. చెడుగుణాలన్నీ అతనికి అంటగట్టసాగాడు.

"నాన్నా! యీలెక్క నాచేతకావడంలేదు" అన్నాడు స్వామినాథన్ పలక పక్కకు నెట్టుతూ.

"యేమిటీ! యీమాత్రం తేలికలెక్క కూడా చెయ్యలేవా?"

"బళ్ళో యిలాంటిలెక్కలు చెప్పలేదు."

"పలక యిలా తీసుకురా. నేను చేయిస్తానుగా"

స్వామినాథన్ ఏం అద్భుతంజరుగుతుందో చూడాలనిఆసక్తితో కాచుకుకూర్చున్నాడు. తండ్రి లెక్కను ఒక్కక్షణం పాటుచూసి, "పదిమామిడికాయలఖరీదెంత?" అన్నాడు.

ఈప్రశ్నకు జవాబు లెక్కలో ఎక్కడఉందో అని లెక్కంతా వెతికాడు. "నాకు తెలీదు."

"నువు కాస్తాకూస్తా తెలివితక్కువవాడివి కానట్టున్నావే! యిపుడు లెక్క చదువు. పదిమామిడికాయలకు యెంత రావాలని రామూ అనుకున్నాడు?"

"పదిహేనుఅణాలు" అనుకున్నాడు స్వామినాథన్. కాని దానిఖరీదు అంతేనని ఎలా? పేరాశకొద్దీ రామూ అంత సంపాదించాలని అనుకోవచ్చు. అయితే అది సరయినధరేనా? మామిడికాయలు పచ్చివా పండువా అనేది తేలనేలేదు. ఈవిషయంలో ఇంకా కొంత తెలిస్తేనా!

"మామిడికాయలకు రామూ యెంత రావాలనుకుంటున్నాడు?"

"పదిహేనుఅణాలు"అని చెప్పాడు స్వామినాథన్. కాని ఆ మాటలో అతనికి నమ్మకంలేదు.

"సరే. కృష్ణకు యెన్నిమామిడికాయలు కావాలి?"



చేతితో స్వామినాథన్ చెవి పట్టుకొని మెలిపెట్టాడు.

“నాలుగు”

“నాలుగుకాయల ఖరీదెంత ?”

కొడుకును హింసించడం తండ్రికి సరదాగా ఉన్నట్టుంది. అతని కెలా తెలుస్తుంది? ఆ పిచ్చి వేధన కృష్ణ యెంత ఇన్వా దలచాడో ఎలా తెలుస్తుంది.?

"చూడు బాబూ! నిన్ను చితకతన్నాలని అనిపిస్తోంది. నీదేం మట్టిబుర్ర? పదిమామిడికాయలఖరీదు పదిహేనణాలు. ఒకమామిడికాయఖరీదెంత? ఊఁ-చెప్పు. చెప్పకపోతే-" చేతితో స్వామినాథన్ చెవి పట్టుకుని, మెల్లిగా మెలిపెట్టాడు. కూడాలో తీసివేయాలో హెచ్చించాలో భాగించాలో స్వామినాథన్‌కు తెలియలేదు. అందుకని నోరుమెదపలేదు. తటపటాయించినకొద్దీ చెవి మెలితిరగడం ఎక్కువయింది. మండిపడుతూ తండ్రి జవాబుకోసం కాచుకునిఉంటే, కీచుగుని కొడుకుఏడుపు వినిపించింది "పదిమామిడికాయలఖరీదు పది హేనుఅణాలయితే ఒకమామిడికాయఖరీదు యెంతో చెప్పే దాకా నిన్నువదలను." ఏమిటి తండ్రిగొడవ! స్వామినాథన్ కళ్ళునిమరకరిస్తూ కూర్చున్నాడు. దానిఖరీదు తెలుసుకోవలసి నంతతొందరేమొచ్చింది? ఏమయినా, తనను పీడించడంకంటె, స్వయంగా బజారువెళ్ళి కనుక్కోరాదూ? రామూ కృష్ణల బేసిసంఖ్యా మామిడికాయలతో చిల్లరడబ్బులతో ఎడతెగని బేరం అతనికి విసుగెత్తింది.

తండ్రి ఇక చెప్పించలేనని నిశ్చయించుకుని, "ఒక మామిడికాయఖరీదు: 15 బై 10. సూక్ష్మీకరించు." అన్నాడు.

లెక్కలలో విపరీతమయిన తలనొప్పి కలిగించే భిన్నాంకాలకు తండ్రి తీసుకువెళుతున్నాడు. "పలక యిలా యియ్యి చేస్తాను" పదిహేను నిమిషాలతరవాత "ఒక మామిడికాయ

ఖరీదు మూడు పై రెండణాలు". తప్పు అని తండ్రి అంటాడని ఆశించాడు. కాని, తండ్రి అన్నాడు: "సరే, యింకా సూక్ష్మీకరించు." ఆ తరువాత నల్లేరుమీదబండి! అరగంటసేపు తంటాలుపడి "కృష్ణ ఆరుఅణాలు యివ్వాలి" అని కన్నీళ్ళు పెట్టాడు

# III

సాయంకాలం అయిదుగంటలకు క్లబ్బుకు వెళ్ళబోతూ, మధ్యాహ్నం అంతా స్వామిని ఎందుకు తిప్పలుపెట్టానా అని తండ్రి విచారించసాగాడు. "నాతో క్లబ్బుకువస్తావా బాబూ!" అని అడిగాడు; బిక్కమొగం వేసుకుని స్తంభంచాటున నక్కిన స్వామినాథన్ కంటపడగానే. స్వామినాథన్ నోటితో జవాబు చెప్పకుండా ఒకనిమిషం కనిపించకుండా వెళ్ళికోటుతొడుక్కొని టోపీపెట్టుకుని చక్కావచ్చాడు. తండ్రి కిందనుంచి పైదాకా పరీక్షగా చూసి "యింకా కాస్త శుభ్రమయినబట్టలు వేసుకోకూడదూ?" అన్నాడు. స్వామినాథన్ మొహం అసహ్యంగా ముడుచుకున్నాడు.

"లక్ష్మీ!" అని పిలిచి ఆమె (స్వామితల్లి) రాగానే "పెట్టెలో పిల్లవాడిబట్టలు మంచివి వుండాలి. శుభ్రమయినవి తీసియ్యి" అన్నాడు.

"పోనిద్దురూ. యిపుడు బాగానే వున్నాడు. యిపుడు పెట్టె యెవరు తెరుస్తారూ? తాళంచేతులు యెక్కడున్నాయో! ...పిల్లాడికి పాలుకలుపుతున్నాను–" అంది తల్లి.

"వాడిబట్టలన్నీ యేమయినాయి?"

"యెక్కడున్నాయి? కిందటి వేసంకాలంలో కుట్టిస్తిరి. మళ్ళీ జానెడుగుడ్డ కొన్నపాపానపోయారా!"

"యేమిటీ? రెండుమూడు నెలలకింద కొన్న ఆ ట్వీల్లు గుడ్డంతా యేమయింది?" అని ఏదో ఒకటి అడగాలని అడిగాడు. అలా అడుగుతూనే పిల్లవాడిని బుధవారంసాయంత్రం దర్జీవాడిదగ్గిరకు తీసుకువెళ్ళాలని మనసులో గుర్తుపెట్టుకున్నాడు. వేరేబట్టలు తెచ్చిఇవ్వడానికి తల్లి ససేమిరా వెళ్ళననడం స్వామినాధన్‌కు బరువుదించినట్టయింది. వేరేబట్టలు వేసుకోడానికి లోపలకువెళితే తనను దిగవిడిచి తండ్రి ఎక్కడ క్లబ్బుకువెళ్ళిపోతాడో అని స్వామినాధన్‌భయం.

ఇంటిముందుకు బయ్‌మంటూ వచ్చి, ఒకకారు ఆగింది. తండ్రి బల్లమీంది టెన్నిస్‌రాకెట్టు చప్పున తీసుకుని బయటికి పరుగెత్తాడు. స్వామినాధన్ తండ్రివెనకాలే వెళ్ళాడు. స్వామినాధన్‌కు నచ్చిన బ్లౌజరుచొక్కా తొడుగుకుని కారులోపలి చక్రందగ్గర కూర్చున్న ఒక పెద్దమనిషి "నమస్తే"అన్నాడు పండ్లికిలిస్తూ. ఆ పెద్దమనిషి తనను కారులో తీసుకువెళ్ళనంటాడేమోనని మొదట్లో స్వామినాధన్ భయపడ్డాడు. కాని ఆయన మంచిగా "హల్లో శ్రీనివాసన్! నీకొడుకునుకూడా క్లబ్బుకుతీసుకువస్తున్నావా? సరే, మంచిది"అన్నాడు. దాంతో స్వామినాధన్‌భయం మాయమయింది. స్వామినాధన్ వెనక సీటులో కూర్చున్నాడు. తండ్రి, ఆయనస్నేహితుడు ముందు సీటులో కూర్చున్నారు.

కారు బొయ్‌మని సాగిపోతోంది. స్వామినాధన్ ఉత్సాహానికి అంతులేదు. అపుడు తనస్నేహితులుచూస్తే ఎంత బాగుండునూ అనిపించింది. కారు గేటులోపలికివెళ్ళి ఆగింది.

తండ్రి టెన్నిసుఆడడం స్వామినాథన్ జాగ్రతగా కనిపెట్టిచూశాడు. నయసగాఉన్న మూడు టెన్నిసుకోర్టులలో ఆడుతున్నవారందరిలోకి తనతండ్రే బాగా ఆడుతున్నాడని నిశ్చయించుకున్నాడు. తండ్రి బంతినికొట్టినపుడల్లా ఎదుటి వారు దానిని తిరిగి కొట్టలేకపోతున్నారు. బంతివెళ్ళి వలకు తగులుతోంది. బంతితోసేవాడిజీవితం ప్రమాదంతో కూడుకు న్నదని కనుగొన్నాడు.

స్వామినాథన్ మహా హుషారుగా ఉన్నాడు. తనను అక్కడకు రానిచ్చి ఆట చూడనివ్వటం ఘనంగా భావించాడు. రేపు స్నేహితులకు చెప్పడానికి కావలసినంత. మెల్లిగా వెళ్ళి వలదగ్గిర తండ్రివెనక నిలబడ్డాడు. అక్కడికివెళ్లి నిలబడేముందు కాకీదుస్తులు వేసుకొని బంతితీసి ఆటగాళ్ళకు అందిస్తున్న కుర్ర వాడు అభ్యంతరంపెడతాడేమోనని అనుమానించాడు. కాని ఆ కుర్రవాడు బంతినితీసి ఆటగాళ్ళకు విసరివేయడంలో మునిగి పోయి ఉన్నాడు. స్వామినాథన్ అక్కడ పదినిమిషాలసేపు అలా నిలబడ్డాడు. వెనకనుంచి తండ్రిఆట స్పష్టంగా కనిపి స్తోంది. రాకెట్టుతో బంతిని కొట్టేటపుడు పుట్టే టంకారం స్వామినాథన్ చెవులకు ఇంపుగా ఉంది.

దృష్టిమళ్ళించి కాకీదుస్తుల కుర్రవాడిని చూస్తూ నిల బడ్డాడు. చూసినకొద్దీ మొహంలో మార్పు రాసాగింది. తన కళ్ళను తానే నమ్మలేకపోతున్నట్టు మిణకరించాడు. కాకీదు స్తులు వేసుకుంటే ఎవరోలాగా ఉన్నాడుగాని, ఆ కుర్రవాడు మరెవరోకాదు, బండివాడి కొడుకు. ఆ కుర్రవాడూ వెనకకు

తిరిగి అతనిని చూశాడు. ద్వేషంతో పండ్లు కొరికించి జేబులో నుంచి చాకుతీసి పైకెత్తాడు. ఇంకేముంది? స్వామినాథన్‌కు భయంపట్టుకుంది. తొందర తొందరగా వెనకటి స్థలానికి వెళ్ళి నిలబడ్డాడు. ఇక విరోధి అతనినేమీ చేయలేడు.

ఆట అయిపోగానే తండ్రి క్లబ్బుభవనంలోకి బయలు దేరాడు. ఏ నిమిషాన్నయినా వెనకనుంచి కత్తిపోటువచ్చి పడు తుందనే భయంతో స్వామినాథన్ తండ్రిముందు నడవసాగాడు.

"స్వామి! ముందునడవకు, నా కాళ్ళకు అడ్డుపడు తున్నావు" అన్నాడు తండ్రి. ఇష్టంలేకపోయినా తండ్రిమాట పాటించాడు. వెళుతూ నంగి సూదిలాంటి రాయిముక్క ఏరి, అవసరమయితే ఉపయోగించడానికి సిద్ధంగా పట్టుకున్నాడు. టెన్నిసుకోర్టునుంచి క్లబ్బుభవనానికి సుమారు పన్నెండు గజాలు. కాని అవి మైలున్నర అనిపించింది స్వామికి.

చీట్ల పేకగదిలో తండ్రిపక్కన కుర్చీలోకూర్చుని ఇక పరవాలేదనుకున్నాడు. గదినిండా దట్టంగా పొగమబ్బులు అలుముకున్నాయి. తండ్రి అమితోత్సాహంతో పేక కలిపి పంచుతున్నాడు. ఇంతకంటె భద్రమయినచోటుఉండదు. తండ్రి ఆయన స్నేహితులు అక్కడ బోలెడుమంది ఉన్నారు. బండి వాడికొడుకుని ఒక చెయ్యిచూడనీ, ఏం జరుగుతుందో! కొంచెంసేపయిన తరవాత స్వామినాథన్ కిటికీలోనుంచి బయ టికి చూశాడు. నక్షత్రాలు కనిపించేసరికి తత్తరపడ్డాడు. చీట్ల పేకఆట పూర్తయి ఇంటికి బయలుదేరేసరికి బాగా చీకటి పడుతుంది.

ఒకగంటతరవాత తండ్రి బల్ల దగ్గరనుంచి లేచాడు క్లబ్బు

భవనం ఆఖరిమెట్లు దిగుతూంటే, ఒళ్ళు తెలియని భయం వేసింది. చుట్టూ చీకటి! ఏమూలనుంచి ఏమిప్రమాదం వచ్చిపడుతుందో! తండ్రి ఆయనస్నేహితుడూమధ్య ఉన్నాడు. పరవాలేదు. ఈ ఆలోచన ఉత్సాహాన్నిచ్చింది. చీట్లపేకగదిలో ఉన్నవారంతా కూడా వచ్చి కారులో కూర్చొబెడితే బాగుండేదే అను కున్నాడు స్వామినాథన్. ఎంతమంది చుట్టూఉంటే అంత మంచిది. బహుశా ఈపాటికి ఆ కుర్రవాడు బయటికి వెళ్ళి ఖూనీ కోరుజట్టును వెంటబెట్టుకునివచ్చి కాచుకుని ఉండవచ్చు. తండ్రికాళ్ళకు అడ్డంపడతానేమోననే అనుమానంతోనేగాక కారుదగ్గిరికి దోవ తెలియక ముందు నడవడం మానుకున్నాడు. తండ్రివెనకనడవడం అసలు పనికిరాలేదు. అలా అయితే అసలు కారుదగ్గిరికి జేరుకోడేమో! ఒకేసారి ముందు వెనక చూడ డానికి అనువుగా ప్రక్కనడకప్రారంభించాడు. ఆ దూరానికి అంతూపొంతూ కనిపించలేదు. రానున్న అపాయం విప్పిచెప్పి రక్షణకోరదామనుకున్నాడు.

"నాన్నా !"

"యేవిఁటి, బాబూ !"

పరిస్థితి ఎంతప్రమాదంగాఉన్నా బండివాడికొడుకుసంగతి తండ్రికి చెప్పకూడదని స్వామినాథన్ నిశ్చయించుకున్నాడు.

"యేంకావాలి బాబూ !" అని తండ్రి మళ్ళీ అడిగాడు.

"నాన్నా ! యింటికేనా ?"

"ఆఁ"

"నడిచేనా ?"

"అబ్బే ! అదిగో గేటుదగ్గిర కారు."

కారుదగ్గిరికి వెళ్ళగానే స్వామినాథన్ ముందుగాఎక్కి వెనకసీటుమధ్య కూచున్నాడు. ఇంకా అనుమానంతీరలేదు. వాళ్ళనాన్న స్నేహితుడు ఇంకా కారును బయలుదేరదీయలేదు. తండ్రికి, ఆయనస్నేహితుడికి చాలాదూరంలో వెనకసీటులో ఒంటరిగా కూర్చున్నాడు ఇప్పటికీ బండివాడికొడుకు వాడిజట్టు అతనిని తేలికగా బయటకులాగి అంతంచేయవచ్చు.

కారు బయలుదేరింది. దాని ఇంజను చప్పుడుకాగానే స్వామినాథన్ చెవులకు అది రాక్షసుడిగొంతుల్లా వినిపించింది. కారు గేటుదాటింది. వేగం పుంజుకుంది స్వామినాథన్ ధోవతి అంచు పైకెత్తి నుదురుతుడుచుకున్నాడు.

## పన్నెండో ప్రకరణం

బొంబాయిలోని ప్రముఖ రాజకీయకార్యకర్త గౌరీశంకర్ అరెస్టుకు నిరసనతెలిపేందుకుగాను మాల్గుడిపౌరులు రెండువేల మంది 1930 ఆగస్టు 30వతేదీన సరయూనదికుడిఒడ్డున సమావేశమయ్యారు. ఖద్దరుబట్టలు వేసుకున్న ఒక గంభీరమూర్తి కొయ్యవేదికమీద నిలబడి ఉపన్యాసంఇస్తున్నాడు. గౌరీశంకర్ జీవితంగురించి అతనుచేసిన ఘనకార్యాలనుగురించి గంభీరంగా గొంతెత్తి చెప్పాడు. ఆతరవాత "యివాళ మనమంతా బానిసలంగా పడివున్నాం. యింతబానిసత్వం యెన్నడూ యెరగం. మనపూర్వుల గొప్పతనాన్ని మరిచిపోయాం. రామాయణ, మహాభారతాలనాటి మనప్రతిష్ట మరిచిపోయామా? ప్రపంచానికి కాళిదాసమహాకవిని, గౌతమబుద్ధుని, శంకరాచార్యుని అర్పించింది మనదేశమే. మన నావలు మహాసముద్రాలమీద నాట్యమాడాయి. ఇంగ్లీషువాళ్ళు పచ్చిమాంసంతింటూ అడ

వులలో దిగంబరంగా తిరిగేరోజుల్లో మననాగరికత తారా పథం అందుకుంది.” కొంచెంఆగి అప్పటిఆవేశంలో తాను చెప్పబోయేదానిఅర్థం సరయిందా కాదా అని చూచుకోకుండా “మనం బానిసలకుబానిసలం!” అన్నాడు. స్వామినాథన్‌కు, మణికి దీనిఅర్థమేమిటో తెలియలేదు. కాని అయిదు నిమిషాలతర వాత ఆ ఉపన్యాసకుడు “కాస్త యోచించండి. మనం ముప్పయిఆరుకోట్లమందిమివున్నాం. మనదేశం రష్యాను మినహాయిస్తే యూరపు యెంతో అంతది. ఇంగ్లాండు మన చిన్న రాజథానికంటె పెద్దదేంకాదు. అక్కడవున్నది పదిసంది. మనకి వేలమైళ్ళదూరంలో వుంది. కాని మనం యింగ్లీషు వాడికి నంగినంగి సలాములుచేస్తున్నాం. మన తప్పేంలేదే! మనం యెందు కింత పిరికిపందలం, బానిసలం అయిపోయాం? భయపెట్టి, మాడ్చి మనల్ని యీస్థితికి తీసుకువచ్చారు. యిక మనం తలలువంచనక్కరలేదు. ప్రతి భారతీయుడు యింగ్లండుమీాద కాండ్రించివుమ్మివేస్తే ఆ వుమ్మిలో యింగ్లండు మునిగిపోతుంది”అన్నాడు.

“గాంధీకీ జయ్!”అని కేకపెట్టాడు స్వామినాథన్ అనుకోకుండా. ఉపన్యాసకుడిధోరణికి ఆవేశంవచ్చింది. మణి స్వామినాథన్‌ని ఒకపోటుపొడిచి మెల్లగా, “అరె ఫూల్! నోరుమూసుకోలేవూ?” అన్నాడు.

స్వామినాథన్ “ఆయనచెప్పేది నిజమేనా?”అన్నాడు.

“ఏది?”

“వుమ్మివేసి యింగ్లండును ముంచివేయడం”

“నిజమే అయివుంటుంది. లేకపోతే చెపుతాడా?”

"అలా యెందుకు చెయ్యకూడదు ? తేలికేగా !"

"యూరోపియన్లకు దయాదాక్షిణ్యాలు లేవు. మనల్ని కాల్చిపారేస్తారు" అన్నాడు మణి. ఈ జవాబు సంతృప్తి కలిగించింది. ఇంకో అనుమానం తీర్చుకుందామనుకుంటూ ఉండగా పక్కనకూచున్న ఒకరిద్దరు అతనిమీద పడిపడ్డారు.

ఆ సాయంత్రమంతా ఆ ఉపన్యాసకుడి ధోరణికి స్వామి ముగ్ధుడయిపోయాడు. మణీ అంతే. ఉపన్యాసకుడితోపాటు రైతు కష్టాలను తలచుకొని ఏడ్చారు. ఒకప్పుడు భారతదేశం ఢాకా మజ్లినుకి ప్రపంచఖ్యాతి నార్జించింది. ఆ మజ్లిన్ నేసే నేత కార్మికుల బొటనవేళ్ళను లాంకషైర్ మాంచెష్టర్ బట్టల మిల్లుల యజమానులు నరికివేయించారు. గాబట్టి ఇంగ్లీషు వస్తువులను ముఖ్యంగా ఆ మిల్లుబట్టలను బహిష్కరించడానికి తీర్మానించబడింది. ఏం మజ్లిన్లు ! ఏం మజ్లిన్లు ! నలభయి గజాలతాను మడిచి అగ్గిపెట్టెలో పెట్టవచ్చు ! అటువంటి నేత కార్మికుల బొటనవ్రేళ్లు నరికించినవాళ్ళకి ఎటువంటి శిక్ష వేసినా పాపంలేదు. ఇంటి దగ్గిర వడికిన ముతకఖద్దరు ధరించి, ఆ మిల్లు యజమానులను శిక్షించడానికి స్వామినాథన్ నిశ్చయించాడు. ఆ సమయంలో వేసుకునిఉన్న దుస్తులకేసి చూసుకున్నాడు. చిరాకుగా "మణి !" అని పిలిచాడు మెల్లిగా "నేను వేసుకున్న బట్టలు యెక్కడివో తెలుసా ?"

మణి స్వామి కోటు పరీక్షించి "యిది లాంకషైర్ గుడ్డ" అన్నాడు.

"నీ కెలా తెలుసు ?"

జవాబుగా మణి అతని కేసి తేరిపారజూచాడు.

"నువు వేసుకున్నది ?" అని అడిగాడు స్వామినాథన్.

"ఖద్దరు. ఆ లాంక్ షైర్ రాక్షసులసుకి ఒక్క దమ్మిడీ అయినా చెందనిస్తానా? ఉహుం— నా దగ్గిరనుంచి దమ్మిడీ అయినా పొందలేరు.'

ఈ విషయంలో స్వామినాథన్‌కు అనుమానం వేసింది. కాని మెదలకుండా ఊరుకోవడమే మంచిది అనుకున్నాడు. లాంక్ షైర్ బట్టలతో బయటికి రావడంకంటె మొండిమొలతో రావడం మేలు అని తలపోశాడు.

జనంలోనుంచి బిగ్గరగా "భరతమాతకీ జయ్ !" అని కేక వినిపించింది. తరవాత "గాంధీకి జయ్" ఆ తరవాత జాతీయగీతం విచారంగా వినిపించింది. ఆనాటి కార్యక్రమం విదేశీవస్త్రదహనంతో ఆఖరయింది. అప్పటికే చీకటిపడింది. హఠాత్తుగా ఎర్రటికాంతి చీకటిని పారదోలింది. మంట వేశారు. గాంధీటోపీలు పెట్టుకుని ఇద్దరుపిల్లలు విదేశీవస్త్రాలు తగలబెట్టమని వేడుకుంటూ తిరుగుతున్నారు. కోట్లు, టోపీలు, పై పంచెలు బయ్‌మంటూవచ్చి టపీమని మంటలో పడుతున్నాయి. మంట బుస్సుమంటూ పెటపెటమంటూ పైకిలేచింది. పొగ, బట్టలు కాలుతున్న వాసన గుప్పుమంది. ఆ ఎర్రటి కాంతిలో జనం మసకమసక నీడల్లా కదులుతున్నారు. ఇదంతా చూస్తూంటే స్వామికి సంతోషంతో ఒళ్లు తెలియడంలేదు. ఎవరో అన్నారు "మనదేశం శాశ్వతంగా బానిసత్వంలో పడి వుండాలని వుందా ?"

"ఉహుం—" అన్నాడు స్వామినాథన్.

"కాని నువు విదేశీ టోపీ పెట్టుకున్నావు ?"

స్వామినాథన్ సిగ్గుతో వణికిపోయాడు. "యేమిటో చూసుకోలేదు" అంటూ టోపీతీసి మంటలోకి గిరాటు వేశాడు, తాను దేశాన్ని కాపాడుతున్నాననే భావంతో.

## II

మర్నాటి ఉదయాన్నే స్వామినాథన్ నిద్రమేలుకుని పక్కకు కొద్దిగజాలదూరంలోకి వచ్చిపడుతున్న సూర్యకిరణాలను చూస్తూ పండుకున్నాడు. ఏదో తెలియనిబాధ మనసులో కలిగింది. అది బడికిసంబంధించినదయిఉంటుంది. హోం వర్కా? ఊహుఁ కాదు. దుస్తులకు సంబంధించింది. వస్త్రదహనం—విదేశీ వస్త్రదహనం! అవును. కిందటి సాయంకాలం దేశభక్తి ఎక్కువయి, టోపీ మంటలోపడవేసిన సంగతి జ్ఞాపకంవచ్చింది. తండ్రికి ఈ సంగతి తెలియదు.

ఇవాళ బడికి ఏమి పెట్టుకు వెళ్ళాలి? ఈ సంగతి చెప్పి కొత్తటోపీ కొనిపెట్టమనడం మంచిదికాదు. కాని బడికి టోపీ లేకుండా వెళ్ళడం ఎలా?

టోపీ పెట్టుకోకుండా కోటుమాత్రం తొడుగుకొని 'ఎలా రాసిపెడితే అలా జరుగుతుంది' అనే ధోరణిలో బడికి బయలుదేరాడు. బడికి చేరుకునేసరికి భగవంతుడు తన మీద దయతలచినట్టు కనిపించింది. బడిముందు రోడ్డుమీద చిందర వందరగా గుమిగూడి ఉన్నారు బడిపిల్లలు.

స్వామినాథన్ ఎవరిదృష్టిలోనూ పడకుండా బడిగేటు దగ్గిరికి చేరుకున్నాడు. మూడోఫారం విద్యార్థి ఎవరో ఒకడు స్వామినాథన్‌ను ఆపి, "యెక్కడికి వెళుతున్నావు?" అని ప్రశ్నించాడు. ఈ ప్రశ్నలో ఏదయినా మోసముందేమోనని

ఒక క్షణం తటపటాయించి "యెక్కడికేమిటి?...బడికి..." అన్నాడు.

"యినాళ బడిలేదు" అని నొక్కినొక్కి చెప్పాడు ఆ కొత్తకుర్రవాడు. ఆవేశంతో ఇంకా అన్నాడు "మన మాతృ దేశపు రత్నాన్ని జైలుకు పంపారు."

"అలా అయితే నేను బడికి వెళ్ళను" అన్నాడుస్వామినాథన్. అప్రయత్నంగా టోపీ సమస్య తీరిపోవడంతో బరువు దించినట్లయింది.

హెడ్డుమాస్టరు, తతిమ్మామాస్టర్లు బడిముందు వరండాలో నిలబడి ఉన్నారు. హెడ్డుమాస్టరు ఆదుర్దాతో నలిగి పోతున్నాడు. ఎబెనెజార్ పేంబెత్తం పట్టుకుని పచార్లు చేస్తున్నాడు. హిస్టరీమాస్టరు డి. పిళ్ళై అంటకత్తిరించుకున్న మీసాలు మహా ఆందోళనతో కొరుకుతూ పిల్లలకు కనిపించాడు. రోడ్డుమీాది జనంగోల ఎక్కువయింది. బడి బావురుమంటోంది. పదికి ఐదునిమిషాలు ఉండనగా మొదటిగంట మోగింది. గేటుదగ్గిరివారికితప్ప ఇంకెవరికీ గంట వినిపించలేదు. మాస్టర్లు సంప్రదించుకుంటున్నారు. హెడ్డుమాస్టరు గడియారం పైకి తీశాడు. చేతులు వణికాయి. టైంచూసి రెండోగంటకొట్టమని ఆజ్ఞాపించాడు. పూర్వం ఖంగునమోగే గంట ఇపుడు దీనంగా మోగింది. హెడ్డుమాస్టరు, తతిమ్మామాస్టర్లు గేటువేపు బయలుదేరారు. జనంసర్దు అణిగింది.

హెడ్డుమాస్టరు గొడవచేయకుండా క్లాసుల్లోకి వెళ్ళమని పిల్లలను వేడుకున్నాడు. కాని పిల్లలు లొంగలేదు. డి. పిళ్ళైతోసహా మాస్టర్లంతా చెప్పిచూశారు. కాని లాభం

లేకపోయింది. శిక్ష తీవ్రంగాఉంటుందని హెచ్చరించి, హెడ్డు మాస్టరు వెళ్ళిపోయాడు. "భారతమాతకీ జయ్!" "గాంధీకీ జయ్!" "గౌరీశంకర్‌కీ జయ్" అని కేకలు మిన్నుముట్టాయి.

ఎవరికీ తెలియకుండా బడిపిల్లలగుంపులోకి ఇతరులు కూడా వచ్చిచేరారు. గాంధీకీ జయ్'అనే కేకలలో పెద్ద వాళ్ళగొంతులుకూడా వినిపించాయి.

అరడజనుమంది తమంతతామే నాయకులుగా వ్యవహరిస్తూ "జ్ఞాపకంవుంచుకోండి. యివాళ హర్తాళ్, విచారదినం. విచారంగా మౌనంగా గడపండి" అని చెపుతూ అటూఇటూ పరుగెత్తసాగారు.

ఆ జనంలో స్వామినాథన్‌ను ఎవరూ గమనించలేదు. ఇలానే ఎవరిదృష్టికీ నూపడని ఇంకొకకుర్రవాడు చిన్నచిన్న రాళ్ళు గుట్టగా పేర్చి బడిభవనంముందుభాగంలోని అద్దాలకు సూటిగా రాళ్లువేసి కొడుతున్నాడు. స్వామినాథన్ ఆ కుర్రవానిని అనుకరించకుండా ఉండలేకపోయాడు. గుప్పిటనిండా రాళ్ళుతీసుకుని, బడిభవనం పరీక్షగా చూశాడు. నూటికి డెబ్బయివంతులఅద్దాలు అప్పటికే పగిలిఉండడం అతనికి ఆశాభంగం కలిగించింది.

హెడ్డుమాస్టరుగదిలో చిన్నచిన్న సలుచదరపుఅద్దాల వెంటిలేటరు చెక్కుచెదరకుండాఉండడం చూసి స్వామినాథన్ సంతోషంతో పిచ్చికేకపెట్టాడు. దానిమీదికి రాయివిసిరి అద్దాలు పగిలిన పటపటశబ్దం వినడానికి చెవులు దోరబుచేసుకుని నిలబడ్డాడు. ఒకసెకనుకూడా గడవకముందే అద్దాలుపగిలి భళ్ళున కిందపడ్డాయి. బలే తమాషాగాఉంది!

ఒక పొట్టిమనిషి పరుగెత్తుకుంటూ వచ్చి "బోర్డుహైస్కూలులో క్లాసులు నడుస్తున్నాయి" అన్నాడు ఆవేశంతో.

ఈ ఘోరవార్త విని జనంలో కదలికకలిగింది. మార్కెట్టురోడ్డుచిట్టచివరఉన్న బోర్డుహైస్కూలు వేపు కదలసాగారు.

జనం బోర్డుహైస్కూలుకు చేరుకోగానే తమంతతాము నాయకులుగా వ్యవహరిస్తున్నవారు చేతులుపైకెత్తి గోలచేయకుండా బయటఉండవలసిందని జనాన్ని వేడుకున్నారు. పదిహేను నిమిషాల్లో ఇద్దరిద్దరు ముగ్గురుముగ్గురు చొప్పున జనం స్కూలుహాలులో ప్రవేశించారు.

ఆ జనంలో ఒకవ్యక్తి అందరితరఫునా "అయ్యా! అల్లరిచేయాలని మే మిక్కడికి రాలేదు. బడి మూసేయండి, చాలు. మూసేయకతప్పదు. మన నాయకుని జైలులో పెట్టారు. మన మాతృదేశం యుద్ధజ్వాలల్లో చిక్కుకుంది."

గుడ్లగూబలాంటి హెడ్మాస్టరు "యెవరిఅనుమతి పుచ్చుకుని బళ్ళోకి అడుగుపెట్టారు? దయచేసి వెళ్ళిపొండి లేకపోతే పోలీసులను పిలిపిస్తాను."

ఈమాటలకు జనంలోనుంచి కేకలు, పెడబొబ్బలు వేళాకోళాలు, లేవిడీలు బయలుదేరాయి. ఆతరవాత బల్లలు తలకిందులుచేసి, విరగగొట్టారు. కిటికీఅద్దాలు ముక్కలు చేశారు. బోర్డుస్కూలుపిల్లలు చాలామంది వచ్చి ఈ జనంలో కలిశారు. ఇష్టంలేనివాళ్లు దూరంగా నిలబడ్డారు. పిలిస్తే రాకపోయేసరికి వారిని బయటికి ఈడ్చుకువెళ్ళారు.

వీటన్నింటిలో స్వామినాథన్‌చేసినపని తీసిపారేసేదేమీ గాదు. హెడ్మాష్టరు పోలీసుల్ని పిలిపిస్తానన్నపుడు "పోలీ

సుల మొహంమీద వుమ్మేస్తాం" అన్నది స్వామినాథనే. కాని ఆ గోలలో అతనిమాటలు వినిపించలేదు. పోలీసులమాటవచ్చే సరికి అతనిరక్తం ఉడుకెత్తింది. లాంక్ షైరుకు చెందిన బూటన వేళ్ళ్ళనరుకుడుగాళ్ళఏజెంట్లు పోలీసులు; వాళ్ళని పిలిపించడం కంటె సిగ్గుచేటు ఇంకొకటుందా? గందరగోళం బయలుదేర గానే సామాను నాశనంచేయడంలో స్వామినాథన్ ఎవరికీ తీసిపోలేదు. ఇంకా చాలా అద్దాలు పగలకుండాఉండడం చూసేసరికి అతనిసంతోషానికి అంతులేదు. అద్దాలు పగుల గొట్టాలనేకోరిక అతని స్వాంతబడిలో పూర్తిగా తీరలేదు. అటూఇటూ పరుగెత్తి సిరాబుడ్లు పోగుచేసి ఒక్కొక్కటే కంటబడ్డదానికల్లా వేసికొట్టాడు. బోర్డుస్కూలుపిల్లలు తనం తపెద్దవాళ్లు. వాళ్ళని బయటకులాక్కొని వెళ్లేపని తనవల్ల గాదు. ఇంతలో ఒక ఆలోచన తళుక్కుమంది. ఇన్ఫెంటు క్లాసు పిల్లలకోసం జనంలోపడ్డాడు. చిన్నచిన్న పిల్లలు ఒక చోటచేరి భయంతో వణికిపోతూండడం చూశాడు. జనంలోకి ఉరుక్కుంటూవచ్చేసరికి పిల్లలు పరుగుతూలేస్తూ చెల్లాచెద రయారు. ఒక దురదృష్టపుపిల్లవాడు స్వామినాథన్దృష్టిలో ప్రత్యేకంగా పడ్డాడు. స్వామినాథన్ వాడిమీదపడి, టోపీ లాగి, కిందపారేసి తొక్కుతూ తిట్టసాగాడు. ఆ పిల్లవాడిని లాగి అటూఇటూ తోసి తలమీద మొట్టి వాడిఖర్మానికి వాడిని వదిలివేశాడు.

బోర్డుహైస్కూలులో క్లాసులు నడవకుండా ఆపుజేసి జనం ఊరేగింపుగా మార్కెట్టురోడ్డువెంట బయలుదేరారు. వందలకొలది గొంతులు వందలకొలది స్థాయీలలో, పాడే

పాటలు, చేసేనినాదాలు మారుమోగాయి. ఆఖరివరసలలో కొత్తమనుషులమధ్య స్వామినాథన్ ఇరుక్కుపోయాడు. మార్కెట్టురోడ్డుమీద చెట్లు లేవు. ఎండకు కళ్లు జిగేలుమం టున్నాయి. ఊరేగింపువల్ల లేచిన తెల్లటిదుమ్ము గాలిలో తెల్లటిమంచులా వేలాడుతూ ఉక్కిరిబిక్కిరిచేస్తోంది. నడుస్తున్న వీపులు బుజాలు, మధ్యమధ్య ఇంటిభాగాలు తప్ప మరేం కనిపించడంలేదు. అరిచీఅరిచీ గొంతు ఎండిపోయింది. ఆకలి వేస్తోంది. మెల్లగా ఇంటికి జారుకుందామ౯ అని ఆలోచిస్తుం డగా ఊరేగింపు హఠాత్తుగా ఆగిపోయింది. నిమిషంలో వెనక వారు సంగతేమిటో తెలుసుకుందామని ముందుకు తోసుకు వెళ్ళారు.

గుంపు మార్కెట్టురోడ్డుమధ్య చౌకులోని ఫౌంటెన్ ముందుకు చేరుకుంది. ఫౌంటెన్‌కు అవతలి వేపున యాభైమంది పోలీసులు లాఠీలు పుచ్చుకుని సిద్ధంగాఉన్నారు. వారిలో పన్నెండుమంది ఊరేగింపును అటకాయించారు. ఒక భారీ మనిషి చేతితో పేంబెత్తంపట్టుకుని బెల్టుకు రివాల్వర్ వేలాడవేసు కుని ఊరేగింపు వేపుకు వచ్చాడు. ఆయనగారి తోలువార్లు, పట కాలు, ధగధగామెరిసే బూట్లు, నిక్కరు స్వామినాథన్ కంటికి ముచ్చటగొలిపాయి. తలతిప్పిచూశాడు. ఆ వ్యక్తి మరెవరో కాదు, రాజంతండ్రి! అతను రాజంతండ్రి అయినందుకు స్వామి నాథన్ విచారించాడు. ఆ దేశద్రోహులకు రాజంతండ్రి నాయకుడా! డిప్యూటీ పోలీసుసూపరింటెండెంటు చేతిగడి యారంమీద దృష్టినిలిపి 'యిక్కడ గుమిగూడడం చట్టవ్యతి రేకమని ప్రకటిస్తున్నాను. అయిదునిమిషాలు వ్యవధియిస్తున్నా.

యెక్కడివాళ్లు అక్కడకు వెళ్ళిపోండి" అన్నాడు. అయిదు నిమిషాలతరవాత తలఎత్తిచూసి బొంగురుగొంతుతో "లాఠీ చార్జి" అన్నాడు.

గందరగోళం బయలుదేరింది. అంతలో స్వామినాథన్‌ని తొక్కిపారేశారు. పోలీసులు జనంలోకి దూసుకువెళ్ళి ప్రతి వాడ్దిని తోసికొట్టారు. కొంతమంది హడలిపోయి పారిపోతూంటే



"ఏం జేయడంలేదూ, అల్లరి తిమ్మన్నా!"

వాళ్ళల్లో కలిశాడు స్వామినాథన్. లాఠీలు పైకెత్తి పోలీసులు వాళ్ళవేపు వచ్చారు. "నన్ను చంపకండి. నాకేం తెలీదు" అని గావుకేక పెట్టాడు. పక్కవాళ్ళవంటిమీద లాఠీలు పడుతుంటే వరసగా కుయ్యో మొర్రో అని వినిపించింది. ఒకనినుదుటిమీద రక్తం కారుతూండడం చూశాడు స్వామినాథన్. మళ్ళీ లాఠీలు విరుచుకుపడ్డాయి. ఇంకొకతను పరుగెత్తుతూ కిందపడి మూలగ సాగాడు. ఇంకొకతని వీపుమీద లాఠీలు దభీదభీమని వచ్చి పడ్డాయి.

స్వామినాథన్‌కు భయంతో తల దిమ్మెక్కిపోయింది. కాళ్ళసత్తువకొద్దీ పరుగెత్తుతున్నాడు. కాని పోలీసులు అతనిని వెంటాడుతూనే ఉన్నారు. వాళ్ళల్లో ఒకడు స్వామినాథన్‌జుట్టు పట్టుకుని ఆపి, "యిక్కడేం జేస్తున్నా ?" అని అడిగాడు.

"నాకేం తెలీదు. నన్నువదలి పెట్టండి బాబూ !" అని స్వామినాథన్ వేడుకున్నాడు.

"యేం జేయడంలేదూ ? అల్లరితిమ్మన్నా !" అన్నాడు ఆ పోలీసు. ఆ పోలీసు భయంకరంగా రాక్షసిలాగా ఉన్నాడు. దగ్గిరినుంచి చూస్తే పోలీసులు అంతా అంతేనేమో ! లాఠీ నెత్తిమీద తాకించి తన్నులుతినకముందేపారిపో అని చెప్పాడు.

## III

తండ్రిముందు ఆరోజు వృత్తాంతం ఎత్తకూడదని స్వామి మొదటె నిశ్చయించుకున్నాడు, కాని తండ్రి వచ్చీరావడంతోటే కోటయినా విప్పకుండా భార్యను పిలిచి ఆ రోజువిశేషాలు క్లుప్తంగా చెప్పాడు. మంచి ఉత్సాహంగా మాటాడాడు. "డిప్యూటీ సూపరింటెండెంటు వచ్చి కసాయివాడు." అన్నాడు

బట్టలు మార్చుకోవడానికి లోపలికి వెళుతూ. లాకెచార్జికిముందు రాజమండ్రి గడియారంచూస్తూ నిలబడడం తిరిగీ కళ్ళకుకట్టి ఆయన నిజంగా 'పచ్చికసాయి' యే అని స్వామినాథన్ అంగీకరించాడు. వాళ్ళ నాన్న హైటు ఊడదీసుకోకుండానే తిరిగివచ్చి "యాభైమందికి చాలా ప్రమాదమయిన దెబ్బలుతగిలాయి. ఆసుపత్రిలో పడేశారు. ఒకరిద్దరు చచ్చిపోయారనికూడా అంటున్నారు" అన్నాడు. స్వామినాథన్‌వంక తిరిగి "బడిపిల్లలు చాలా గొడవచేశారట. నువేంచేయలేదుగదా?" అని అడిగాడు.

"సమ్మె జరిగింది..." అని జవాబిచ్చాడు. ఈ సమయంలోనే తన టోపీ గొడవ వదిలించుకోవాలని తలచి "అబ్బ యేం గందరగోళం! ఆ గందరగోళంలో యెవరో నా నెత్తిమీది టోపీ లాగేసి ముక్కలు ముక్కలు చేశారు... రేపు బడికి వెళ్ళేవేళకి టోపీ కావాలి" అన్నాడు.

"యెవరా లాగేసింది ?"

"యెవడో తుంటరివెధవ ?"

"యెందుకు లాగేశాడు ?"

"అది విదేశీదని"

"విదేశీదని యెవరన్నారు ? రెండురూపాయలు పెట్టి ఖద్దరుస్టోర్సులో కొనుక్కువచ్చాను. అది నల్ల ఖద్దరుటోపీ. నీకు తెలుసునని యెలా అనుకున్నావ్." "నేనేం చెయ్యలేదు. టోపీలాగకుండా చెయ్యి అడ్డంపెడితే కొట్టాడు."

"వాణ్ణి ఒక్కతన్నుతో కిందపడవేయవలసింది. నీ కోసరమని టోపీ, కోటుగుడ్డ ఒకమారే కొన్నాను. గుడ్డివాళ్ళుతప్ప కళ్ళున్నవాళ్ళెవరూ అది ఖద్దరు కాదనరు."

"అది లాంగ్ షైరులో తయారయిందన్నారు.?"

"అబ్బే! వాళ్ళగొడవేదో వాళ్ళనిపడమను. అడ్డగోలు గామాటాడేవాళ్ళందరినీ నీ బట్టలుముట్టుకోనిస్తే యిక నీవంటి మీద బట్టవుండదు. నాడబ్బు ఒక్కదమ్మిడీకూడా విదేశాలకు పోనీను. యీసంగతి వాళ్ళతో చెప్పు. నా కర్తవ్యమేమిటో నాకు తెలుసు. అవసరేగాని, మీ కుర్రవాళ్ళు రాజకీయాలలో తలదూర్చకుండా వీ చదువేమిటో మీరు చూసుకోరాదూ? దేశంలో యిప్పటికే జరుగుతున్న అల్లర్లు చాలవూ. మీరూ బయలుదేరాలీ?..."

స్వామినాథన్ చాలాసేపు పక్కమీద నిద్రపోకుండా పండుకున్నాడు. గంటలుగడిచినకొద్దీ, ఇంట్లో దీపాలు ఒకటొకటీ ఆరిపోతున్నకొద్దీ ఆరోజున తగిలినదెబ్బలను బేరీజువేసుకోక తప్పిందికాదు. మోచేతులు, మోకాళ్ళగోడు. ఆరోజున మూడునాలుగుసార్లు కిందపడడం జ్ఞాపకంవచ్చింది. మొదటిసారి యెప్పుడూ—ఆ—.రాజం స్వంతకారు దిగి బడికివచ్చినప్పుడు స్వామినాథన్ దాక్కోవాలనిచూశాడు. ఆ హడావిడిలో రాళ్ళగుట్టతగిలి కిందపడ్డాడు. మోకాళ్లు బాగా కొట్టుకుపోయాయి. రెండోసారి, పోలీసులు లాఠీచార్జి చేసినప్పుడు పరుగెత్తుతూ ఒకదుకాణంముందు పడిపోయాడు. ఎవడో ఒక రాక్షసి వెధవ అతనిని తొక్కుకుంటూ వెళ్ళాడు.

ఇక ఇప్పుడు పక్కకుతిరిగేసరికి తుంటి నొప్పిపెట్టింది. తొడలకు మణుగుబరువు కట్టినట్టనిపించింది. ఆలోచించినకొద్దీ తలలో ఎడతెగనిబాధ – రాక్షసి వెధవలు! పోలీసువాడిలాంటి దెబ్బ మెత్తగావమీలేదు! పైగా 'అల్లరితిమ్మన్నా'! అం

టాడా! సరే చూద్దాం. తాను తిమ్మన్నేంకాదు ఆ పోలీసులే తిమ్మన్నల్లా ఉన్నారు. తిమ్మన్నల్లా వ్యవహరించారు.

## IV

హెడ్డుమాస్టరు క్లాసులోకి వచ్చాడు. మొహం కొద్దిగా ఎర్రబారిఉంది. చూపు క్రూరంగాఉంది. ఆ సమయంలో తానక్కడ లేకుండా ఎక్కడికయినా వెళ్ళిఉంటే బాగుండేదని అనుకున్నాడు స్వామి. హెడ్డుమాస్టరు క్లాసు పిల్లలను కొద్దినిమిషాలసేపు ఎగాదిగాచూసి "నిన్న అంతపని చేసి యివాళ చల్లగావచ్చి 'క్లాసులోకూర్చోవడానికి సిగ్గేయడంలేదూ?" ప్రత్యేకగౌరవం చూపెట్టడానికాఅన్నట్టు క్లాసులకువచ్చిన, పిల్లలపేర్లు చదివాడు. ఆతరువాత బడిఎగ కొట్టినపిల్లలపేర్లు చదివి వాళ్ళను లేచి బెంచీమీద నిలబడ మన్నాడు. ఆ శిక్షకూడా చాలదని తలచి డెస్కులమీద నిల బడమన్నాడు. బడిఎగగొట్టినవాళ్ళల్లో స్వామినాథన్ ఒకడు. అయితేమాత్రం ఇంత అవమానంచేస్తారా? హెడ్డుమాస్టరు పిల్లలకు బుద్ధిగరపడం ప్రారంభించాడు. ఆ తరువాత ఒకరొక రిని ఎందుకు బడికిరాలేదో సంజాయిషీఇవ్వమన్నాడు. తలనెప్పి వల్ల బడికి రాలేకపోయానని సమాధానంచెప్పాడు ఒకడు. దానిమీద అతనిని డాక్టరుసర్టిఫికేటు తెమ్మని అడిగాడు హెడ్డుమాస్టరు. ఇంకొకకుర్రవాడు తాను బడికి బయలుదేరా ననీ మధ్యదారిలో బడిలేదని తెలిసి తిరిగి ఇంటికి వెళ్ళిపోయా ననీ చెప్పాడు. బడిలేదనిచెప్పిన ప్రతివెధవాయమాటా వింటే, కొరడాదెబ్బలు తినదగినవాడవే నన్నాడు హెడ్డుమాష్టరు. అయినా బడికివచ్చి స్వంతంగా ఎందుకు తెలుసుకోలేదూ?

జవాబులేదు. శిక్ష చెప్పాడు: పదిరోజులఅటెండెన్సు రద్దు, రెండురూపాయల జరిమానా, ఆరోజంతా బెన్చీమీద నిలబడడం. మూడవవాడు తనకీ తలనెప్పివచ్చిందని చెప్పాడు. నాలుగోవాడు కడుపునెప్పి వచ్చిందన్నాడు. అయిదోవాడు తాను బడికిబయలుదేరేసమయానికి వాళ్ళనాయనమ్మ హఠాత్తుగా చచ్చిపోయిందన్నాడు. "మీ నాన్నదగ్గిరనుంచి చీటీ తీసుకురా?" అన్నాడు హెడ్మాస్టరు. అయితే ఆతనికి తండ్రి లేడు. అలాయితే సంరక్షకుడెవరు? నాయనమ్మే. మరి నాయనమ్మ చచ్చిపోయిందిగా? ఉహుఁ, యింకోనాయనమ్మ. దానిమీద మనిషికి ఎంతమంది నాయనమ్మలుంటారేం అని ప్రశ్నించాడు. జవాబులేదు. పక్క ఇంటివారిదగ్గరనుంచి చీటీ తీసుకురాగలడా? ఉహుఁ, తీసుకురాలేడు. పక్క ఇంటివారిలో ఒకరికీ చదవనూ రాయనూ రాదు. ఎల్లమ్మన్‌వీధిలో మరీ చదువురానివారి మధ్య అతనినివాసం. పక్క ఇంటివారిని అడిగి నిజంగా వాళ నాయనమ్మ చచ్చిపోయిందీ లేనిదీ తెల్సుకోవడానికి మాస్టరు ఒకరిని పంపుతానని చెప్పాడు హెడ్మాస్టరు. మాటామంతీ లేదు. కుర్రవాడికి చెమటపట్టింది. 'నాయనమ్మ మావూళ్లో చచ్చిపోయింది, అందుకని పక్కవాళ్ళకేం తెలీదు' అని సమాధానమిచ్చాడు కుర్రవాడు. హెడ్మాస్టరు వాడిని బెత్తంతో చేతికనుపుమీద కొట్టి నాలుగుతిట్టి పదిహేను రోజులు సస్పెండుచేశాను పొమ్మన్నాడు.

స్వామినాథన్‌వంతు వచ్చింది. దీనంగా నాలుగువేపులా చూశాడు. రాజం మూడోబెంచిమీద కూర్చుని మొహాం తిప్పేసుకున్నాడు. నల్లబల్లవంక అదేపనిగా చూస్తున్నాడు.

అయినా తల వెనకభాగం, గులాబిరంగుచెవులు స్వామినాథన్‌కి కనిపిస్తూనే ఉన్నాయి. చూసి భరించలేకపోయాడు. ఆ తల తనకేసి తిరిగి కళ్ళు తనమీద పడతాయేమోనని స్వామినాథన్‌కు భయంవేసింది. అలానే జరిగితే కింద పడిపోతానేమోనని స్వామికి సందేహంవచ్చింది మూడు బెంచీల అవతలి గులాబిరంగుచెవులు అతని నోరును కట్టివేశాయి. అతని కళ్ళకి చెవులకుమధ్య ఎవరయినా పల్లబల్ల అడ్డుపెడితేనా!

ఇలాంటి ఆలోచనలలో మునిగిపోయివున్నాడేమో హెడ్డుమాస్టరు ఏమి అడుగుతున్నదీ తెలియలేదు. హెడ్డుమాస్టరుచేతి బెత్తపుదెబ్బతో ఒళ్ళు తెలిసింది.

"నిన్న బడికిరాలేదేం?" అని అడిగాడు హెడ్డుమాస్టరు పైకి చూస్తూ. తానసలు బడికి రాకపోలేదని చెప్పాలని స్వామినాథన్ మొదట అనుకున్నాడు. కాని హాజరుపట్టీ ఉందిగా "ఊహుం—ఊహుం— నన్ను రాళ్ళువేసి కొట్టారు. రావాలని పెనుగులాడాను. కాని నా టోపీలాగి తగలబెట్టారు. బాగా బలమయినవాళ్ళు నన్ను రాకుండా పట్టేశారు ...అంతగొప్పవాడిని జైలులో పెడితే...నువ్వు ఇంగ్లీషువాళ్ళ బానిసగా పడిఉండడం ఆశ్చర్యంగా ఉంది. వాళ్ళు కోసేయలా...డక్కా—మజ్లిన్...బానిసలకు బానిసలు..." ఇదీ అతను చెపుదామనుకున్న సంజాయిషీ. కాని చెప్పలేదు. తలనెప్పివచ్చిందనివంక చెపుదామనుకున్నాడు. కాని అతనికిముందు ఒకరిద్దరు ఆ వంకే చెప్పారు. "మాటాడవేం?" అని గద్దించాడు హెడ్డుమాస్టరు. స్వామినాథన్ కుడిభుజంమీద బెత్తంతో జోరుగా కొట్టాడు. స్వామినాథన్ కన్నీరుపెట్టుకుంటూ, ఎడమచేతితో దెబ్బతగిలిన

చోట రుద్దుకుంటూ హెడ్మాస్టర్ను తేరిపారజూస్తూ నిలబడ్డాడు. "జవాబు చెప్పకుండా అలా గుడ్లప్పగించి చూస్తుంటే నీ ప్రాణంతీస్తాను" అన్నాడు హెడ్మాస్టరు.

"నేను - నేను - రాలేకపోయాను"అని నత్తాడు స్వామినాథన్.

"అలాగేం ?"అని ఒకపిల్లవాడికేసి తిరిగి జవానును పిలుచుకురమ్మని చెప్పాడు హెడ్మాస్టరు.

స్వామినాథన్ అనుకున్నాడు; యేమిటి జవానుచేత నన్ను చావకొట్టిస్తాడాయేం ? అలా కొట్టిస్తే యిక్కడ వున్నవాళ్ళందరిని కొరికిచంపుతాను, అని. జవాను వచ్చాడు. హెడ్మాస్టరు "యీ డెస్కుమీది అల్లరిపెధవనుగురించి నీకు తెలిసిందేమిటో చెప్పు" అని అడిగాడు.

జవాను స్వామినాథన్వంక కోరచూపుచూసి, గుర్రుమని, "అద్దాలు పగలగొట్టలేదూ?" అని అడిగాడు.

"నా గదిలోని వెంటిలేటర్ల అద్దాలు!" అన్నాడు హెడ్మాస్టరు.

తప్పించుకోవడానికి మార్గంలేదు. వీపుమీద ఇంకో దెబ్బ పడేవరకూ స్వామినాథన్ పిచ్చివాడిలాగా గుడ్లప్పగించి చూస్తూ నేడున్నాడు. "దొంగ! దీని కేంచెపుతావు?" అని అడిగాడు హెడ్మాస్టరు. చెప్పడానికేముంది? అద్దాలు పగలగొట్టినమాట నిజం. వాళ్ళకంటపడింది. ఇక చేసేదేమీలేదు. అనుకోకుండానే మొండికెత్తాడు. నేరంచేయలేదని గోలపెట్టకపోతేనేం? ఇంకోదెబ్బ వీపుమీద పడింది. "కొట్టకండి, నెప్పిగా

వుంది" అన్నాడు. ఇంకేం హెడ్మాష్టరు మరీ రెచ్చిపోయి ఇంకో నాలుగు దెబ్బలు వడ్డించాడు. "యీ డెస్కుమీద నిలబడి పిచ్చిపుల్లాయిలా గుడ్లప్పగించిచూస్తూ నిలబడు. యింతలో శిక్ష చెపుతాను."

స్వామినాధన్ శరీరంమీద అంగుళంఅంగుళం బెత్తందెబ్బలతో మండిపోయింది అన్నిటికీ తెగించాడు. ఆ తెగింపులోనుంచి సాహసం పుట్టుకొచ్చింది. కన్నీళ్ళు తుడుచుకుని, కండకు దూకి "యీ ముదనష్టపుబడిలో యెవడుచదువుతాడు" అని గొణుక్కుంటూ వెళ్ళిపోయాడు.

## పదమూడో ప్రకరణం

## యం. సి. సి.

### I

ఆరువారాల తరవాత రాజం స్వామినాధన్ ఇంటికి వచ్చి అతని తప్పులన్నీ క్షమించానని చెప్పాడు. రాజకీయాలలో పాల్గొనడం ఒక పాపం! బోర్డు హైస్కూలు గాలి సోకి చెడి పోవడం ఒక పాపం! అంతే మందకొడితనం, ఉన్న తెలివి తేటలు కాసినీ పోగొట్టుకోవడం.

సమ్మెమరునాడు ఆల్బర్ట్ మిషన్‌స్కూలులోనుంచి దర్జాగా వెళ్ళిపోయినతరవాత ఆ బడికి వెళ్ళనని స్వామినాధన్ మొండికేశాడు. దానిమీద వాళ్ళనాన్న అతన్ని బోర్డు హైస్కూలులో ప్రవేశపెట్టాడు. ఈ కొత్తబడిలోకూడా తనకు సౌఖ్యం ఉండదని స్వామి మొదట్లో భయపడ్డాడు. కాని కొత్తగా బడిలో చేరాడేమో పిల్లలకు అతనంటే ఆసక్తి

రేకెత్తింది. సెకండు సిలో అందరికళ్లూ అతనిమీదనే పడ్డాయి. తోటిపిల్లలంతా అతనినిచూడడానికి మాటలు వినడానికి చుట్టూ మూగేవారు. ఎవరెవరితో స్నేహంకట్టాలో అతను నిర్ణయించుకోలేదు. ఆల్బర్ట్ మిషన్ స్కూలులోని తన జట్టు ఇంకా అలానేఉందని నమ్మాడు. కాని జూన్‌లో బడి తెరిచినతరువాత ఆజట్టులోవాళ్లు చెల్లాచెదరయారు. శంకర్ అసలు కనిపించడమేలేదు. వాళ్ళనాన్నకి బదిలీఅయిందట. సోమూను ఫైక్లాసులోకి పంపలేదు. దానిఅర్థం అతనిని జట్టులోనుంచి తరిమివేసినట్టే. 'బటాణీగింజ'ను ఫైక్లాసులో వేశారుగాని, బడికి మూడు నెలలు ఆలస్యంగా వచ్చాడు. మెడికలు సర్టిఫికేటు, సంజాయిషీ, వినాయింపు – ఈ గొడవలలో పడిఉన్నాడు. ఇప్పుడు ఒకగొడవకాదు వందగొడవలలో మునిగిపోయి పాతస్నేహితులనుకూడా ఎరగనట్టు తోసుకుపోతున్నాడు. రాజం, మణి మాత్రం స్వామినాథన్‌విషయంలో మారిపోలేదు. ప్రతిరోజూ మణి వచ్చి కలుసుకుంటున్నాడు. కాని స్వామినాథన్ రాజకీయాలలో పాల్గొనడం బయటపడిననాటినుంచీ రాజం మాటాడడం మానివేశాడు.

ఆనాటిమధ్యాహ్నం స్వామినాథన్ ఇంట్లో ఒకచీకటి మూల కూర్చుని, అట్టపెట్టి, కళ్ళజోడుఅద్దంతో కెమెరా తయారుచేయాలని యత్నిస్తున్నాడు. బాగా పెద్దదిగాఉన్న రంధ్రంలో అద్దం బిగించాలని చూసి విసిగిపోయాడు. ఇంతలో ఎరుగున్న గొంతు వినిపించింది గుమ్మంలోకి పరుగెత్తాడు.

"హల్లో! హల్లో! రాజం!" అన్నాడు "వస్తున్నానని చెప్పనేలేదే?"

"నీచేతిలోది యేమిటి?" అని అడిగాడు రాజం.

"ఓ, యిదా?" అన్నాడు స్వామినాథన్ సిగ్గుపడుతూ.

"ఊఁ, యేదీ చూడనీ"

అబ్బే! మరేం లేదు" అన్నాడు స్వామినాథన్ కెమేరా అందిస్తూ.

"అట్టపెట్టె రంధ్రంగుండా చూడసాగాడు రాజం. స్వామినాథన్ అన్నాడు. "మా క్లాసులో అక్బర్ అలీ వున్నాడే, వాడు అద్భుతమయిన కెమేరా తయారుచేశాడు.

"నిజం! దాంతో యేం చేశాడు?"

"చాలా చాలా ఫొటోలు తీశాడు"

"అలాగా! యెవరిఫొటోలు?"

"నాకయితే చూపెట్టలేదుగాని యిళ్ళఫొటోలు చెట్ల ఫొటోలు మనుషులఫొటోలు తీసివుంటాడు"

రాజం గడపమీద కూచుని "యెవరీ అక్బర్ అలీ?" అని అడిగాడు.

"సాహెబు. మా క్లాసులో చదువుతున్నాడు."

"బోర్డుహైస్కూలులోనా?" అతని మాటలో వేళాకోళం దాగివుంది. స్వామినాథన్ ఈ ప్రశ్ననుపట్టించుకోకుండా "అతనికి బైసికిలు వుంది. చాలా మంచి సాహేబు. గజినీమహమ్మదుని, ఔరంగజేబును వట్టి దుర్మార్గులంటూంటాడు."

"వాళ్లు దుర్మార్గులని యెలా అనుకున్నాడు?"

"వాళ్ళు మన దేవాలయాలు నాశనంచేయలేదూ? సోమనాథపురం దేవుడిసంగతి మరిచేపోయావా?..."

"మన బ్రాహ్మలకి ఆ మాత్రం ప్రాయశ్చిత్తం కావల

సిందే" అన్నాడు రాజం. "మా నాన్న అమావాస్య గిమా వాస్య పట్టించుకోడు. తద్దినాలు పెట్టడు." చర్చకు దిగే ధోరణిలో పడ్డాడు. ఈ విషయం గ్రహించి స్వామినాథన్ నోరు మెదపలేదు. రాజం, "నేను చెపుతా విను, యీ బోర్డు హైస్కూలే యిదంతా నీకు నూరిపోసింది."

ఔననడం మంచిదని తోచింది. "అవును, ఒకవిధంగా చూస్తే నువు చెప్పిందే సరి. బోర్డుహైస్కూలు అంటే నాకూ యిష్టం లేదు."

"అలాఅయితే, అందులో యెందుకు చేరావు ?"

"యేంచేయను. మనమాష్టరు పశువు. నేను కాబట్టి సరిపోయింది, నువ్వేఅయితే మొహంమీద తన్నేవాడివి.

ఇలా పొగిడినా రాజం శాంతించలేదు. "నేనేఅయితే ఆ వెధవరాజకీయాలకి, సమ్మెలకి దూరంగా వుండేవాడిని" అన్నాడు. వాళ్ళనాన్న గవర్నమెంటుఉద్యోగి. అందుకని వాళ్ళకుటుంబం రాజకీయాలకివ్యతిరేకం.

స్వామినాథన్ అన్నాడు: "అవును. సమ్మెరోజున నేను ఇంటిదగ్గిర వుండిపోతేపోయేది." ఇలా పూర్తిగా లొంగిపోవడంవల్ల రాజంకు జాలివేసింది. ఇదివరకటి తప్పులను క్షమిస్తాననీ, బోర్డుహైస్కూలులో చదవడం పట్టించుకోననీ వెంటనే చెప్పాడు రాజం. పూర్వంలాగానే స్నేహంగాఉండామన్నాడు. "క్రికెట్టుజట్టు యేర్పాటుచేదాం, యేమంటావు ?"

క్రికెట్టు తాను ఆడగలిగినఆట అని స్వామినాథన్ ఎన్నడూ అనుకోలేదు. హాబ్స్, బ్రాడ్‌మన్, దులీప్ మొదలయిన ఆటగాళ్ళపేర్లతో పరిచయమేగాని, రాజంలాగా

వాళ్ళ ఆటస్కోర్లు జ్ఞాపకంపెట్టుకోలేకపోతున్నాడు. క్రికెట్టు ఆటగాళ్ళబొమ్మలు సంపాదించి ఆల్బంలో అతికించాడు. కాని అవి విసుగెత్తించేవి. అందుకని వాటిమీద ఎక్కువ శ్రద్ధ తీసుకోలేదు. ఆల్బంలో ప్రతిపేజీమీదా ఒకేబొమ్మ అంటించా ననికూడా అనుకుంటూండేవాడు.

"ఊహుఁ — రాజం! నేను క్రికెట్టు ఆడగలుగుతానను కోవడంలేదు. ఆడడం యెలాగోకూడా తెలియదు."

"మొదట్లో అంతా అలాగే అనుకుంటారు. బొమ్మలు స్కోర్సు సంపాదిస్తున్నప్పటికీ ఆడడంయెలాగో నాకూ తెలీదు"

బాగుంది! బహుశా బాటుతీసుకుని విదిలించేముందు హాబ్సుకూడా సిగ్గుపడిఉంటాడు.

"మనస్కూలు లెవెన్‌తోసహా అనేకమయిన జట్లులకు సవాలుచేయవచ్చు. తమను యెవరూ ఓడించలేరని వాళ్ళ వూహా" అన్నాడు స్వామినాథన్.

"యేమిటీ? బోర్డుస్కూలుచవటలు అలా అనుకుంటు న్నారా? వాళ్లని చిత్తుచిత్తుచేసేద్దాం, ఊఁ—?"

"మనజట్టుకి యేంపేరు పెడదాం?"

"నీకు తెలీదూ? పేరు యం. సి. సి." అన్నాడు రాజం.

"అది హాబ్సుజట్టుపేరు కదూ? వాళ్ళ పేరే మనమూ పెట్టుకుంటే మనల్ని వాళ్లు కోర్టుకి యీడవగలరు!"

"యెవరేమంటారు? చిక్కులు తటస్థిస్తే, జడ్జీగారిముందు యం. సి. సి. అంటే మాల్గుడి క్రికెట్టు క్లబ్బు అని చెపుతా."

స్వామినాథన్‌కి ఇది నచ్చలేదు. యం. సి. సి. పలకడా

నికి డాబుగాఉన్నా పేరుమాత్రం చప్పచప్పగా ఉంది, "యింకే దయినా పేరు ఆలోచించడం మంచిది రాజం!"

"పానీ, నీ వేదయినా చెప్పు చూదాం"

"సరే, నావుద్దేశం – 'ఫ్రెండ్స్ ఎలెవెన్' అంటే బాగుం టుందని"

"ఫ్రెండ్స్ ఎలెవెనా ?"

"పోనీ 'జంపింగ్‌స్టార్స్" అన్నాడు స్వామినాథన్.

"మరేం అర్థాన్నంగా లేదు."

" 'జపింగ్‌స్టార్స్' అని పెట్టుకుంటే బలే మజాగా వుంటుంది."

వార్తాపత్రికలో వార్త ఇలా ఉంటుందనే ఊహా కలి గింది రాజంకు.

" 'జంపింగ్‌స్టార్సుజట్టు' బోర్డుహైస్కూలు ఎలెవెన్‌ని ఓడించింది. బలే! బలే!"అన్నాడుఆ ఊహాకి సంతోషిస్తూ. కాగితంముక్క పెనసలు పైకితీసి "స్వామీ, నీబుర్రలోకి వచ్చినపేర్లు చెప్పు. జాబితా పెద్దదయితే మంచిది 'జంపింగ్ స్టార్స్' 'యం సి. సి'. యీ రెంటికింద గీట్లుపెట్టి యీ పేర్ల విషయం ప్రత్యేకంగా ఆలోచిద్దాం. ఊఁ, చెప్పు"

స్వామినాథన్ కొంచెంసేపు ఆలోచించి మొదలు పెట్టాడు. "ఫ్రెండ్స్ ఎలెవెన్, "జంపింగ్ స్టార్స్", "ఫ్రెండ్స్ యూనియన్..."

"ఫ్రెండ్స్‌యూనియన్" యిదివరకేరాశాను" అన్నాడు రాజం జాబితా చూపిస్తూ.

స్వామినాథన్ ఇంకా చెప్పసాగాడు. "ఎక్సెల్సియర్"

"అదీ రాశాను"

"'ఎక్సెల్జియర్ యూనియన్'...'ఛాంపియన్ ఎలెవెన్"

చాలాసేపటివరకు స్వామినాథన్ మాటాడలేదు.

"యేం, యిక తోచడంలేదా ?"

"ఊహుఁ, మణి యిక్కడవుంటే యింకా కొన్ని పేర్లు చెప్పేవాడు...ఛాంపియన్ ఎలెవెన్"

"యిప్పుడు చెప్పావుగా ?"

"విక్టరీ యూనియన్ ఎలెవెన్"

"బలే బాగుంది. బలే బాగుంది.జనం జడుసుకుంటారు" జాబితా ముందుబెట్టి మహాసంతృప్తిగా ఒక్కొక్క పేరు చదివాడు. క్రిందటి రాత్రి పేర్లు ఎంచుకోవడానికి చాలా తంటాలు పడ్డాడు. కాని 'ఫ్రెండ్సుయూనియన్' 'ఎక్సెల్జియర్స్' అనే రెండు పేర్లు తప్ప ఇంకేమీ తోచలేదు. కాని స్వామినాథన్ ఎన్ని పేర్లు చెప్పగలిగాడు! రేపు సాయంత్రం నన్ను కలుసుకో గలవా స్వామీ ? మణినికూడా వెంటబెట్టుకుని వస్తాను. ఏదో ఒక పేరు నిశ్చయించేసేద్దాం"

కొంచెంసేపయినతరవాత స్వామినాథన్ అడిగాడు. "రాజూ, మనం జట్టును ఏర్పాటుచేస్తే గవర్నమెంటుకు పన్ను లాంటి దేదయినా కట్టాల్సివుంటుందా ?"

"గవర్నమెంటు దానికీ దీనికీ అని లేకుండా ప్రతిదాని మీదా పన్ను వేస్తున్నట్టుంది. మా నాన్న జీతం అయిదు వందలదాకా వుంటుంది. రెండువందల పైచిలుకు గవర్నమెంటు తీసేసుకుంటుంది. యింతకీ మనం పన్ను కట్టవలసివస్తుందే అనే సందేహం యెందుకువచ్చింది? "

"మనం పన్నుకట్టకపోతే గవర్నమెంటు మనజట్టునుగాని పేరునుగాని గుర్తించకపోవచ్చు. అపుడు యేజట్టుపడితే ఆజట్టు మనజట్టుపేరు కొట్టేయవచ్చు. చాలా చిక్కులు వచ్చిపడ వచ్చు."

"పోనీ రెండుపేర్లు పెట్టుకుంటేనో?" అన్నాడు రాజం.

"అలాంటిమామూలు లేదు."

"రెండుపేర్లుపెట్టుకున్న జట్లను చాలావాటిని నేను యెరు గున్నా. నేను బిషప్‌వాలర్‌స్కూలులో చదివేటపుడు మాకు క్రికెట్టుజట్టు వుండేది. దానిపేరు సరిగా జ్ఞాపకంరావడంలేదు. 'క్రికెట్టు ఎలెవెన్', వాలర్స్‌క్రికెట్ ఎలెవెన్' అని రెండుపేర్ల తోను పిలిచేవాళ్ళమని గుర్తు. ఒకపేరు మాములుగా వాడ డానికి, రెండోది పోటీఆటల్లో వాడడానికి."

"మీ వాలర్స్‌లాంటి డబ్బున్నజట్టుకు రెండుపేర్లు పెట్టుకోవడం తగిపోతుంది. కాని గవర్నమెంటు రెండుపేర్లకీ పన్నుకట్టమంటే?"

క్రికెట్టుజట్టును ఏర్పర్చడం ప్రపంచంలోకల్లా చిక్కయిన విషయమని ఇప్పటికి రాజం గుర్తించాడు. అతని ఇంటిపక్కన ఉన్న మైదానంమీదికి ఒకడజనుమందిని తీసుకువెళ్ళి, క్రికెట్టు ఆడి,ఇతరజట్లను సవాలుచేదామని ఆశించాడు పాపం! కాని పేరు పెట్టడం, గవర్నమెంటుపన్నులు మొదలయినచిక్కులు అంతూ పొంతూలేకుండా వచ్చిపడ్డాయి. యెక్కడజోక్యంచేసుకోవాలి, యెక్కడకూడదు అనేసంగతే గవర్నమెంటుకు తెలిసినట్టులేదు. గాంధీ అంటే ఒక్కక్షణం గౌరవంకలిగింది. గవర్నమెంటును అంతగా వ్యతిరేకిస్తున్నాడంటే ఆశ్చర్యంలేదు.

రాజోయేచిక్కులను ఊహించడంలో స్వామినాథన్ గట్టివాడు. “సరే, పన్నుకట్టదలచాననుకో, యెవరికి కట్టాలి ?” అన్నాడు. చక్రవర్తికి కాదు, వైస్రాయికి కాదు. గవర్నమెంటు అంటే ఎవరు ? గవర్నమెంటునని నటిస్తూ ఎవరయినా డబ్బు తీసుకుని దగాచేస్తే ? మనిఆర్డరుద్వారా గవర్నరుకు పంపాలా ? కాని అది ద్రోహం అనిపించుకుంటుంది. ఇంతకీ అసలు పన్ను ఎంతని ?

## II

రాజంగదిలో బల్లచుట్టూ కూచున్నారు. మణిముందు ఆటసామానుఅమ్మే మెసర్స్ బిన్స్వారి కేటలాగు ఉంది. “జూనియర్ విల్లార్డ్ బాట్లు; యేడున్నర. మంచికర్రతో చేయబడింది. కేంబ్రిడ్జి జూనియర్ బాయస్ ఎలెవెన్ వారిచే వాడబడుచున్నది” అని చదివాడు.

“ఏదీ నన్నుకూడా చూడనీ” రాజం బల్లమీదికి వంగి అన్నాడు. “చక్కగావుండేటట్టుందే స్వామి ! నువుకూడా చూడు.” స్వామి మెడముందుకువంచి అది మంచిదే అని ఒప్పుకున్నాడు. కాని తెలివితేటలుగా “కేటలాగులోవున్న తలిమ్మాబ్రాటులలాగా నేవుందే”అన్నాడు. మణి ఎడమచేయిచాచి, అతనిమెడపట్టుకుని, బాటుబొమ్మకు దగ్గరసా రానిచ్చాడు. “జూనియర్ విల్లార్డ్ బాటుకి తలిమ్మాబాట్లకు భేదం తెలుసుకోలేనివాడివి ఆటగాడిలా మహా నటిస్తావెందుకు? మా జట్టులో వుండేపనికికూడా నువు పనికిరావు” ఇలా చివాట్లుపెట్టి మెడ వదిలాడు.

"స్వామి! యీ కేటలాగుకంపెనీవాళ్ళు జూనియర్ విల్లార్డ్‌ని యేమంటారో తెలుసా? జూనియర్ బొట్లులో యిది రోల్స్‌రాయ్‌వంటిది. రోల్స్‌రాయ్ కారుకీ తతిమ్మా కార్లకీ భేదం నీకు తెలీదా?" అన్నాడు రాజం.

స్వామినాథన్ మండిపడుతూ, "రోల్స్‌రాయ్‌కారుకీ తతిమ్మాకార్లకీ భేదంలేదని యెన్నడూ నే ననలేదే" అని జవాబు చెప్పాడు.

"అలాఅయితే ఆ భేదంయేమిటో చెప్పరాదూ?" అని నొక్కాడు రాజం.

మణి నవ్వుతూ, "ఊఁ- చెప్పు, నీకు నిజంగా ఆ భేదం తెలిస్తే చెప్పవేం?" అని తొందరపెట్టాడు.

"రోల్స్‌రాయ్‌ఖరీదు లక్షరూపాయలు. యింకేకారయినా పదివేలకంటె యెక్కువచేయదు. రోల్స్‌రాయ్‌యింజన్లు వెండివి. తక్కినవాటివి యినపవి" అన్నాడు స్వామినాథన్.

"ఒహో!" అని ఎగతాళిచేశాడు రాజం.

"రోల్స్‌రాయ్‌కారు తిప్పలుపెట్టదు. తతిమ్మావియెప్పుడూ తిప్పలుపెడుతూనేవుంటాయి. రోల్స్‌యింజను యెన్నడూ ఆగదు. చప్పుడుచేయదు. తతిమ్మావి ఒకటే చప్పుడు"

"రోల్స్‌రాయ్‌కారుమీద నువు వుపన్యాసం ఒకటి యెందుకుయివ్వకూడదు?" అన్నాడు మణి.

"స్వామి! నీకు రోల్స్‌రాయ్‌విషయం యింత తెలిసినందుకు నాకు మహా సంతోషంగావుంది. కాని విల్లార్డ్ జూనియర్‌నిగురించి నీ కేమీ తెలీకపోవడం నాకే సిగ్గేస్తోంది. నేను బిషప్‌వాలర్స్‌లో చదివేటప్పుడు విల్లార్డ్ బొట్లు డజను వుండేవి.

ఓ, యేంబాట్లవి! బాటులోపల తీగచుట్టలు వుండేవి. తగిలితే చాలు, బంతి యెగిరిపోయేది. హాండిలుచుట్టూ సన్నని సిల్కు దారం చుట్టాము. నీకేమీ తెలిసిచావను. పైగా మాటాడ వస్తావు! విల్లార్డ్ లాగా సిల్కుదారం కట్టి తీగచుట్టలు పెట్టిన యింకో బాటు చూపించు"

కాస్సేపు ఎవరూ మాటాడలేదు. తరవాత రాజం "స్వామి! రాసుకో" స్వామినాధన్ కాగితంమీద "విల్లార్డ్ జూనియర్ బాటు" అని రాసుకుని తలపైకెత్తి "యెన్ని" అని అడిగాడు.

"మూడు. చాలవా మణీ?"

"మూడుకొనడం యెందుకు దండగ. రెండు చాలు" కాని మా బినుధ్యలో ఒకటి విరిగిపోతుందనుకో, అపు డేం చేస్తాం?"

"అపుడయినా మనబాటు విరిగిపోతే ఆటఆపేద్దాం?"

"డబ్బు దుబారాచేయదలుచుకోకపోతే రెండు సరి పోతాయి."

రాజం ఉత్సాహం మితిమీరిపోయింది. కుర్చీలోనుంచి లేచి వెళ్ళి మణి కుర్చీచేతిమీద కూచుని కేటలాగులోని బొమ్మలు తనివితీరా చూడసాగాడు. స్వామినాధన్ వాళ్ళతో నకీభవించకపోయినా అతనికీ ఉత్సాహం రేకెత్తి, వెళ్ళి మణి కుర్చీరెండో చేతిమీద కూచున్నాడు ముగ్గురు క్రికెట్టుబంతులు బాట్లూ, వలలబొమ్మలు కనులవిందుగా చూడసాగారు.

ఒక గంటసేపటిలో కేటలాగులోనుంచి వాళ్ళజట్టుకు కావలసినవి ఎంచుకున్నారు. ఆ తరవాత అన్నిటికంటె కష్టమయిన పని వచ్చింది. మెసర్స్ బిన్స్ కంపెనీవారికిఆయూ వస్తు

వులు పంపవలసిందని ఉత్తరం రాయాలి. మర్యాదకోసం ఉత్తరం రాయమని మణిని కోరాడు రాజం. కాని మణి ఒప్పుకోలేదు. ఊహుం - అంటూనే బలవంతంమీద ఒప్పుకు న్నాడు స్వామి. పెనసలుముల్లికి నములుతూ చాలాసేపు కూచున్నాడు. గాని ఒక్క అక్షరంకూడా రాయలేకపోయాడు. చిన్నచిన్న మాటల స్పెల్లింగుకూడా తడుముకోవలసివచ్చింది. దానిమీద తానే స్వయంగా రాయడానికి పూనుకున్నాడు రాజం. అరగంటతర్వాత వుత్తరంరాసి బల్లమీదపెట్టాడు.

"యం. సి. సి. (విక్టరీ యూనియన్ ఎలెవెన్)

మాల్గుడి,

మెసర్స్ బిన్స్,

స్పోర్ట్సు మెన్,

మౌంటురోడ్డు,

మదరాసువారికి,

ప్రియమయిన అయ్యా!

దయయుంచి మా జట్టుకు రెండు జూనియర్ విల్లార్డ్ బాట్లు, ఆరు బంతులు, వికెట్లు, తదితరములుతొందరగాపంపండి. చాలా అవసరం. డబ్బు తరవాత పంపుతాం. భయపడనవసరం లేదు. దయయుంచి తొందరగా పంపండి.

మీ విధేయుడు

కెప్టెన్ రాజం (కెప్టెన్)"

స్వామినాథన్ ఈ ఉత్తరాన్ని మెచ్చుకున్నాడు. కాని మణి కొన్ని అనుమానాలు వెల్లడించాడు. పూర్తిగా కొత్త వాళ్ళకి రాసే ఉత్తరం మొదట్లో 'ప్రియమయిన' అని రాయ

వచ్చునా? బిన్స్‌ని "ప్రియమయిన అయ్యా!" అని అనడం యెలా? 'అయ్యా' అనాలి.

దానిమీద రాజం అన్నాడు. 'అయ్యా' అని అనను. గుమాస్తాలు అలా అంటారు. నేను బిన్స్ గుమాస్తానా? "అయ్యా అనడమే నాకిష్టంలేదు."

సరే, ఉత్తరం అలానే వెళ్ళిపోయింది.

చాలాకష్టపడ్డారేమో హాయిగా విశ్రాంతితీసుకుంటు న్నారు. ఇంతలో పోస్టుజవాను ఒక కార్డుతెచ్చి రాజంకు ఇచ్చాడు. రాజం కార్డుచదువుకుని, బిగ్గరగా "యెవరురాశారో చెప్పుకోండి చూదాం?" అన్నాడు.

'బిన్స్'

"అబ్బే! మన హెడ్డుమాస్టరు రాసివుంటాడు"

"యెవరో?"

"జె. బి. హాబ్స్"

"ఊహుం- శంకర్ రాశాడు" అన్నాడు రాజం సంతోషంతో.

"శంకర్! అరె; ఆ పాతదొంగని మరిచేపోయాం! స్వామినాథన్, మణి రాజంచేతిలోనుంచి కార్డు లాక్కుని చదివారు:

"ప్రియమయిన మిత్రమా!

మానాన్న ఇక్కడికిరావడంమూలంగా నేను ఇక్కడ చదువుతున్నాను. మాఅమ్మకూడా ఇక్కడే వుంది. మేమంతా యిక్కడేవున్నాం. యిక్కడే వుంటాం. నేను కులాసాగా వున్నాను. మీరూ కులాసాగావున్నారనే నమ్ముతున్నాను.

ఇక్కడ ఎండలు ఎక్కువ. ఈమధ్య మూడురోజులపాటు జ్వరం వచ్చింది. పండుకొన్నాను. నేను బాగా చదివి పరీక్షప్యాసవుతానని నమ్ముతున్నాను. స్వామినాథన్, మణి కులాసాగా వున్నారా? యిక్కడ ఎండలు ఎక్కువ. ఇపుడు నేను క్రికెట్టు ఆడుతున్నాను ఇంతకంటె రాయడానికిలేదు.

అభివందనములతో

మీ ప్రియమైనమిత్రుడు

శంకర్"

పరా: నన్ను మరిచిపోకండి.

ఈ ఉత్తరం వారిమనసులను కదిలించివేసింది. తక్షణమే జవాబురాయాలని నిశ్చయించారు.

గంటలో మూడుఉత్తరాలు తయారయాయి. మణి శంకర్ఉత్తరాన్ని ఒక్కఅక్షరంకూడా పొల్లుపోనీయకుండా దించేశాడు. స్వామినాథన్,రాజంకూడా కొంచెం ఇంచుమించు అలాంటిజాబులే రాశారు. భగవంతుడిదయవల్ల తాము కులాసాగానే ఉన్నామనీ, శంకర్ పరీక్షలో ప్యాసవుతాడని కులాసాగాఉన్నాడనీ నమ్ముతున్నామనీ రాశాడు. తరవాత వాళ్ళక్రికెట్టుజట్టునుగురించి చాలాచాలా తెలిపాడు. శంకర్ తమజట్టులో చేరతాడని ఆశిస్తున్నామన్నారు. శంకర్జట్టు తమజట్టును పోటీకి సవాలుచేయవచ్చని రాశారు.

మూడుఉత్తరాలూ కవరులోపెట్టి అంటించారు. అపుడు శంకర్చిరునామా తెలుసుకోవలసినఅవసరం ఏర్పడింది. శంకర్ కార్డు అంతా వెతికారు. చిరునామాసంగతి ఒక్కమాటకూడా లేదు. ఎక్కడినుంచి రాసిందీ లేదు. పోస్టుముద్రనుబట్టి ఎక్కడి

నుంచి రాసిందీ తెలుసుకోవాలనిచూశాడు. కాని, స్టాంపు మీద నల్లటివంకరచారమూలంగా ఏమీ తెలియలేదు.

## III

కాప్టెన్ యం. సి. సి. మాల్గుడి చిరునామాకు బిన్స్ నుంచి ఉత్తరంరావడంతో యం. సి. సి, దాని సన్నాహకులు చెప్పుకోతగ్గవారని రుజువయింది. ఆ అందమయినకవరు పుట్టుకుని అటూఇటూ తిప్పడం చాలా సంతోషం కలిగించింది. యం. సి. సి. ని మొదటగా గుర్తించినది బిన్స్. తమ జట్టుకు కావలసిన ప్రతిదీ ఆ కంపెనీనుంచే తెప్పిస్తానని రాజం ప్రమాణం తీసుకున్నాడు. ఆ ఉత్తరంలోని మూడు విషయాలు రాజంకు, అతనిస్నేహితులకు పరమానందం కలిగించాయి. (1) కాప్టెన్ పేర వచ్చినఉత్తరం వెంటనే అందజేయడం చక్రవర్తిగారి పోస్టాఫీసు వాళ్ళుజట్టును గుర్తించిందనడానికి నిదర్శనం. (2) బిన్స్ వారు కార్డుమీదకాకుండా పెద్దకవరు, అందులోనూ టైపుచేసి పంపడం తమను అటువంటి గొప్పకంపెనీ నిజంగా గుర్తించి నట్లే. (3) ఇంకోకవరులో నాలుగణాలబిళ్ళ అంటించి పెద్ద కేటలాగు పంపారు. భలే!

అందులో బిన్స్‌వారు కాప్టెన్ రాసిన ఉత్తరానికి కృతజ్ఞత తెలిపారు. ఆర్డరుతోపాటు 25% డబ్బు పంపి తక్కినది వి. పి. విడిపించుకుంటే కృతజ్ఞులం అని వ్రాశారు.

ఈ ఉత్తరానికి అర్థం ఏమిటా అని ఆ ముగ్గురూ తలలు బద్దలుకొట్టుకున్నారు. బిన్స్‌వారు సామాను పంపించదలచారో లేదో వాళ్ళకి అర్థంకాలేదు. "కృతజ్ఞులం" అనే మాటకు అర్థం ఏమిటో చెపితే ఉత్తరంలోని భావం వెల్లడించగల

నన్నాడు మణి. డిక్ష నరీ వెదికి ఆ మాటకు అర్థం చెప్పినా మణికి ఆ ఉత్తరం బోధపడలేదు. ఆ సందర్భంలో ఆ మాటకు అర్థంలేదు. "ఒక్క విషయం మాత్రం బాగా తెలిసింది" అన్నాడు రాజం. "మనం ఉత్తరం రాసినందుకు సంతోషం వెల్లడించారు. అందుకని మనకు సామాను పంపరని దీని అర్థం కాదు" స్వామినాథన్ కూడా అతనికి పక్క తాళంవేస్తూ "అవును మనకు సామాను పంపించదలచకపోతే సంతోషం వెల్లడిస్తారా? తిట్టేవాళ్ళు! "సంతోషంవిషయంలోఎక్కడయినా పొరబాటు ఉందేమోనని ఉత్తరం పరీక్షగా చూశాడు.

"ఆ చవట ఆ మాట యెందుకువేసినట్టు? " అని మణి అడిగాడు. దానికి అర్థంపర్థంలేదు. మనలను వేళాకోళంపట్టిం చాలని వుద్దేశమా? "

"25% అంటాడేవిటి? దాని అర్థమేమిటో తెలిస్తే బాగుండును."

స్వామినాథన్ ఉండబట్టలేక "చూడు రాజం! యీ వుత్తరం నీకు అర్థంకాలేదంటే ఆశ్చర్యంగావుంది. పరీక్షలో నూటికి 60 మార్కులు వచ్చాయి?"

"నీ కేమయినా మతివుందా? దానికీ దీనికీ సంబంధమే విటి? యీ వుత్తరం బి. ఏ. వాడికికూడా అర్థంకాదు."

చివరకు పొరబాటున ఉత్తరం తమకు పంపారనే నిశ్చ యానికివచ్చారు. వాళ్ళకి జ్ఞాపకంవున్నంతవరకు యం. సి. సి. కిందటిఉత్తరంలో 'కృతజ్ఞులం' 'పంపండి' 25% మొదలయిన మాటలు వాడడానికి అవకాశంఇవ్వలేదు. అంత పెద్దకంపెనీ తమను వేళాకోళంచేయ పూనుకుంటుందా? స్వామినాథన్

ఉత్తరం మొదట్లో రాసిన 'యం. సి. సి. కాప్టెన్‌కు'అనేది చూపించాడు. కాని అదికూడా పొరబాటేనని తోసివేశారు.

ఈ ఉత్తరాన్ని వేరే ఇంకోఉత్తరాన్ని కవరులోపెట్టి పంపారు.. వేరేఉత్తరంలో ఇలా రాశారు.

"మీరు. ఎవరిఉత్తరమో మాకు పంపారని తెలపడానికి విచారిస్తున్నాం. ఆ యెవరివుత్తరమో యిందుతో పంపుతున్నాం. దయయుంచి మేముకోరినవస్తువులు తక్షణమే పంపండి."

# IV

యం. సి. సి.కి ఉత్సాహం తగ్గలేదు. మళ్ళీ ఉత్తరం రాకపోయినా ప్రతిరోజూ పోస్టులో తమకు కావలసినవస్తువులు వస్తాయనే ఆశిస్తూవచ్చారు. పదిరోజులు గడిచాయి. అసలు బాట్లు వగైరా వచ్చేవరకు దొరికినవాటితోనే ఆట ప్రారంభిద్దామని ఆలోచించారు. దేవదారుపెట్టె అడుగు చెక్కతో మూడు బాట్లు తయారుచేశారు. రాజం వాళ్లనాన్న క్లబ్బునుంచి వాడి పారవేసిన బంతులు మూడు తెచ్చాడు. వాళ్ళ ఇంటో ఉన్నాయనుకుని 'బటాణి గింజ' నాలుగుదుంగలు తెస్తానన్నాడు. రాజం బంగళా పక్కని చిన్నస్థలం ఆటకు నిర్ణయించాడు...అంతా సిద్ధమయింది. యం. సి. సి. కోసం ప్రత్యేకంగా వస్తువులు తయారు చేయడానికి నెలరోజులు పట్టినా, ఆట ప్రారంభించడానికి ఇబ్బంది లేదు. అసలయిన బాట్లు బంతులు వచ్చేసరికి పోటీ ఆటలలో పాల్గొనడానికి తయారవుతారు.

రాజం తన క్లాసులో తగినవాళ్లు అనుకొన్న వాళ్ళని కొందరిని యం. సి. సి. సభ్యులుగా చేర్చుకున్నాడు.

ప్రారంభం రోజున అయిదుగంటలకు 'బటాణీగింజ' తప్ప అంతా వచ్చారు. 'బటాణీగింజ' దుంగలు తెస్తానని మాట ఇచ్చాడు. అరగంట దాటింది ఇంకా రాలేదు. రాజం అతని రాకకోసం ఆదుర్దాగా చూస్తున్నాడు.

చివరికి ఎలాగయితేనేం దూరాన పొట్టివిగ్రహం కనిపించింది. అతను కంటపడేసరికి రాజం గుండె పట్టుకుంది. దుంగలు తెస్తున్నాడో లేదో అని కళ్లు పెద్దవిచేసుకుని చూశాడు. కాని 'బటాణీగింజ' పడమటిదిక్కు నుంచి వస్తుండడంవల్ల సాయంకాలపు ఎండలో సరిగా కనిపించలేదు. అక్కడచేరిన పన్నెండు మంది చేతులుఅడ్డం పెట్టుకుని చూశారు. కొంతమంది ఏదో మూట తెస్తున్నాడన్నారు. కొంతమంది చేతులుఊగించుకుంటూ వస్తున్నాడన్నారు.

'బటాణీగింజ' రాగానే, "దుంగలు లేవని చెప్పలేక పోయావా?" అన్నాడు రాజం.

"లేకపోవడమేమిటి? వున్నాయి. రేపు తెస్తాను. అవి యెక్కడున్నాయో మా నాన్నకిగాని తెలియదు"

"యెంతసేపటినుంచి నీకోసం కాచుకునివున్నామో తెలుసా? ముందే వచ్చి కనపడలేదని చెపితే తీరిపోయేదిగా?"

"గంటలుగంటలు వెతికాను. ఒకమూల వెతుకుతూంటే వచ్చి యెలా చెప్పేది?"

అందరినీ విచారం అలుముకుంది. ఇరవయిగంటలపైచిలుకునుంచి ఎప్పుడు బాటు విసురుదామా, ఎప్పుడు బంతిని

వేద్దామా అని తహతహలాడిపోతున్నారు. 'బటాణీగింజ' మూలంగాగాని, లేకపోతే తహతహ తీరిపోయేది. అంతా అతనికేసి కోపంగా చూశారు. ఒంటరివాడిని చేశారు. నేల మీద దేవదారుచెక్క బాట్లు, టెన్నిసుబంతులు ఊరికే పడి ఉండడం చూచేసరికి రాజంకు ఏడుపువచ్చింది. దుంగలు వచ్చి ఉంటే ఓహో! ఎంత దివ్యంగాఉండేది!



మొదటితడవే రాజం ఔటుఅయిపోయాడు.

రాజం బంగళాగోడను ప్రస్తుతానికి వికెట్టుగా ఉపయోగించుకోవచ్చునని ఒకరు సూచించడంతో అందరికీ ప్రాణం లేచివచ్చినట్లయింది.

బొగ్గుముక్కతో గోడ కొంతభాగాన్ని గుర్తుపెట్టారు. కాప్టెన్ అన్నిఏర్పాట్లుచేసి తానేస్వయంగా బాటింగును, స్వామి బౌలింగును పూనుకున్నారు. టెన్నిసు బంతి చేతిలోపట్టుకుని, నాలుగడుగులు వేసి, విసిరాడు. రాజం బాటు జాడించాడు కాని, గురి తప్పింది. బంతి గోడకు బొగ్గుముక్కగుర్తుకు అడుగున తగిలింది. మొదటిసారివే రాజం ఔటుఅయిపోయాడు. సంతోషంతో చప్పట్లుచరిచారు. ఆటగాళ్ళు స్వామినాథన్ చుట్టూమూగి వీపు తట్టారు. అక్కడికక్కడే "లేట్" అనే బిరుదుఇచ్చారు.

# పద్నాలుగో ప్రకరణం

## నాయనమ్మ అజ్ఞానం

బోర్డు హైస్కూలులో చదువుపని ఎక్కువ. అక్కడ ఇచ్చే హోంవర్కుముందు ఆల్బర్ట్ మిషనుస్కూలులో ఇచ్చేది ఇవ్వనట్టే లెక్క. పిల్లలుచదవవలసినది తన ఒక్క విషయమేనని ప్రతిమాస్టరు అభిప్రాయం. ఆరు లెక్కలు, నాలుగు పేజీల చూచిరాత, డజనులకొద్దీ కఠినపదాలకు డిక్షనరీ చూసి, అర్థాలు రాయడం, రెండుమాపులు గీయడం, అయిదు అరవ పద్యాలు సాధారణంగా ప్రతిరోజూ ఇచ్చే హోం వర్కు. మిషన్ స్కూలును వదిలిపెట్టకుండాఉంటే బాగుండేదని మధ్య మధ్య స్వామినాథన్ పశ్చాత్తాపపడుతుండేవాడు. ఇక్కడిమాస్టర్లకు దయాదాక్షిణ్యాలంటూ లేవు. వారానికి మూడుసార్లు డ్రిల్లు

కాకుండా స్కూటుక్లాసులు. ఆటలు ప్రతిరోజూ క్లాసువదలిన తరవాత తప్పవు. క్లాసుకు వెళ్ళకపోతే మర్నాడు అరడజను పేం బెత్తం దెబ్బలు. కళ్ళజోడు, బొంగుపుగొంతు హెడ్డుమాస్టరును చూస్తే అసహ్యం వేస్తుంది. ఆల్బర్ట్ హైస్కూలు హెడ్డు మాస్టరులో ఎన్ని లోట్లు ఉన్నా దర్జాగా ఉంటాడు.

ఇంత కష్టపడవలసిఉండడంవల్ల తీరుబడిఅంటూ ఉండేది కాదు. స్వామినాథన్ పెందలకాడే లేచి, గబగబా హోంవర్కు భోజనం వేళదాకా చేసేవాడు. అన్నంతిని మొదటిగంటకొట్టే సరికి బడికి చేరేవాడు. ప్రతిరోజూ మార్కెట్టురోడ్డుచివరి బట్టలదుకాణందగ్గిరికి వెళ్ళేసరికి మొదటిగంట కొట్టేవాళ్ళు. రొప్పుతూ క్లాసులో అడుగుపెట్టేసరికి రెండోగంటఅయ్యేది. ఆ గంట ఆల్బర్ట్ స్కూలుగంటలాగా ఖంగున మోగేదికాదు. అందులో ఏదో మందకొడిగా ముక్కుమూటలా ఉండేది. కాని తొందరల్లోనే స్వామినాథన్ దానికి అలవాటుపడి పోయాడు.

మధ్యాహ్నం ఏ గంటసేపో తప్ప సాయంకాలం నాలుగున్నరదాకా సీటుకి అలా అంటిపెట్టుకుని ఉండవలసివచ్చేది. మణి సహవాసం లేదేమో ఆఖరిబెంచీలో కూర్చునేఅలవాటు తప్పిపోయింది. రెండోవరసలో కూర్చునేవాడు. అక్కడ అల్లరిచిల్లరివ్యవహారానికి వీల్లేదు. ఎదురుగా మాస్టరు కూచుంటాడు. నాలుగున్నరకు గంటమోగగానే స్వామినాథన్ పెనసలు జేబులోపెట్టుకుని తిమ్మిరిఎక్కి నెప్పిపుడుతున్న వేళ్ళను జాచాడు. నాలుగున్నరగంటలగంటకు ప్రత్యేకంగా అతని ఒళ్ళుఝల్లుమనలేదు. సంతోషంతో అరుస్తూ క్లాసుబయటికి

ఊరకడానికి వీల్లేదు. డ్రిల్లుకు వెళ్ళాలి. వెళ్ళి వరసలో నిలబడి ముప్పావుగంట డ్రిల్లుచేయాలి. అంతసేపూ డ్రిల్లుమాస్టరు పిల్లలను కుక్కనుచూసినట్లుచూస్తాడు. ఎడమకు కుడికి కదలమంటాడు. టంచనుగా నిలబడమంటాడు. చేతులు ఊపమంటాడు. ఇష్టంఉన్నా లేకపోయినా, తెలిసినా తెలియకపోయినా హారిజంటల్ బారో, పారలల్ బారో ఎక్కాలి. హారిజంటల్ బారుమీదనుంచి పడితే తల బద్దలవుతుందేమోననే విషయమే పట్టించుకోడు, డ్రిల్లుమాస్టరు.

ఇదంతా అయినతరువాత ఇంటికి పరుగెత్తుకుంటూ వెళ్ళి, పుస్తకాలు విసిరేసి, కాఫీతాగి, ఎంతోదూరం క్రికెట్టు ఆడడానికి వెళ్ళాలి. కొంతదూరం పరుగెత్తి కొంతదూరం నడిచి ఆటస్థలానికి చేరుకోవాలి. ఎండిపోయినగడ్డితో నిండిన పొలాలమీద సాయంసూర్యుని ఏటవాలుకిరణాలు పడి మెరిసిపోతూ మనసును కదలించివేస్తాయి. దుమ్ము దట్టంగా రేగుతుంది. ఆటగాళ్ళు అటూఇటూ తిరుగుతూ వేసే కేకలసందడి ఆ పొలాలకు జీవంపోస్తోంది. బంతిని బాటుతో కొట్టేటపుడు పుట్టేచప్పుడు ఎంతహాయిగాఉంటుంది! లాలీఎక్స్టెన్షన్‌కు తిరిగే మలుపులో నిలబడిచూస్తే సూర్యుడు ఎర్రగాకాలిన నాణెంలాగా కనిపిస్తాడు. ఎన్నటికీ అస్తమించడని తోస్తుంది. కాని ఆటస్థలానికి చేరుకునేసరికి సూర్యుడు, ఆకాశంమీద రంగుకాంతి చిమ్మి అస్తమిస్తాడు. నీడలు మాయమవుతాయి. మున్సిపల్ లాంతర్లు అక్కడక్కడా మినుకుమినుకుమంటాయి. మంచి ఆటఒకటి ఆడడానికి ఇంకా వేళవుంటుందనేఆశ కలుగుతుంది. కాని అరఫర్లాంగుదూరానికే జట్టు నిర్లక్ష్యంగా పొలంచుట్టూ

కూర్చునివుండడం కనిపిస్తుంది. ఎవరో బాటును ఆయాసపడుతూ కొడుతున్నారు. అలసిపోయిన మరికొందరు బౌలుచేస్తున్నారు. సాయంత్రం ఎండలో కష్టపడి ఆడితే ఆయాసంరాక ఏంచేస్తుంది?

ఇదంతా ఇలావుండగా రాజం కొంచెం కోపగించుకుంటాడు. ఇతరులచిక్కులు అతనికి అర్థంకావు. "స్వామీ! యివ్వాళకూడా ఆలస్యంగా వచ్చావేం?"

"వెధవడ్రిల్లుక్లాసు, యేంచెయ్యను?"

"డ్రిల్లుక్లాసులు, స్కౌటుక్లాసులు తగలడనీ! పెందరాళే యెందుకు వచ్చెయ్యలేకపోయావ్?"

"యేంచెయ్యను, రాజం! వీల్లేకపోయింది."

"సరే సరే, నాకేం? యెప్పుడూ యేదో ఒకవంక చెపుతూనేవుంటావు. కొత్తబాట్లు, బంతులు వచ్చినతరవాత నువ్వు పట్టుకుని నాలుగుసార్లయినా ఆడలేదు."

పెద్దపిల్లలంతా అలసిపోయినకారణంచేత చేసేదిలేక అందరిలోకీ చిన్నవాడిని బౌలుచేయమని ప్రోత్సహించాలి. ఆ కుర్రవాడు అయిదోతరగతిలో చదువుతూ తననూ జట్టులో చేర్చుకోమని రాజంను ప్రాధేయపడితే చేర్చుకున్నారు. స్వామి కూడా అలసిపోయినప్పుడు తను బౌలుచేస్తూ ఆ కుర్రవాడిని బాటుపట్టుకోమనేవాడు. కాని స్వామి ఆ జట్టులో 'టేట్' అని పేరుపొందడంమూలాన ఆ కుర్రవాడికి జంకుగావుండేది. మళ్ళీ బాటింగు. ఆతరవాత మళ్ళీ బౌలింగు. బంతి కనిపించనంత చీకటిపడేవరకూ ఇలా సాగేది. ఆ స్థితిలో బంతి పోయిందని పుకారులేచేది. అంతా కంగారుపడేవాళ్ళు. కూచుని ఆయాసం

తీర్చుకుంటున్నవాళ్ళు లేచి బంతివెతికి తెచ్చేవాళ్ళు. ఆతరవాత ఇక ఆడవద్దని కాప్టెన్ చెప్పేవాడు. ఒకరొకరు ఆచీకట్లో కని పించకుండాపోయేవాళ్లు. స్వామి రాజం, మణిలతో కలిసి వెళ్ళే వాడు. ముగ్గురూ రాజంఇంటిప్రహరీగోడమీద కూచుని చీకటి పడి, మాస్టరువచ్చాడని జవానువచ్చి రాజంకు చెప్పేవరకూ ఆనాటి ఆటనుగురించి చెప్పుకునేవారు.

## II

ఒకనాటి సాయంకాలం క్రికెట్టుఆటనుంచి స్వామినా థన్ ఇంటికి తిరిగివచ్చాడు. మనసు బాధించసాగింది. బడినుంచి ఇంటికి వెళ్ళి పుస్తకాలు పడవేసి క్రికెట్టుకు వెళ్ళేముందు ఒక చిన్న గొడవ జరిగింది. పుస్తకాలు పడవేసి వంటింటిలోకి పరు గెత్తబోతూంటే వాళ్ళనాయనమ్మ, "స్వామీ! స్వామీ! కొంచెం యిలారా" అని కేక వేసింది.

"ఉహుఁ-రాను" అని మామూలు ప్రకారం చెప్పి, ఒక్కనిమిషంలో ఆవిడకు కనిపించకుండా వంటింటిలోకి వెళ్ళి, కాఫీ తొందరతొందరగా తాగసాగాడు. కాని నాయనమ్మ వణుకుగొంతుతో పిలవడం వినిపిస్తూనేఉంది. ఆమెగొంతు జాలి గొలుపుతోంది. ఎవరూపలకకపోయేసరికి అతని మనస్సు కరి గింది. కాఫీ తాగీతాగగానే ఆమెదగ్గిరికి వెళ్ళి "యేంకావాలి నాయనమ్మా?" అని అడిగాడు.

ఆమె తలపైకెత్తి చూసి కూర్చోమని చెప్పింది. దాని మీద స్వామినాథన్‌కు కోపంవచ్చి అంతకుముందు కలిగినజాలి కాస్తా మాయమయింది. "చెప్పదలచిందేమిటో తొందరగా

చెప్పేసెయ్; లేదూ నేను వట్టి చవటనుమాత్రం కాదనుకో..."
అన్నాడు.

"యిదిగో. ఆరుపైసలు యిస్తాను. మూడుపైసలు నువ్వు తీసుకుని తతిమ్మా మూడుపైసలుపెట్టి నిమ్మకాయలు తీసుకురా" అని చెప్పింది నాయనమ్మ. మనమడిసంగతి బాగా ఎరుగునుకాబట్టి, మెల్లిగా, తెలివితేటలుగా ఈ విషయం చెప్పాలని అనుకుంది. కూర్చోమనడంలోనే ఈ ఎత్తు ప్రారంభమయింది.

అవును, కాదు అని చెప్పకుండా స్వామినాథన్ పైసల కోసం చేయిచాచాడు. నాయనమ్మ పైసలు ఇస్తూ "పది అంకెలు లెక్కపెట్టేసరికి తిరిగిరావాలి" అంది. తొందరగా తిరిగిరావాలని చెప్పేసరికి స్వామినాథన్‌కు కోపంవచ్చి పైసలు కిందపారవేసి "అంతతొందరగా కావలసివస్తే నువే స్వయంగా వెళ్లి తెచ్చుకో" అన్నాడు. అప్పటికే అయిదున్నరగంటలు కావచ్చింది. సూర్యాస్తమానం కాకముందే ఆటస్థలానికి చేరుకోవాలని అతని ఉద్దేశం. ఆటనుంచి తిరిగివచ్చింతరవాత తేవడమో లేకపోతే అసలు తీసుకురాకుండాఉండడమో ఏదో ఒకటి తేల్చుకోమని చెపుతున్నట్లు మొహం ముడుచుకుని నిలబడ్డాడు. "నాకు కడుపులో చెడ్డ నెప్పిగా వుంది. పరుగెత్తుకు వెళ్ళి తొందరగా తీసుకురా" అంది. కాని ఆ మాటలు వినిపించుకోకుండానే స్వామినాథన్ పరుగెత్తుకు వెళ్ళిపోయాడు.

ఆటసరదాతీరి స్నేహితులను పంపించి, గ్రోవ్, వినాయక మొదలివీధికూడలిలో నిలబడ్డాడు. నాయనమ్మ జ్ఞాపకం వచ్చింది. ఆమెఎడల తప్పుచేశానని బాధపడ్డాడు. సరిగ్గా ఆసమ

యంలోనే ఆమె కడుపునెప్పితో ఎంత బాధపడుతోందో! మొహంతిప్పుకుని ఆమె దీనంగా కన్నీళ్ళుపెట్టుకోవడం జ్ఞాపకం వచ్చి మనసు చివుక్కుమంది. తనను తాను దొంగనని, కృతఘ్నుడనని, గుండెలేని దుష్టుడనని నిందించుకున్నాడు.

ఇలా తనను తాను నిందించుకుంటూ ఇంటికి వెళ్ళి, నాయనమ్మపక్కలో కూచుని ఆమెకేసి చూడసాగాడు. కాని అలాచూడడం అతనికి అలవాటులేదు. ప్రతిసాయంకాలం బడి నుంచి ఇంటికి రాగానే వంటింట్లోకి ఉరుక్కుంటూవెళ్ళి వంటవాడిని వేధించేవాడు. కాని ఆకలికేమొచ్చిందిలే అనిపించింది అతనికి.

నాయనమ్మ పడుకునే నడవలో దీపంలేదు. హాలులోని దీపంవెలుగుమాత్రం కాస్త పడుతూంటుంది. ఆ సగంసగం చీకటిలో ఆమెమొహం స్పష్టంగా గోచరించడంలేదు. ఆమె మెదలకుండా పండుకునిఉంది. కడుపునెప్పితో చచ్చిపోయిందేమోనన్న అనుమానం స్వామినాథన్‌కు పెద్దగా కలిగింది. గొంతును అదుపులోపెట్టుకుని "నాయనమ్మా! నెప్పి యెలావుంది?" అని అడిగాడు. నాయనమ్మ కదిలి, కళ్ళుతెరిచి, "స్వామీ! వచ్చావా! అన్నంతిన్నావా?" అని అడిగింది.

"యింకా తినలేదుగాని, నీ కడుపునెప్పి యెలావుంది నాయనమ్మా?"

"పరవాలేదు. తగ్గిందిలే."

"నిమ్మకాయ వచ్చిందా?" అని జంకకుండా అడగడానికి ఎంతో శ్రమపడవలసివచ్చింది. ముందు ఆ సంగతి తెలుసుకోవాలి. నిజంగా ఆ విషయంలో అతనికి ఆదుర్దాగా

ఉంది. ఈ ప్రశ్నకు నాయనమ్మ వెంటనే జవాబిచ్చింది. కాని స్వామినాథన్‌కుమాత్రం అది ఒక యుగంగా తోచింది. ఈలోపున ఏమయినా జరగవచ్చు. ఆమె ఏమయినా అనవచ్చు. తిట్టవచ్చు. తనతో తెగతెంపులుచేసుకోవచ్చు. వెళ్ళి వేళకు నిమ్మకాయ తీసుకువస్తే బతికేదానిని, కొద్దినిమిషాలలో చచ్చేపోబోతున్నానని నిందించవచ్చు. కాని ఆమె "నువ్వు వెళ్లకుండా మంచిపనిచేశావు. మీ అమ్మ వంటింటో డజను నిమ్మకాయలు దాచి వుంచింది." అంది.

ఈ శుభవార్తవిని స్వామినాథన్ అపరిమితంగా సంతోషించాడు. ఆ సంతోషాన్ని మాటలతో వెలడించాడు. "నాకు కొత్తపేరు పెట్టారు, విన్నావా? ఓేటక్!"

"యేవిఃటీ?"

"ఓేటక్!"

"శేటక్ యేవిఃటి?" అని అమాయకంగా అడిగింది.

స్వామినాథన్ అనుకున్నట్టుగా రెండువిధాల జరగలేదు. అతని కొత్తబిరుదునుగురించి ఆమెకు తెలియదు. పైగా చెప్పినా దాని గొప్పతనం అర్థంచేసుకోలేదు. ఇంకెపుడయినా అయితే ఆమెమీద అరిచేవాడే గాని ఇప్పుడే పశ్చాత్తాపపడిఉన్నాడేమో దయ ఉట్టిపడేటట్లు "ఓేటక్ అంటే యేమిటో నీకు తెలియదంటావా?" అని అడిగాడు.

"నువు చెప్పేదేవిఃటో నాకు తెలియడంలేదు"

"ఓేటక్ గొప్పగా క్రికెట్టు ఆడతాడు. యీ భూప్రపంచంలోకల్లా గొప్పబౌలరు. క్రికెట్టు అంటే యేవిఃటో నీకు తెలుసుననుకుంటా"

"యేఁవిటి?" అని అడిగింది నాయనమ్మ. ఈ మాత్రం కూడా నాయనమ్మకు తెలియకపోయేసరికి స్వామినాథన్ నిర్ఘాంతపోయాడు. "నాయనమ్మా! నీకు నిజంగా క్రికెట్టు అంటే యేవిఁటో తెలీదా? లేకపోతే నన్ను ఆడిస్తున్నావా?"

"నువు చెప్పేదేఁవిటో నాకు అర్థంకావడంలేదు."

"నీకు అగ్థంకావడంలేదు, అర్థం కావడంలేదు" అని మాత్రం అనకు. మీ రోజుల్లో మొగపిల్లలు ఆడపిల్లలు సాయంకాలంపూట ఏం చేస్తుండేవారో ఆశ్చర్యంగావుంది. యిరవయినాలుగుగంటలు పూజలు చేస్తుండేవారా?"

ఒకసెకండు ఆలోచించాడు. అక్కడ నాయనమ్మ అజ్ఞానంలోపడి కొట్టుకుంటోంది. ఆమెను రక్షించడం అతని విధి. క్రికెట్టుఆట నియమాలు, ఆదర్శాలు, పరమార్థం, ఆ ఆటలో పేరుపొందిన మహామహులనుగురించి చిన్న ఉపన్యాసందంచాడు. నాలుగేసిసెకండుల కొకమారు అర్థమయిందా అని అడిగాడు. అతనుచెప్పిందాంట్లో ముప్పాతిక మూఁడుమీసాలు అర్థంకాకపోయినా అర్థమయినట్టు ఆమె తల ఊపింది. యం. సి. సి. చరిత్ర, రాబోయే కీర్తి వర్ణించిచెప్పి ఉపన్యాసం ముగించాడు. "రాజం లేకపోతే మేం యేమయే వాళ్ళమో!"అన్నాడు స్వామినాథన్, "యీ జట్టుకోసం వందలకొద్దీరూపాయలు ఖర్చుపెట్టాడు. బాట్లు, బంతులు కొనడం తేలికేంగాదు. అతనిపెట్టెలో కావలసినంత డబ్బుంది. మాజట్టుసంగతి గవర్నమెంటుకుకూడా తెలుసు. నీకిష్టమయితే, యం. సి. సి. పేర వుత్తరం రాసి చూడు. వెంటనే మాకు అందుతుంది. మాల్గుడిలోవున్న కప్పులన్నీ మేమే గెలిచేసు

కుంటాం. కొద్దికాలంపోయిందంటే క్రికెట్టంటే యేవిటో మదరాసువాళ్ళకికూడా చూపిస్తాం. అంతేగాక ఇంకో ముఖ్య విషయంకూడా చెప్పి ముగించాడు. "మాజట్టులో యెవడు పడితేవాడు ఆటగాడవుతాడనుకోకేం !"

వాళ్ళనాన్న పసిపిల్లవాడిని ఎత్తుకుని వెనక నిలబడి, "యేవిఁటి ఉపన్యాసందంచేస్తున్నావు, అబ్బీ !"అని అడిగాడు.

తండ్రి అక్కడకురావడం స్వామినాథన్ చూడలేదు. "యేంలేదు, యేంలేదు నాన్నా !"అంటూ వికారంగా మొహం ముడుచుకున్నాడు.

"ఊఁ, చెప్పు"

"అబ్బే ! యేంలేదు. నాయనమ్మ క్రికెట్టుసంగతులు చెప్పమంది, చెపుతున్నాను. అంతే !"

"అలాగా ! అమ్మకి ఆటలంటే యిష్టమని నాకుతెలీదు. అమ్మా ! స్వామి క్రికెట్టువిషయమంతా నీబుర్రలోకి ఎక్కించా డనుకుంటా !"నాయనమ్మ అంది. "పిల్లవాడిని గొడవపెట్టకు. వాడికి నేనంటే యెంతో యిష్టం. చాలా చాలా సంగతులు చెపుతున్నాడు. నీ కీ అలవాటులేదు. మీరంతా గొప్పవా ళ్ళాయె..."

తండ్రి చంటిపిల్లవాడిని చూపిస్తూ "నాలుగు రోజులు ఆగు. వీడుకూడా యీప్రపంచంలోని వేదాంతం,రాజకీయాలు నీకు నూరిపోస్తాడు." అని మెల్లిగా పిల్లవాడి బుగ్గలుపిసికాడు. పిల్లవాడు సంతోషంతో కీచుకీచుమన్నాడు. "అదిగో అప్పుడే వుపన్యాసం మొదలెట్టాడు. అమ్మా ! శ్రద్ధగా విను." నాయ నమ్మ పిల్లవాడిని తీసుకుందామని చేతులుచాచింది. కానితండ్రి

పిల్లవాడిని గట్టిగాపట్టుకుని "ఉహుం, నేను వీడికోసమే తొందరగా యింటికివచ్చాను. యివ్వను. స్వామీ! అన్నం తిందాం పద. మీ అమ్మ యేదీ?"

## III

కాప్టెన్ స్వామినాథన్ చర్యలు ఆమోదించలేదు "స్వామి! నువు ఆటవిషయంలో శ్రద్ధతీసుకోవడంలేదు. ప్రాక్టీసు చెయ్యడంలేదు."

"దీనికంతా కారణం యీ బోరుస్కూలు చదువు."

"అందులో యెవడు చేరమన్నాడు. వాళ్ళబొట్టు కాటుక పెట్టి నిన్నేం పిలవలేదే! సరేగాని, ఒక్కవిషయం చెపుతా విను. బ్రాడ్‌మన్, టేట్ మొదలయినవాళ్ళంతా రోజూ నాలుగుగంటలన్నా ప్రాక్టీసుచేస్తారు. నువు వాళ్ళకంటె మొనగాడివా?"

"కాప్టెన్! నే చెప్పేదికూడా విను. 5 గంటలకల్లా రావడానికి యత్నిస్తాను. కాని బోర్డుస్కూలు టైం టేబిలు అదోరకమయింది"

"ఏదో ఒక మార్గం కనిపెట్టాలి" కాప్టెన్ సూచించాడు "పందాలు పూర్తయేవరకు డ్రిల్లుకు శెలవు యివ్వమని మీ హెడ్డుమాస్టర్ని అడగరాదూ?" స్వామి "చెప్పడం తేలికే. చేయడం కష్టం" అన్నాడు హెడ్డు మాస్టరు కళ్ళజోడు, వికారమయిన మొహం కళ్ళకు కట్టగా. "ఆ రాక్షసుడిని అడగడానికే భయంవేస్తుంది. కలకాలం నన్ను రెండోఫారంలోనే అట్టేపెట్టొచ్చు."

"నిజం! నీకు హెడ్మాష్టరంటే అంత భయమా? పోనీ నేనువచ్చి చెప్పనా?"

"ఊహుఁ, వద్దు కాప్టెన్. ఆయనెంత విషప్పాచో నీకు తెలీదు. నిన్ను సరిగా చూడకపోవచ్చు. నీ ముందు కాక పోయినా నువు వెళ్ళిపోయిన తరవాత నన్ను చంపేస్తాడు"

"యేమిటి స్వామీ! యిలాంటి ఆలోచనలు యెక్కువయినాయి! యిలాఅయితే యెలా? ఆట మొదలుపెట్టి రెండు నెలలయింది. నువు పట్టుమని పదిరోజులు ఆడకపోతివి"

మణి అన్నాడు "మీ హెడ్మాస్టరు యేం చేస్తాడో చూదాం. సరేనంటాడో లేదో చూద్దాం. నిన్ను చంపితే వాడిచర్మం వొలిచేస్తాను. నా దుడ్డుకఱ్ఱ పనిలేకుండా పడి వుంది."

రాజం ఆ మర్నాడు బోర్డుస్కూలుకు వచ్చి, హెడ్డు మాస్టరుతో మాటాడతానని పట్టుపట్టాడు. తన క్లాసులు పోయినా సరే అన్నాడు. మణికూడా వస్తానన్నాడు గాని, రాజం అంగీకరించలేదు.

మర్నాడు ఉదయం 9½ గంటలకు స్వామినాథన్ కళ్ళు ఎఱ్ఱపడేదాకా నులుముకుని తలనొప్పివచ్చిందని చెప్పాడు. వాళ్ళనాన్న కణతలుపట్టిచూసి నుదురుమీద కాసిని చన్నీళ్లు కొడితే తగ్గిపోతుందని చెప్పాడు.

"సరే నాన్నా!" అని స్వామినాథన్ బయటికి వెళ్లి పోయాడు. తండ్రిగదిఅవతల నిలబడి తలనెప్పి రావాలని కోరుకుంటుంటే, చన్నీళ్ళుకొట్టుకోవడమా అనుకున్నాడు. హెడ్మాస్టరుతో మాటాడడానికి ఎలాగూ రాజం వస్తు

న్నాడు. ఆ ఉదయం బడికివెళ్ళడం మంచిదికాదు. అందుకని లోపలికివెళ్ళి "చన్నీళ్ళనేనా చెప్పావు? అని అడిగాడు.

"అవును."

"చన్నీళ్ళుకొట్టుకుంటే ఏ నిమోనియాజ్వరమో రాదూ? పైగా జ్వరంతగిలినట్లుంది."

తండ్రి నాడిచూసి, "బడికి పరుగెత్తు, తగ్గిపోతుంది." అన్నాడు. రాతిలోనుంచి నీళ్ళయినా పిండవచ్చుగాని బడి మానడానికి ఆయనఅనుమతి పొందడం కష్టం.

నాయనమ్మచెవిలో స్వామినాథన్ అన్నాడు: "నాయనమ్మా! నేను చచ్చిపోయినా నాన్న నాశవాన్ని బడికి పంపించాల్సిందేనని పట్టుపట్టికూచుంటాడు."

నాయనమ్మ "తప్పు. అలా అనకు" అంది.

"నాయనమ్మా! జ్వరం పేలిపోతోంది. తల పగిలిపోతోంది. అయినా బడిమానకూడదట!"

నాయనమ్మ "పోనీ బడికి వెళ్ళొద్దులే"అని స్వామినాథన్‌తల్లిని పిలిచి, "వీడికి కాకతగిలింది. బడికి వెళ్ళకపోతేనేం?"అంది.

"కాక తగిలిందా?" అని తల్లి ఆదుర్దాగా అడిగి పాడా విడిచేసింది. ఒళ్ళుతాకిచూసి కాకతగిలినమాట నిజమే అంది. స్వామినాథన్ జాలిపుట్టేటట్టు, "అమ్మా! కాసిని పాలిచ్చి పంపు. బడివేళయింది" అన్నాడు. కాని తల్లిమాత్రం బడికివెళ్ళడానికి వీల్లేదని ఖండితంగా చెప్పింది. "కాని నాన్న సరే అనొద్దూ?" అన్నాడు స్వామినాథన్ మెల్లగా. ఆమె స్వామిని

పక్కమీదపండుకోమని గబగబ భర్తగదిలోకి వెళ్ళి "స్వామికి జ్వరంతగిలింది బడికి వెళ్ళలేడు." అన్నది.

"టెంపరేచరు యెంతవుందో చూశావా ?"

"యింకా చూడలా. ఒకరోజున బడికి వెళ్ళకపోతే మించిపోయిందేమీలేదు" అన్నది.

"యేమయినా టెంపరేచరు చూడు" అన్నాడు. తను అన్నమాటలోని ఎగతాళి ఆమె కనిపెట్టేస్తుందేమోనని, "మరేం లేదు, టెంపరేచరుచూస్తే డాక్టరుకు కబురుపెట్టడం అవసరమో లేదో తెలుస్తుంది" అన్నాడు.

స్వామినాథన్ నోట్లో థర్మామీటరు ఉంచి తీసిచూస్తే నార్మలుఉంది. తల్లి థర్మామీటరువంక చూసి మళ్ళీ స్వామి నోట్లోపెట్టి తీసిచూసింది. మళ్ళీ నార్మలే. భర్తకు చూపింది. "అవును, నార్మలే" అని ఎత్తిపొడుపుగా 'నాకు ముందే తెలుసు' అన్నాడు. కాని తల్లి మాత్రం ససేమిరా ఒప్పుకోలేదు. "థర్మామీటరు చెడింది. పిల్లవాడికి జ్వరం వుండిపోతోంది. జ్వరం నూరూ పాయింటు రెండు వుంటుంది" అంది.

"వుండచ్చు"అన్నాడు తండ్రి.

కళ్ళుమూసుకుని హాయిగా పక్కమీద పండుకున్నాడు స్వామి. అడుగులచప్పుడుతో కళ్ళుతెరచి చూశాడు. తండ్రి అతనిమీదికి వంగి చూస్తూ, మెల్లిగా " అదృష్టవంతుడివిరా బాబూ ! బడికి వెళ్ళదలచుకోనప్పుడు నీపట్టువలికేవాళ్లు వున్నార్రా నీకు !"అన్నాడు. స్వామి కళ్ళుమూసుకుని, సన్నగా మూలుగుతూ గోడవేపు తిరిగాడు.

మధ్యాహ్నానికి పండుకునీ పండుకునీ, విసుగెత్తింది.

సాయంకాలందాకా పండుకోవడం ఎలా భగవంతుడా అని భయపడ్డాడు. అంతేగాదు, ఉదయాన రాజం బడికివచ్చి ఉంటాడు.

తల్లి దగ్గిరికి వెళ్ళి బడికివెళతానని చెప్పాడు. కాని ససేమిరా వీల్లేదంది. ఒళ్ళంతా తడిమిచూసి జ్వరంతగ్గినట్లుంది. గాని, ఇంకా బడికివెళ్ళేటంత ఇదిగా లేదన్నది. "ఓ, బాగానే వుందమ్మా గొడవచెయ్యకు" అన్నాడు

బడికివెళ్ళేత్రోవలో రాజం, మణి కలిశారు. మణి చంకలో దుడ్డుకర్ర ఉంది. వీళ్ళిద్దరూ కలసి ఏదో కొంపముంచారని భయపడ్డాడు.

రాజం, "బలేవాడివే! వుదయం యెక్కడికి వెళ్ళావు?" అని అడిగాడు.

"హెడ్డుమాస్టరును కలుసుకున్నావా రాజం ?"

"యింకా లేదు. నువు రాలేదనే కలుసుకోలేదు. ఆయన్ని కలుసుకునేటపుడు నువు నాతో వుండాలి. యిదంతా మనందరిపని గదా !"

"మణి యిక్కడేం చేస్తున్నాడు ?" అని అడిగాడు. స్వామినాథన్.

"నాకేం తెలుసు? దుడ్డుకర్రపుచ్చుకుని మీబడిముందు కనిపించాడు"

"మణీ ! బడికి వెళ్ళలేదేం ?"

"యేమో వెళ్ళలేదు."

"సరేగాని, ఆ దుడ్డుకర్ర యెందుకు ?" అని అడిగాడు స్వామి.

"యేమిటో వూరికినే తెచ్చాను."

"బడికివెళ్ళి నీ చదువుసంగతి చూసుకోమని నిన్న నేను చెప్పలా?" అన్నాడు రాజం.

"యేమో, జ్ఞాపకంలేదు. నీతో వస్తానంటే వద్దన్నావు. యిపుడు నీవెంట నేనేం రాబోవడంలేదులే. నేను దోవంట వచ్చాను. నువా దోవంట వచ్చావు. ఇది రాజమార్గం." కాని మణిహాస్యాన్ని వాళ్ళు పట్టించుకోలేదు. హెడ్డుమాస్టరును కలుసుకునేవిషయమయిన ఆలోచనలలో మునిగిఉన్నారు.

"మీారేం గాబరాపడకండి" అన్నాడు మణి—

"మీాకేంచిక్కులు రాకుండా నేనున్నాగా. మీారు ఒప్పుకుంటే హెడ్డుమాస్టరుతో నేను మాటాడతాను."

"ఆయనగారిగదిలోకి అడుగుపెట్టావో పోలీసుని పిలిపిస్తాడు."అన్నాడు స్వామినాథన్.

బడిదగ్గిరికి చేరుకున్నాక మణిని వెళ్ళిపోనన్నా వెళ్ళు, లేదూ రోడ్డుమీాద ఉండు అన్నారు. రాజం లోనికి వెళ్ళాడు. స్వామికూడా అతనివెనకాలే వెళ్ళకతప్పిందికాదు.

రెండుచేతులమధ్య తలపెట్టుకుని, మోచేతులు బల్ల మీాద ఆనించి హెడ్డుమాస్టరు నిద్రపోతున్నాడు. ఆ గది చిన్నది. ఒకేఒక కిటికీ ఉంది. మాపులు గ్లోబులు వగైరా చిందర వందరగా పడి ఉన్నాయి. హెడ్డుమాస్టరు బెత్తం బల్లమీాద పడిఉంది, సూర్యకిరణాలు ఆయనముక్కుమీాద బల్లమీాద పడు తున్నాయి. నెమ్మదిగా గురకకొడుతున్నాడు. ఇలా జరుగు తుందని రాజం అనుకోలేదు.

"అయితే యేం చేద్దాం?" స్వామినాథన్ అడిగాడు.

"ఆగిచూద్దాం" అన్నాడు రాజం.

పది నిమిషాలు ఆగి పాదాలతో మెల్లిగా చప్పుడు చేయసాగారు. హెడ్డుమాస్టరు కళ్లు తెరచి గుర్తుపట్టనివాడులా వారికేసి రెప్పలువాల్చకుండా చూశాడు. కళ్ళు నలుపుకుని, ముమ్మారు కనుబొమలు పైకెత్తి నిద్రమత్తుగొంతుతో "క్లాసు లేదా ?" అని అడిగాడు. కళ్ళజోడు కోసం వెతికితీసి పెట్టు కున్నాడు. ఇపుడు ఆకారం పూర్తయింది. అసహ్యంగొలిపే మొహం, మాసిన కళ్ళజోడు స్వామినాధన్‌వంటివారికి భయం గొలుపుతుంది.

"యే క్లాసు? క్లాసులేదా ?" అని మళ్ళీ అడిగాడు.

"నేను మీ బడిపిల్లవాడిని కాను" అన్నాడు రాజం.

"అలా అయితే యెక్కడినించి వూడిపడ్డావు ?"

"నేను యం. సి. సి. కాప్టెన్‌ను. మీతో పనివుండి వచ్చాను."

"యేం పని ?"

"యితను మీ బడిలో సెకండు సి లో చదువుతున్నాడు."

"చాలా సంతోషం" అన్నాడు హెడ్డుమాస్టరు స్వామినాధన్ కేసి తిరిగి. బోర్డుహైస్కూలుకు అంతపేరు ఎందుకువచ్చిందీ అపుడు ఊహించాడు రాజం.

"నేను యం. సి. సి. కాప్టెన్‌ను."

"చాలా సంతోషం..."

"యితను మా జట్టులో ఆడుతున్నాడు. మంచి బౌలరు"

"అవునా ?" అన్నాడు హెడ్డుమాస్టరు స్వామినాధన్ కేసి తిరిగి.

"అసలు విషయానికి వద్దాం" అన్నాడు రాజం.

"అలాగే అలాగే. తప్పకుండా"

ఇతను మంచి బాలుడేగాని యింకా ప్రాక్టీసు అవసరం. ప్రతీ రోజూ నాలుగున్నర దాటింతరవాత కూడా బడిలో వుండడం మూలాన పెందలాడే ఆటకు రాలేకపోతున్నాడు."

"అయితే నన్నేం చెయ్యమంటావు ?"

"నాలుగున్నరకు పంపించేయకూడదూ ?"

హెడ్డుమాస్టరు కుర్చీలో జేరగిలిబడి మాటాడకుండా కూచున్నాడు.

"యేమంటావు ? నాలుగున్నరఅవగానే పంపించేస్తారా ?"

"యీ స్కూలుకు హెడ్డుమాస్టరును నేనా నువ్వా ?"

"మీరే హెడ్డుమాస్టరు. ఆల్బర్ట్‌స్కూలులో నాలుగున్నరదాటింతరవాత ఒక్కనిమిషమయినా అట్టేపెట్టరు. ఆటలుఆడితే డ్రిల్లుచేయనక్కరలేదు."

"ఆ మూలస్కూలు పొగడ్త వింటానికి నే నిక్కడ కూచోలేదు. వెళ్ళిపో."

అప్పటివరకూ బయట కాచుకునిఉన్న మణి వ్యవహారం ముదిరిందని అనుమానంవేసి హెడ్డుమాస్టరుగదిలోకి చక్కా వచ్చాడు.

"వీడెవడు ?"అని హెడ్డుమాస్టరు అడిగాడు మణివంక కోరచూపుచూస్తూ, "యేంకావాలి ?"

"యేమీ అక్కర్లేదు"అని మెదలకుండా ఓమూల నిలబడ్డాడు మణి.

"పనీపాటాలేనివాళ్ళంతా నాగదిలోకి యెందుకువస్తారో !"

"నేను పోలీసుసూపర్నెంటుకొడుకుని" అన్నాడు రాజం హఠాత్తుగా.

"అలాగా ! అలాఅయితే రౌడీవెధవలు లోపలికివచ్చి అద్దాలుపగలగొట్టినరోజున , మీ నాన్న యేంచేస్తున్నాడో కనుక్కో....వాడిచేతిలోది యేవిటి ?"

"దుడ్డుకర్ర" అని మణి జవాబిచ్చాడు.

"దాంతో బుర్రలుపగలగొడతాడు. – మణీ, స్వామీ ! వెళదాం రండి యీ పిచ్చివాడితో యేవిటి!" అన్నాడు రాజం.

# పదిహేనవ ప్రకరణం

## పోటీఆటకుముందు

యం. సి. సి. సరదాగా పోటీఆట ఆడదాం రమ్మని యంగ్‌మన్స్ యూనియన్‌ను సవాలుచేసింది. ఆ సవాలును యూనియన్ అంగీకరించింది. ఈ యూనియన్‌జట్టు రీడింగు రూము వెనక ఖాళీస్థలంలోగాని ఆ స్థలయజమాని అభ్యంతర పెడితే కులాంపీధినడిమధ్యనగాని విసుగూవిరామంలేకుండా ఆడుతూంటారు. ఈ పోటి పేరుకుమాత్రమే పోటీ. యం. సి. సి. సవాలులో కజ్జాకోరుతనం, బెదిరింపు దాగిఉన్నాయి.

ఇందులోని షరతులుకొన్ని ఘోరమయినవి. మొదటి షరతు ఆటగాళ్ళంతా సరిగ్గా మధ్యాహ్నం పదకొండుగంటలకు ఆటస్థలంలో ఉండాలని. రెండు: ఎవరిబాట్లు వారు తెచ్చుకోవాలి. దుంగలుమాత్రం యం. సి. సి. దయతో ఇస్తుంది. ఇక మూడోషరతు: స్పష్టంగా షరతురూపంలో లేదుగాని,

సూచనగాఉంది. స్వంతబంతులు రెండయినా తెచ్చుకుని అట్టేఉంచుకోవాలి. 'మీా ఆటగాళ్ళు వాళ్ళస్వంతబంతులనే కొట్టాలిగాని, మావాటిని పగలగొట్టరాదు'అనే కారణం చూపబడింది. ఆతరవాతషరతు: కావలిస్తే మధ్యాహ్నభోజనం ఎవరికి వాళ్ళే తెచ్చుకోవాలి. ఇది మర్యాదతో కూడినషరతు గాదు. ఇక ఆఖరిషరతు చాలా చిక్కులతో కూడుకున్నది. చర్చలకు రాయబారాలకు దారితీసింది. 'బాట్లు, బంతులు, వికెట్లు విరిగిపోతే వాటిఖరీదు ఇచ్చుకోవాలి'అనేదే ఆఖరిషరతు.

"వై. యం. యు. కాప్టెన్ యీా షరతుమీాద కొంచెం తికమకపడ్డాడు. రెండు మూడు షరతులు ఎలాగూ ఉన్నాయిగదా, యీా మూడోది అనవసరం. విరగగొట్టేవి వారిస్వంతబాట్లు వగైరా. ఆ దృష్టితో చూస్తే బాట్లువగైరా విరిగితే ఖరీదుఇచ్చుకోవాలని షరతు అనవసరం. దుంగలు యం. సి. సి. వి. వై. యం. యు. రెండు మూడు షరతులకు ఖాతరు చేయడంలేదు అని చెప్పేసరికి వై. యం. యు. కాప్టెన్‌కి చెడ్డకోపంవచ్చింది. వెంటనే యం. సి. సి. అంత దరిద్రంలో ఉంటే మా ఆటస్థలంలోకి వచ్చి ఆడరాదా" అన్నాడు. కెప్టెన్ వెళ్ళిపోయిన ఇరవయి నిమిషాలకుగాని దీనికి గట్టిజవాబు వానికి తోచలేదు. రీడింగురూము వెనకస్థలంయొక్క యజమాని ఆటకు అభ్యంతరపెడితే కులాంవీధిలో ఆడాలి. కులాంవీధిలో పోటీ ఆటేమిటి? ఆఖరిషరతులలోని ఇతరనష్టాలు అంటే ఏవో చెప్పమని కెప్టెన్ వెళ్ళేముందు అడిగాడు. రాజం కొంచెంఆలోచించి యం. సి. సి. ఆటస్థలంపక్క ఇంటికిటికీలు, పెంకులు చూపించాడు.

రెండువారాలతరవాత ఆదివారంనాఁడు సరదా పోటీ ఆట ఆడబడుతుంది.

రాజంకు మనశ్శాంతిలేదు. తనజట్టు హై. యం. యు. ను తేలికగా ఓడించివేయగలదనే అతనినమ్మకం. ఎవరు ఎలా ఆడినా తానుమాత్రం గట్టిగా ఆడి ఓడించేయగలడు. మణిఆట డాబుగావుండకపోయినా నిలకడగా ఉంటుంది. అవస రమయితే బంతిని తలతో ఆపివేయగలడు. బాటింగు అంత అధ్వాన్నంగాదు. అదోవిచిత్రమయినపద్ధతి. వికెట్టుదగ్గిరికి రానీ యకుండా ఆపి, ఎటువంటిబౌలరునయినా ముప్పతిప్పలు పెట్టగ లడు. తక్కినవాళ్ళనుగురించి ఆలోచించనవసరంలేదనుకు న్నాడు రాజం. ఒకఆటగాడిమూలంగా అతనికి రాత్రింబగళ్ళు ఆదుర్దాగాఉంది. అతనిమీద గొప్ప కర్తవ్యం, బాధ్యత ఉన్నాయి. ఆ జట్టుకు అతను కేటెన్‌వంటివాడు. పోటీజట్టులోని పదకొండుమందిని 'బౌల్ ఔటు' చేయాలి. కాని అతనివాలకం చూస్తే ఆ నమ్మకంలేదు. పదిహేనురోజులే ఉంది పోటీఆట. అయినా ప్రాక్టీసుచేయాలనేలేదు. చీకటిపడినతరవాత ఆటకు వచ్చే అలవాటు మానలేకపోయాడు. "స్వామి! సాయం కాలంపూట కనీసం గంటసేపయినా ప్రాక్టీసుచేద్దాం" అని రాజం బతిమాలుకున్నాడు.

"తప్పకుండా రాజం! యేదోఒకమార్గం కనిపెట్టు."

"హెడ్డుమాస్టరుతో చెప్పకూడదూ..."

"ఊహూఁ— యీ సూచన బాగానేవుందిగాని, యిక ఆవిషయం ఆలోచించవద్దు. కిందటిసారి నువు రావడం ఆయన యింకా మరచిపోలేదు."

"మరిచేపోళపోతే పోనీ. నాకుకావలసిందల్లా నీప్రాక్టీసు. యెవరినయినా అయిదునిమిషాలు ఆడనిచ్చానో, యిక నీమొహం చూడను. స్కూరువిషయం నువు పట్టించుకోనక్కర్లేదు. దానిసంగతి మేం చూసుకుంటాం."

## II

ఇక పోటీ ఆట ఏడురోజులు ఉందిఅనగా సాయంకాలాలు వృథాపోనీయకూడదని గుర్తించాడు స్వామినాథన్. సాయంకాలం గంటకొట్టగానే డ్రిల్లుకు అందరితోపాటు వరసలో నిలబడేవాడు. కాని కోటు, టోపీ తీసివేసేవాడుకాదు. తక్కినపిల్లలంతా షర్టులు మాత్రమే ఉంచుకుని, ధోవతులు పైకి దోపుకునేవాళ్ళు. డ్రిల్లు మాస్టరు సమమట్టంగాఉంటాడు. రొమ్ము ముందుకు పొడుచుకువస్తున్నట్లుంటుంది. మెలితిరిగిన పెద్దపెద్దమీసాలు. మిలిటరీవాళ్ళలాగా సిల్కు తలపాగా చుట్టుతాడు. కెమేరాముందు నిలబడ్డట్టు నిలబడి, పిల్లలందరినీ ఎగాదిగా చూశాడు. మానేటరు నూనె అంటిన హాజరుపట్టీలో పిల్లల పేర్లు చదివాడు. హాజరుపట్టీ వేసుకున్నతరవాత డ్రిల్లుమాస్టరు పిల్లలదగ్గిరికివచ్చి ఒకొక్కక్కపిల్లవాడిని ఎగాదిగాచూస్తూ, ఆ చివరనుంచి ఈ చివరకు నడిచివెళ్ళాడు. స్వామినాథన్ పొట్టివాడేమో చివర నిలబడి ఉన్నాడు. డ్రిల్లుమాస్టరు అతనిముందు నిలబడి "శెలవుయిచ్చేదిలేదు. కోటు, టోపీ తీసేయి" అని గొణుక్కుంటూ ముందుకు సాగాడు. స్వామినాథన్‌కి ఆశ సన్నగిలింది. "నా ఆరోగ్యం యేమీ బాగుండలేదు. యివాళ డ్రిల్లు చెయ్యలేను. చేస్తే ప్రాణంపోతుంది. అందుకని నాకు..." అంటూ డ్రిల్లుమాస్టరువెంటపడ్డాడు.

డ్రిల్లుమాస్టరు ఆఖరిపిల్లవాడి దగ్గిరికి వెళ్ళినా స్వామి నాధన్‌మాత్రం వదలలేదు. స్వామినాధన్ వేపు గిర్రున తిరిగి మండిపడుతూ "యేవిఁటిసంగతి?"అని అడిగాడు.

"సార్! నా కష్టాలు మీరు గ్రహించడంలేదు. దేనితో బాధపడుతున్నావని అడగనన్నా అడిగారుకాదు."

"అవునవును, యిపుడు నీకువచ్చినబాధ యేవిఁటి?

తలనెప్పి అని చెబుదామనుకున్నాడు స్వామి. కాని తలనెప్పి ఎంత బద్దలుకొడుతోందని చెప్పినా డ్రిల్లుమాస్టరు వినిపించుకునేధోరణిలో లేడని గ్రహించాడు. ఆవేశంతో "రాత్రల్లా నేను సంధికొట్టి పేలుతున్నాను." అన్నాడు ఈ మాటవిని డ్రిల్లుమాస్టరు తెల్లబోయాడు. "సంధి! నీకేమయినా మతిపోయిందా?"

"లేదు సార్! రాత్రి కంటిమీదకునుకులేదు. సంధి పుట్టింది. మా డాక్టరు చెప్పాడు: 'వారంరోజులపాటు డ్రిల్లు మానేయకపోతే అన్యాయంగా చచ్చిపోతావు అని'".

"పో గాడిద! నీమాట ఒక్కటీ నమ్మను. నువు మొండిపీనుగవి పో!"

డ్రిల్లునుంచి క్రికెట్టుఆటస్థలానికి చేరడానికి అరగంట పట్టింది. రొప్పుకుంటూ పరుగెత్తుతూ వెళ్ళాడేమో అంతా మసకమసకగా కనిపించింది. స్వామినాధన్ పెందలాడే వచ్చే సరికి అంతా సంతోషించారు. రాజం సంతోషంతో గంతులువేశాడు.

అంతా సవ్యంగానే జరిగిపోతుంది. కాని డ్రిల్లుమాస్టరు ఎక్కడ గుట్టు కనిపెట్టివేస్తాడోననేభయంమాత్రం స్వామి

నాథన్‌ను పట్టుకుంది. అందుకని ఆటపూర్తిఅయినాక స్వామి రాజంతో వాళ్ళఇంటికి వెళ్ళి బాగా చీకటిపడేవరకూఉండి పోయాడు. ఆ తరవాత దీపాలకాంతిని తప్పించు కుంటూ ఇంటికి చేరుకున్నాడు.

ఆ మరునాటిఉదయం డ్రిల్లుక్లాసు తప్పించుకోవడానికి ఎత్తు ఆలోచించాడు. వ్యాకరణం ముందువేసుకుని కూచు న్నాడు. 7½ గంటలే అయింది. బడికి ఇంకా 2½ గంటలు వ్యవధిఉంది·

జాగ్రత్తగా అటూ ఇటూ చూశాడు. ఉయ్యాలకిర్రు శ్రావ్యంగా వినిపిస్తోంది. అంటే తల్లి పసిపిల్లవాడిగదిలో ఉన్న దన్నమాట. ముందుగదిలోనుంచి తండ్రిమాట వినిపించింది. ఆయన పార్టీలవ్యవహారాలలో మునిగిఉన్నాడు. స్వామినాథన్ చల్లగా ఇంట్లోనుంచి బయటికి జారాడు.

'డాక్టర్ టి. కేశవన్, యల్. యం. అండ్ యస్., శ్రీకృష్ణ డిస్పెన్సరీ' అని బోర్డు కట్టిఉన్నచోట ఆగాడు. డాక్టరు వీధివేపు మొహంపెట్టి ఒక్కడే కూచున్నాడు. స్వామి లోపలికి వెళ్ళాడు.

"హల్లో! స్వామినాథన్! యేమిటి సంగతి?"

"మరేంలేదండి. మీతో చిన్న పనివుండివచ్చాను."

"యింట్లో అంతా బాగున్నారా?"

"నిజంచెపుతా, వినండి డాక్టర్! యంగ్‌మన్స్ యూని యన్‌మీద వచ్చేవారం క్రికెట్టు ఆడాలి. అందుకని క్రికెట్టు ప్రాక్టీసుచెయ్యాలి. ప్రతిరోజూ సాయంకాలం డ్రిల్లుక్లాసో, స్కౌటుక్లాసో యేదో ఒక వెధవక్లాసు వుంటోంది. నాలుగున్న

రకల్లా పంపించివేయాలని నాకో సర్టిఫికెట్టు మీరు యిస్తే యం. సి. సి. గెలవడానికి సహాయంచేసినవారవుతారు"

"సరే, సర్టిఫికెట్టు యివ్వగలను. నీకు జబ్బుయేమిటి?"

"నాకుసంధిపుట్టిందనుకుంటున్నానండి"

"యేమిటి అన్నావు?" డాక్టరు ఆదుర్దాగా అడిగాడు.

తానుచెప్పింది డాక్టరుకు నచ్చిందనే భ్రమతో తనకు చాలా తీవ్రమయిన సంధిసోకిందని స్వామినాథన్ మళ్ళీ చెప్పాడు.

"అబ్బాయి! సంధిఅనే చెప్పావా? సంధిఅంటే నువ్వే మనుకుంటున్నావు?"

ఎదుపుప్రశ్న వేయడానికి ఇది తగిన సమయంకాదని స్వామినాథన్ తలచాడు. కాని డాక్టరుదయ సంపాదించాలి. అందుకని, "సంధిపుట్టింది. సరిగా అదేమిటో చెప్పలేను. అది ఒకవిధమయిన కడుపు నెప్పి కాదూ?"

డాక్టరు విరగబడినవ్వాడు. ఆ నవ్వుకు దగ్గువచ్చి ఊపిరి సలపనంతపనయింది. తరవాత స్వామినాథన్‌వంక దొంగచూపు చూసి, నాలుక పరీక్షించాడు. గుండెలమీద కొట్టిచూశాడు. "బాగా ఆరోగ్యంగానే వున్నావు. సంధిపోవాలంటే డ్రిల్లుమానను"అని సలహాఇచ్చాడు. దానిమీద స్వామి సాయంకాలం పూట డ్రిల్లుమానడం ఎంతఅవసరమో తెలియజేశాడు. అంతా విని, "అంతా బాగానేవుంది గాని, అలా సర్టిఫికెట్టు యిస్తే నన్ను జైల్లో పెడతారు"అన్నాడు డాక్టరు.

"యెవరికి తెలుస్తుంది డాక్టర్! మా యం. సి. సి. ఓడిపోవడం మీకిష్టమేనా?"

"అబ్బే! మీరు గెలవాలనే నా కోరిక. సరే, బెంబేలు

పడకు. సర్టిఫికెట్టు యివ్వలేనుగాని, మీ హెడ్మాస్టరుతో చెప్పి నిన్ను నాలుగున్నరకల్లా వదిలిపెట్టేటట్టు చేస్తాను."

"ఓ, ఆమాత్రం చాలు. మీరు నామీద చాలా దయదలిచారు డాక్టర్!"

ఆనాటిసాయంకాలం నాలుగున్నరకు స్కౌటుక్లాసుకు వెళ్ళకుండా స్వామినాథన్ క్రికెట్టుకు వెళ్ళాడు. ఆమర్నాడు డ్రిల్లుక్లాసు. దానివిషయంకూడా పట్టించుకోలేదు. బాగా క్రికెట్టు ప్రాక్టీసుచేస్తున్నాడు. రాజం అన్నాడు: "స్వామీ! బలే! నీకు కావలసిందల్లా కాస్త ప్రాక్టీసు. యింతకీ సాయంత్రం క్లాసులసంగతి యేంచేశావు?

"కాస్త బుర్ర వుపయోగించాను. నాలుగున్నర తరవాత బళ్ళోవుంటే చచ్చిపోతానని మా డాక్టరు హెడ్మాస్టరుగారికి చెప్పాడు. చెప్పడమేమిటిలే. చెప్పేటట్టుచేశాను. యేమంటావ్, యెత్తు బాగుండలా?"

మణి స్వామినాథన్ డొక్కలో పొడిచి "బలే! బుర్రంటే నీదేబుర్ర!" అని మెచ్చుకున్నాడు. రాజంకూడా మెచ్చుకున్నాడు. కాని హఠాత్తుగా బెంబేలుపడి, "గెలుస్తామో లేమో చెప్పలేం. గెలవకపోతే నా ప్రాణం పోతుంది.'

మణి అన్నాడు "రాజం! వూరికే వోడిపోతాం వోడిపోతాం అంటూంటే తలనెప్పివస్తూంది. ఆ కోతిమొహాలు మనముందు ఆగగలవంటావా?"

"మనం గెలిస్తే పత్రికలకి రాద్దాం" అన్నాడు రాజం.

"మన ఫోటోలు వేస్తారా?" అని అడిగాడు. టేట్.

"తప్పకుండా వేస్తారు."

# III

శుక్రవారంనాడు జాగ్రఫీక్లాసు జరుగుతూండగా చేత్తో పట్టుకుని హెడ్డుమాస్టరు క్లాసులోకి చక్కావచ్చాడు. క్లాసు పిల్లలందరివంక ఒక మాటుచూసి, గుడ్లగూబకళ్ళలాంటి కళ్లు స్వామినాథన్‌మీద నిలిపి "లేచి నిలబడు" అన్నాడు.

స్వామినాథన్ లేచి నిలబడ్డాడు.

"యిలా రా"

స్వామినాథన్ వెంటనే దగ్గిరికి వెళ్ళాడు.

"సిగ్గూ యెగ్గూ లేని ఆ మొహం క్లాసందరికీ చూపు."

స్వామినాథన్ మొగంచాటుచేసుకోవాలని యత్నించాడు. హెడ్డుమాస్టరు చేయిచాచి స్వామినాథన్‌మెడ పట్టుకుని క్లాసువేపుతిప్పి "యీదొరగారికి డ్రిల్లు, స్కౌటుక్లాసు లాంటి చిన్నచిన్నవిషయాలు పట్టించుకునే తీరిక లేకుండా వుంది. కిందటిసోమవారంనుంచి యీ క్లాసులకు దయచేయ లేదు." అన్నాడు. కొంటెనవ్వుతో పెదవులు విరుచుకున్నాయి. క్లాసుపిల్లలు ఈ అవకాశం తీసుకుని ముసిముసి నవ్వులు నవ్వారు. జాగ్రఫీ మాస్టరుకూడా చిరునవ్వునవ్వాడు.

"యేమండీ దొరగారు! యేమంటారు?" అని హెడ్డు మాస్టరు అడిగాడు.

ఎంతోకష్టంమీద స్వామినాథన్ గొంతుపెగల్చుకుని, "డాక్టరుగారు – డాక్టరుగారు మీతో చెప్పలేదా సార్?"

"యే డాక్టరు? యే విషయం?"

"చెపుతానన్నాడే!" అని స్వామినాథన్ మెల్లగా జవాబిచ్చాడు.

"సంగతేవిఁటో విడమర్చి చెప్పకపోతే లాగూవూడ దీయించి బాదిస్తాను."

"డాక్టరు కేశవన్ —"

"డాక్టరు కేశవన్ ?"

"నా విషయం మీతో మాటాడి డ్రిల్లు స్కౌటుక్లాసులకు శెలవు యిప్పిస్తానన్నాడు. యింకాకొన్నాళ్ళపాటు డ్రిల్లు క్లాసుకు వెళితే చచ్చిపోతాననికూడా చెప్పాడు."

"యింతకీ నీకు జబ్బేవిఁటి ?"

"యేదో ఒకవిధమయినసంధి అన్నాడు." సంధి అనే మాట వాడకూడదని డాక్టరునుచూసినతరవాత అనుకున్నాడు. కాని ఈ చిక్కుసమయంలో అలవాటుకొద్దీ నోరుజారాడు. హెడ్డుమాస్టరు డ్రిల్లుమాస్టరుకేసి తిరిగి కనుబొమలు పైకెత్తి ప్రశ్నించాడు. "నీ నోటినుంచి యింకేంముత్యాలు రాల్తాయో వినడానికి కాచుకునివుంటా"

"సార్ ! ఆయన మీతో చెప్పాడనుకున్నా. చెపుతానన్నాడు."

"నా బడిలో నా పిల్లల విషయంలో యేంచేయాలో అడుక్కుతినే ప్రతివెధవాయి చెప్పేవాడే. ఆయనగారు రాలేదు. వస్తేమెడపట్టిగెంటించేవాడిని."

డాక్టరు మోసంచేశాడని స్వామినాథన్ గ్రహించాడు. హెడ్డుమాస్టరుతో మాటాడతానంటూ డాక్టరు నవ్విన కొంటెనవ్వు జ్ఞాపకంవచ్చింది. ఆ నవ్వువెనక డాక్టరులో ఎంతదుర్మార్గం దాగిఉందో ఊహించుకుని వణికిపోయాడు. ఆ దుర్మార్గుడికి బుద్ధిచెప్పాల్సిందే. డ్రాయరులో పామును

తెచ్చి పెడితే సరి. జ్వరంతో చావడానికిసిద్ధంగాఉన్నాసరే, ఆ డాక్టరుని చేయిచూడనీయకూడదు. పగతీర్చుకోవాలనే ఈ ఆలోచనలు బరువైన బెత్తంవచ్చి వేళ్ళకనుపులమీద పడడంతో ఆగిపోయాయి. హెడ్మాస్టరు బెత్తంఎత్తి "చేయిజాపు, రాని రోజు ఒక్కొక్కదానికీ ఆరేసిదెబ్బలు. తరువాత క్లాసులో బెంచీయెక్కడం, యిదీ శిక్ష. మానిటర్! యీ విషయం నువు చూడు. స్వామినాథన్! యికముందు ఒక్కరోజు గైరుహాజరయ్యావో లాగు వూడదీయించి జవానుచేత చావకొట్టిస్తా. పోలీసు సూపరింటెంట్లువాళ్ళకొడుకులు, మనమలు, ముత్తాతలను తీసుకువచ్చి నన్ను బెదిరిద్దామనుకున్నావేమో, అవేం సాగవు. రాజుగారికి ఫిర్యాదుచేసినా నేను లక్ష్యపెట్టేదిలేదు." అని స్వామినాథన్ మెడ వదిలి బెత్తం ఎత్తాడు.

ఇంకొకనిమిషం. తాచుపాములాంటిబెత్తం స్వామినాథన్ అరచేతిమీద పడేదే. ఉద్రేకం ముంచుకువచ్చింది. భయం, రోషం, క్రోపం పెనగొన్నాయి. స్వామినాథన్ చేయిచాచి హెడ్మాస్టరుచేతిలోనిబెత్తం ఊడలాక్కుని కిటికీలో నుంచి బయటపడవేశాడు. బల్లదగ్గిరికి ఉరికి పుస్తకాలు తీసుకుని గదిలోనుంచి బయటపడ్డాడు. హాలు, వరండాలగుండా పరుగెత్తుతూవెళ్ళి, గేటుగడియ బరువేమో ఎత్తలేక, గోడఎక్కి మార్కెటురోడ్డుచివరికి దూకాడు.

రోడ్డుపక్కన ఒకచెట్టుకింద కూచొని ఆలోచనలు కూడగట్టుకోసాగాడు. ఆ రాక్షసుడు ఉన్నంతకాలం ఆ బడికి వెళ్ళేదిలేదు. తండ్రికి ఈవిషయంతెలిస్తే యేంచేస్తాడో భగవంతుడికి ఎరుక. తిరిగి ఆ బడికే వెళ్ళమని బలవంతంచేస్తాడు.

కాని ఉహుఁ— వెళ్ళడం సాధ్యంకాదు...ఈవిధంగా రెండు బడులనుంచి వచ్చేశాడు. మాల్గుడిలో ఇంక బడులంటూ



బల్లదగ్గరికి ఉరికి, పుస్తకాలు తీసుకుని గదిలోనుంచి బయటపడ్డాడు.

లేవు. తిరుచినాపల్లో మదరాసో వెళ్ళాలి. స్వామినాథన్ ఎలాంటివాడో తెలుపుతూ అందరుహెడ్డుమాస్టర్లకు బోర్డు స్కూలుహెడ్డుమాస్టరు ఉత్తరాలు రాస్తాడేమో! అలా జరిగితే ఎవరూ అతనిని చేర్చుకోరు. ఇక కాయకష్టంచేసి డబ్బుసంపాదించాలి...రూపాయలు వస్తాయి. హోటలుకివెళ్ళి కాఫీ టిఫిన్ ఇష్టంవచ్చినపుడు కొనుక్కుని తినచ్చు. బొంబాయి ఆనందభవన్‌లో తీపిపదార్థాలు ఎంత రుచిగాఉంటాయని! ఆ హోటలుకు ఎడమవేపున పైగా బాదంకాయలుఅంటించిన ఓ అచ్చు ఉంది. తినాలని అనిపించేది. కాని ఖరీదు ఎక్కువనేభయంతో హోటలువాడిని అడగలేదు. బడికి వెళ్ళకపోతే తండ్రి ఇంట్లో ఉండనివ్వడు. కొట్టవచ్చు. ఇక ఇంటికి ఎన్నటికీ వెళ్ళనేవెళ్ళడు. తండ్రిమొహం చూడలేడు. అయితే ఎక్కడికి వెళ్ళడం? ఎక్కడికయినాసరే. మార్కెట్టురోడ్డువెంట వెళితే ఎక్కడికివెళుతుంది? బహుశా మదరాసు. ఇంకా ముందుకు సాగిపోతే బొంబాయి, ఇంగ్లండు వెళ్ళగలడా? అక్కడ పనిచేసి డబ్బుసంపాదిస్తూ ఇష్టంవచ్చినట్టు ఉండవచ్చు. రైలులో వెళితే?...కాని డబ్బు ఎక్కడనుంచి వస్తుంది? పెద్దచిక్కే. కాని స్టేషనుమాస్టరు మంచివాడు, ఎరుగున్నవాడు.

బడిగంట మోగింది. తొందరగా వెళ్ళాలని స్వామినాథన్ లేచాడు. పిల్లలు బయటకువచ్చి అతనిచుట్టూచేరి వింత జంతువునుచూసినట్టు చూడవచ్చు.

మార్కెట్టురోడ్డున తొందరగా నడుస్తూ కుడివేపుకు మళ్ళి స్మిత్తువీధివెంట వెళ్ళి సందుగొందులనుంచి దగ్గరదోవను పట్టి ఆల్బర్ట్ మిషన్‌స్కూలుముందుకు చేరాడు. ఆ కారుపసుపు

భవంతి, భవంతిమీంద మేడ చూసేసరికి పాతరోజులు జ్ఞాపకం వచ్చి అసహ్యంవేసింది. ఆ బడి వదలకుండాఉంటే బాగుండేది అనుకున్నాడు. అందులో ప్రతీదీ ఎంతదర్జాగా ఉండేది! పట్టు తలపాగా చుట్టి హెడ్డుమాస్టరు ఠీవిగా ఉండేవాడు. బోర్డు హైస్కూలు హెడ్డుమాస్టరో వట్టి పేడపురుగు. వేదనాయగం, ఎబెనెజార్ ! ఎబెనెజార్ కూడా ఎంత మంచివాడు ! డి పి. పిళ్ళె హిస్టరీక్లాసులు ఎంత హుషారుగా ఉండేవి! సోమూ, 'బటాణీ గింజ' జ్ఞాపకంవొచ్చి స్వామినాథన్ ఏడ్చేశాడు. అతని స్నేహి తులు - రాజం, సోము, మణి - అంతా అక్కడ వున్నారు. ఇక 'బటాణీగింజ' సుఖంగా దర్జాగా గౌరవంగా ఆల్బర్ట్ మిషన్ స్కూలులో చదువుతున్నాడు. తను కుష్టువాడిలా ఒంటరి అయిపోయాడు. ఎవరూ దగ్గిరికి రానీయరు. హఠాత్తుగా తన మీంద తనకే విసుగెత్తింది. పాతబడిలో మళ్ళీ జేర్చుకుంటేనా! ఊహుఁ- జేర్చుకోరు. యత్నించి లాభంలేదు. చదవడానికి ఇక మాల్గుడిలో బడులులేవు.మదరాసుపారిపోయి కష్టపడి.పనిచేయ వలసిందే. వెళ్ళేముందు రాజంను, మణిని చూసివెళ్ళడంమంచిది.

స్కూలుగేటుముందు తచ్చాడాడు. లోపలకు వెళ్ళ డానికి ధైర్యంచాలలేదు. తను బడికే విరోధి. జవాను సింగారం చూస్తే మెడపట్టుకుని గెంటేయవచ్చు. స్కూలుకు సూటిగా నిలబడకుండా గేటుస్తంభం వెనక నక్కాడు. రాజంను మణిని కలుసుకోవాలి.,ఎలా? కొద్దినిమిషాలు అలా నిలబడి ఒకఎత్తు ఆలోచించాడు.

బడివెనకకు వెళ్ళాడు. ఆ వేపుకు ఎవరూ రారు. ఆ ప్రదే శం బడివెనక పొలానికిఆనుకుని దూరాన రైలుకట్టవరకు

ఉంది. ఆ బడిలో చదివిన ఆరు ఏడు సంవత్సరాలలో ఒక్క సారికూడా ఆవేపు వెళ్ళలేదు. ఇక్కడ స్కూలుప్రహరీగోడ సగంవరకు నాచుతో కప్పబడింది. బడివెనక దృశ్యం ఇంపుగా ఉంది. ఇక్కడినుంచి భవంతిపైభాగం సగంమాత్రమే కనిపిస్తుంది. అదికూడా విచిత్రంగాఉంటుంది. ఉదాహరణకు సెకండు ఫారం ఎ ఎక్కడఉందో చూపలేదు. గోడకిందకు ఒకరాయి దొర్లించి దానిమీద స్వామినాథన్ నిలబడ్డాడు. బడి ఆవరణ కనిపించింది. అపుడు పన్నెండుగంటలయింది. బడిలో ఎవరికీ తీరికఉండదు. ఆవరణలో ఎవరూ కనిపించలేదు. కొంచెంసేపు ఆగి చూశాడు. చూసీచూసీ విసుగెత్తింది. కొద్దిసేపయిన తరవాత ఒక పొట్టికుర్రవాడు ముక్కుచీదుకోవడానికి మొదటి తరగతిలోనుంచి బయటకు వచ్చాడు. మొదటితరగతి మూడు సెక్షన్లు ఉన్నభాగం అక్కడికి పదిగజాలలో ఉంది.

స్వామినాథన్ సన్నగా ఈలవేశాడు. కాని ఆ కుర్రవాడికి వినిపించలేదు. స్వామినాథన్ మళ్ళీ ఈలవేశాడు. ఆ కుర్రవాడు వెనకకు తిరిగి చూసి దెయ్యాన్ని చూసినవాడిలా హడిలిపోయాడు. స్వామినాథన్ దగ్గరికి రమ్మని సైగచేశాడు. ఆ దెయ్యంమాట వినడమా లేక క్లాసులోకి పారిపోవడమా అని ఒక సెకండు ఆ కుర్రవాడు ఆలోచించాడు. స్వామినాథన్ మళ్ళీపిలిచాడు. ఆ కుర్రవాడు పిచ్చిగాచూస్తూ స్వామినాథన్ దగ్గిరికి వెళ్ళాడు.

"పిప్పరమెంటు కావాలా?" అని అడిగాడు స్వామి.

ఆ కుర్రవాడు తనచెవులనుతానే నమ్మలేకపోయాడు. ఇక్కడ ఒక మనిషి పిప్పరమెంట్లుఇస్తానంటున్నాడు! నిజమేనా?

ఇందులో ఏదో మోసం ఉంది. స్వామినాథన్ పిప్పరమెంటు పెడతానని మళ్ళీ చెప్పాడు. కుర్రవాడు కావాలన్నాడు.

"అలా అయితే, యిప్పుడే పెట్టను. నువు కష్టపడి సంపాదించుకోవాలి. సెకండుఫారం ఎ కి వెళ్ళి రాజం అనే కుర్రవాడితో మీ యింటి దగ్గిరనుంచి యెవరో వచ్చారు. తొందరగా రమ్మంటున్నారు అని చెప్పి తీసుకువస్తే పిప్పరమెంటు నీ చేతిలో పడుతుంది. ఒకటేమిటి రెండు పిప్పరమెంట్లు పడచ్చు" అని చెప్పిందంతా కుర్రవాడు జ్ఞాపకంపెట్టుకుంటూ మాటాడకుండా నిలబడ్డాడు ఒకనిమిషంతరవాత కనుబొమలు పైకెత్తి "సెకండుఫారం ఎ ఎక్కడుంది ?"అని ప్రశ్నించాడు.

"మేడమీద."

"ఓ! " నిరాశతో అని ఆలోచిస్తూ నిలబడ్డాడు.

"యేమిటీ ?"అని అడిగాడు స్వామినాథన్. "పదిదాకా అంకెలులెక్కపెడతా. యీలోపున జవాబు చెప్పాలి. లేకపోతే పిప్పరమెంటు యిచ్చేదిలేదు. ఒకటి, రెండు, మూడు—"

"మేడమీద కదూ ?"అని కుర్రవాడు అడిగాడు.

"అవును."

"కాని, నేనెప్పుడూ మేడయెక్కలేదే !"

"యిప్పుడు యెక్కు"

"దోవ తెలీదు"

"మెట్లు యెక్కితేసరి"

"యెవరన్నా చూస్తే కొడతారేమో ?"

"పిప్పరమెంటు కావాలంటే ధైర్యంచేయాలి. వెళ్ళేదీ, లేందీ వెంటనే చెప్పెసెయ్యి"

"సరే, వెళతా. యిక్కడే ఉండు." అని కుర్రవాడు చక్కాపోయాడు.

పదినిమిషాలతరవాత రాజంను వెంటబెట్టుకుని వచ్చాడు. గోడమీద స్వామినాథన్ మొహం కనిపించేసరికి రాజం ఆశ్చర్యపోయాడు.

"యిక్కడేంచేస్తున్నావ్ ?"

"గోడదూకి రా. నీతో అర్జంటుగా మాట్లాడ్డాలి రాజం!"

"యిప్పుడు క్లాసువుంది, రాలేను"

"అబ్బా! రద్దూ. అర్జంటుగా ఒకమాట చెప్పాలి"

రాజం గోడదూకి స్వామినాథన్‌పక్కన చేరాడు.

స్వామినాథన్‌తల కనిపించకపోయేసరికి ఆ కుర్రవాడు దీనంగా "పిప్పరమెంటు యేదీ ?" అని అడిగాడు.

"ఆ, మరిచేపోయా" అన్నాడు స్వామినాథన్ గోడ మీదికి మొహంపెట్టి, "యిదిగో పట్టుకో" మూడుపైసలనాణెం విసిరివేశాడు.

"పిప్పరమెంటు యిస్తానంటివి" అన్నాడు కుర్రవాడు.

స్వామినాథన్ "మూడుపైసలు చాలవా యేం? కావలిస్తే దాంతో పిప్పరమెంటు కొనుక్కో" అన్నాడు.

"కాని రెండు పిప్పరమెంట్లు యిస్తానంటివిగా ?"

"ఊఁ-యిక వెళ్ళు. వంకాయలమ్మేవాడిలా నాతో బేరంపెట్టకు. యిచ్చినదాంతో తృప్తిపడు" అని స్వామినాథన్ రాతిమీదనుంచి కిందికి దూకాడు.

"రాజం! యివాళ మా బళ్ళో యేం జరిగిందో

తెలుసా? హెడ్డుమాస్టరుతో కొట్లాడాను. నన్ను బళ్ళో నుంచి వెళ్ళగొట్టేశారు. యిక బడీలేదు, క్లాసులూలేవు."

"హెడ్డుమాస్టరుతో కొట్లాడావా?"

"డ్రిల్లుక్లాసులకి వెళ్ళలేదని నన్ను కొట్టడానికి వచ్చాడు. చేతిలోనుంచి బెతం లాగేశాను...యిక ఆ బడికి వెళ్ళడం పడుతుందనుకోను. వెళ్ళితే చాలా గొడవఅవుతుంది."

"అరె! అసాధ్యుడివే! నువెక్కడికివెళితే అక్కడ యేదో గొడవతెచ్చిపెట్టుకుంటావు." అన్నాడు రాజం.

"నాతప్పేంలేదు, రాజం!" అని స్వామినాధన్ డాక్టరు కేశవన్ చేసిన మోసం వివరించి తనతప్పేమీలేదని చూపడానికి యత్నించాడు.

"నీకు తెలివిలేదు స్వామీ! చిత్రమయినవాడివి!"

"ప్రాక్టీసుచేయడానికి సాయంకాలం తీరుబడిచేసుకోవాలంటే యేంచేయాలేం? వై. యం. యూ. ను గెలవడం మాటలుకాదు."

"అవును, స్వామి! యివాళవుదయం వాళ్ళు ప్రాక్టీసు చేస్తుంటే చూశాను. రోజూ వుదయంకూడా ప్రాక్టీసుచేస్తున్నారట. వాళ్ళు మరేం తీసిపోయేవాళ్ళు కాదు. వాళ్ళల్లో మోహిదీన్ అని నల్లటికుర్రవాడున్నాడు. వాడిని ఒకకంటితో కనిపెడుతూండాలి. వాడు బ్రాడ్‌మన్‌లాగా ఆడతాడు. జాగ్రత్తగా కనిపెట్టిచూడాలి. షణ్ముగంఅని యింకొకడున్నాడు. గట్టిబౌలరు. కాని మొహిదీన్‌లో ఒకలోపం వుంది. కాలివేళ్ళు అంత నిలకడగా వుండడు...స్వామి! కొంతకాలం వరకు బెంగ

పెట్టుకోకు. రేపుకూడా వుదయం రావాలి. యెలాగయినా వాళ్ళని చిత్తుచెయ్యాలిసుమా !"

ఆఖరిసారిగా రాజంకు చెప్పివెళదామనుకున్న స్వామినాథన్ మనసు మార్చుకున్నాడు. తనఆలోచనలు చెపితే, రాజం ఆపి వేస్తాడు. రాజంతోనేకాదు, మణితోకూడా చెప్పదలచుకోలేదు. ఆగిపోతే ఎక్కడ వుంటాడు ? పోటీఆట ఇంకా రెండు రోజులు ఉంది. ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయి, దోవలోఏదో విధంగా ప్రాక్టీసుచేసి, ఆటరోజున తిరిగివచ్చి ఆడి, మళ్ళీ వెళ్ళిపోయి, ఇక ఎన్నటికీ మాల్గుడి తిరిగిరాకూడదు ... తాను ఎంత వాదించినా తండ్రిని ఒప్పించలేడు. యింటికి తిరిగివెళ్ళితే బోర్డుహైస్కూలుకు మళ్ళీ వెళ్ళమని తండ్రి చావగొడతాడు. తండ్రి వట్టి మొండిఘటం... యెవరికంటా పడకుండా ఆటరోజున రావాలి. బహుశా అసలు అవసరం లేదేమో ! హఠాత్తుగా అడిగాడు. "నేను పోటీఆటకు రావడం అంత అవసరమా ?"

రాజం అతనిని అనుమానంతో చూసి, "యిటువంటి పిచ్చిప్రశ్నలు అడగకు. నువు లేకపోతే యెలా స్వామీ ? నీ మీదే ఆశపెట్టుకుని వున్నాం. మనలోకల్లా నువ్వే గొప్ప బౌలరువు. వాళ్ళని చిత్తుచిత్తుచేయాలి. మనం గెలవకపోతే నా ప్రాణం తీసుకుంటాను. స్వామి! గొడవలోకి దింపేశావు గదా ! బడికి వెళ్ళకుండా యేంచేద్దామనుకున్నావ్?"

"యేదయినా కార్ఖానాలో చేరుతా."

"మీ నాన్న వింటే యేమంటాడో తెలుసా ?"

"ఆఁ, యేమంటాడు ? సరే, నీ యిష్టం అంటాడు. అడ్డుపెట్టడు"

"స్వామి! యిక నేను క్లాసుకు వెళ్ళాలి. ఆలస్యం అయిపోయింది." రాజా లేచి బడివేపుకు వెళుతూ, "రేపు పెందలాడే ఆటకి రా. తొందరగా రా, బడీగిడీ లేదుగా." అని కేక వేశాడు.

## పదహారవ ప్రకరణం

### స్వామి కనిపించలేదు

ఎల్లమ్మన్‌వీధిని సమీపిస్తూ స్వామితండ్రికి సిగ్గువేసింది. ఆ వీధి ఆ పట్టణంలో ఆఖరువీధి. వందగజాల నాటుదోవగా మారి వెళ్ళి సరయూనది ఇసుకతిన్నెలలో కలిసిపోతుంది. మార్కెట్టురోడ్డుచివర ఒకసెకండు తటపటాయించి, ఎల్లమ్మన్ వీధిలోకి మళ్ళాడు. ఆ వీధిఅంతా చీకటి. చడీచప్పుడూ లేదు. గాసులైటు వెలుతురు ఎల్లమ్మన్‌వీధిలో కొద్దిగజాలమేర పడుతోంది. తక్కినవీధంతా చీకటి. రెండు మున్సిపలుదీపాలు మినుకు మినుకుమంటున్నాయి.

స్వామినాథన్‌తండ్రికి సిగ్గువేసింది. ఆ వీధినిదాటి, ఇసకలో కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళి, కొడుకుశవంకోసం సరయూనదిలో చూడాలి. స్వామికోసం సరయూనదిలో చూడడమా? నవ్విపోరూ? కాని అంతకంటె చేసేదేముంది? వంచో చెడ్డో కొడుకుసంగతి తెలుసుకోందే ఇంటికివెళ్ళడం ఎలా? తొమ్మిదిగంటలనుంచి ఇల్లు బావురుమంటోంది. అతనిభార్య, తల్లి పిచ్చివాళ్ళల్లా తిరుగుతున్నారు. అతనిభార్య తాలూకా ఆఫీసులో తొమ్మిదికొట్టేవరకు బాగానే ఉంది. తొమ్మిది వినే

సరికి మొహం తెల్లబడింది. స్వామినాథన్ ఏమయినాడో అతనిస్నేహితులను, మాస్టర్లను కనుక్కురమ్మన్నది.

హెడ్డుమాస్టరు ఎక్కడ కాపరం ఉన్నాడో అతనికి తెలియదు. బోర్డుస్కూలుకు వెళ్ళి కాపలావాడిని అడిగితే, సరిగా చెప్పలేదు. సగం పట్టణం తిరిగినా హెడ్డుమాస్టరు ఇల్లు కనపడలేదు, మణి ఇల్లుకూడా దొరకలేదు. రాజంఇంటికి వెళ్ళాడు. కాని ఆ ఇంట్లో దీపాలు కనిపించలేదు. అంతా నిద్ర పోతున్నారు. మా అబ్బాయి కనిపించాడా అని పరాయి వాళ్ళను లేపడం బాగుండదు. వరండాలోపడుకుని నిద్రపోతున్న జవానును లేపి అడిగితే ఆ సాయంకాలం స్వామి రాజం ఇంటికి రాలేదని చెప్పాడు. ఆ తరవాత అతను వీధులవెంట ఊరికే తెగతిరిగాడు. భార్యను, తల్లిని తృప్తిపరచడానికే ఆ తిరగడమంతా. భార్యకు కలిగిన భయం అతనికి కలగలేదు. "ఎక్కడికో వెళ్ళాడు, వాడే వస్తాడు. రాగానే గట్టిగా చివాట్లు పెట్టి యీ ధోరణి మొదట్లోనే తుంచివేయాలి." అని దారి పొడుగునా అనుకున్నాడు. ఈవిధంగా ఒక గంటసేపు తిరిగి ఇంటికి వెళ్ళాడు. అతనితల్లి పక్కమీదనుంచి లేచి గడబిడగా తిరుగుతూ స్వామినాథన్ క్షేమంగా తిరిగివస్తే అవీ ఇవీ సమర్పించుకుంటానని తిరుపతిదేవుడికి మొక్కుకుంటోంది. వీధికేసి చూస్తూ అతనిభార్య రాతిబొమ్మలా నిలబడిఉంది. ఆ ఇంటిల్లో కల్లా పసిపాప ఒక్కడే హాయిగా తొట్టిలో పడుకుని నిద్రపోతున్నాడు.

ఇంటికివెళ్ళి తనతిరుగుడువల్ల ఏమీ తేలలేదని స్వామినాథన్‌తండ్రి భార్యతో చెపుతూ ఉల్లాసంగానే కనిపించాడు.

కాని ఆ ఉల్లాసం ఆట్టేసేపు నిలవలేదు. ఆ ఇద్దరుస్త్రీల ఆదుర్దా, భయం అతనికి సోకినాయి. తన కొడుకుకి ఏదో ప్రమాదం జరిగిందో లేక ఎవరయినా ఎత్తుకుపోయారో అని అనుకో సాగాడు. ఈ భయానికి కారణాలు. చూపబోతూంటే అతని భార్య వణికేగొంతుతో "ఆసుపత్రిలోచూశారా?" అని బావురు మని ఏడవసాగింది. ఈ ప్రశ్నను పట్టించుకోనట్టు కనిపించాడే గాని, మనసులోమాత్రం స్వామి ఆసుపత్రిమంచంమీద పండు కున్నట్లు చిత్రించుకోవడం ప్రారంభించాడు. ఈ చిత్రాన్ని మనసులోనుంచి తుడిచివేయాలని యత్నిస్తూంటే అతనితల్లి "పిల్లాడు యెక్కడికివెళ్ళుంటాడు. యివాళ పుదయం వాడి నేమన్నా అన్నావా?" అని అడిగి పరిస్థితిని మరింత అధ్వాన్నం చేసింది. ఈ ప్రశ్నతో అతనికి కోపంవచ్చింది. స్వామినాథన్ కనిపించకపోవడానికి బాధ్యత తనదని అందరూ ఆడిపోసేవారే. తొమ్మిదిగంటలనుంచి ఈ ఎత్తిపొడుపులు భరిస్తూనేఉన్నాడు. కాని ఈ మాటలతో తలకిందులయి వెంటనే వెళ్ళి పండుకో మని ఇలాంటిపిచ్చిప్రశ్నలు అల్లవద్దనీ కఠినంగా చెప్పాడు. ఆ తరవాత ఉదయంనుంచి కొడుకుతో తాను వ్యవహరించిన తీరును నెమరువేసుకుని, ఆనాడు అసలు కొడుకు తనకు కన పడనేలేదనేసంగతి జ్ఞాపకంవచ్చి నిట్టూర్చాడు. పిల్లవాడు ఉద యానే లేచి, చదువుకుని, బడికి వెళ్ళాడు. తాను పార్టీలతో గదిలోకూచున్నాడు. కిందటి రెండురోజులలో ఏమన్నా అన్నానా అని జ్ఞాపకంచేసుకోసాగాడు. తన జ్ఞాపకశక్తిమీద అతనికి నమ్మకంలేదు, కాని, తానేమీ అనలేదనిమాత్రం నమ్మకం. పిల్లవాడికి కష్టంవేసి, ఇలాంటి సాహసంచేయడానికి

పురిగొల్పేపనేమీ అతను చేయలేదు. ఏమీ అనలేదు. 12 గంట లయింది. కాని అతనిభార్య ఇంకా వెక్కి వెక్కి ఏడుస్తూనేఉంది. ఆమెనుఓదార్చాలని యత్నించి, బయటికివెళ్ళడానికి వస్తూ, బిగ్గరగా "వెతకడానికి వెళుతున్నాను. నేను తిరిగిరాకముందే వాడువస్తే, నేను బయటికి యెందుకు వెళ్ళానో చెప్పకండి. లేకపోతే నన్ను తెలివితక్కువవాడికింద జమకడతాడు."

ఆసుపత్రి రోడ్డువెంట గబగబా వెళ్లి ఆసుపత్రిగేటు వంక తేరిపారజూసి మళ్ళీవెనకకు తిరిగాడు. ఆసుపత్రిలోకి వెళ్ళ డం అనవసరం అని అనుకున్నాడు. నిజానికి అందులోకి వెళ్ళే ధైర్యం అతనికి లేకపోయింది. ఒక కిటికీలోనుంచి మందకొడిగా వెలుతురు పడుతోంది. ఆ కిటికీ వెనక మంచంమీద కట్టుకట్టు కుని స్వామి పడుకునిలేడు గదా! తొందరగా ఆసుపత్రిరోడ్డు నుంచి కదిలి, సందులూ గొందులూ తెగ తిరిగాడు. గంట గంటకు అతని హృదయం బరువెక్కసాగింది. మార్కెట్టురోడ్డు దాటి ఎల్లమ్మన్ వీధిలో ప్రవేశించాడు.

ఎల్లమ్మన్‌వీధిగుండా గబగబా నడిచి నదికి వెళ్ళే కాలి బాటనుపట్టాడు. నదిని సమీపిస్తున్నకొలదీ నడక మందగిం చింది. తాను చేయబోయేపనిఅంతా పొరపు అని తనను తాను నమ్మించుకోజూచాడు. కాని కొడుకుశవం ఉబ్బి తుంగలో పట్టుకుని అలలమీద తేలియాడుతూంటే... కళ్ళుమూసుకుని "భగవంతుడా! రక్షించు" అని ప్రార్థించాడు.

నది ఎగువ దిగువలకు దూరంగా పరికించి చూశాడు. నది పారుతూ ప్రవహిస్తోంది. నదిమీదికి వంగిన పెద్దపెద్ద రావి చెట్లు నిట్టూరుస్తున్నట్టున్నాయి. నీటిమీద ఒక చిన్న కొమ్మ

నీడ కనిపించేసరికి ఉరుక్కుంటూ వెళ్ళాడు. ఏదో తేలియాడే ‌కి అక్కడికి పరిగెత్తాడు.

వట్టి తెలివితక్కువ మొద్దుని అని తనను తానే నిందించుకుంటూ, మాల్గుడి రైలుస్టేషను దగ్గిరికి వెళ్ళి రైలుపట్టాల వెంట మైలుదూరం పట్టాలు, స్లీపర్సు పరీక్షిస్తూ వెళ్ళాడు. పురుగుల అరుపులు, ఈలలు; గబ్బిలాల చప్పుడు, కప్పల బెకబెకలు వినిపించాయి. పట్టాలమీద ఏదో తడిగా ఉంటే వణికిపోతూ తాకి చూశాడు. చేయి నక్షత్రాలవెలుతురులో చూసుకున్నాడు. అంటినది నెత్తురు కాదు, నీళ్ళు. అమ్మయ్య! అని నిట్టూర్చి భగవంతుడికి నమస్కరించాడు.

# పదిహేడవ ప్రకరణం

## పోటీఆటరోజున

### I

ట్రంకురోడ్డుకు ఎడమవేపుగా చీలిన ఒక చిన్నరోడ్డుమీద ఫలవృక్షాలు ఉండడంవల్ల అది స్వామినాథన్‌ని ఆకర్షించింది. తెల్లటిబంతిలాంటి అడివిరేగిపళ్ళు, ఆకుపచ్చని అత్తిపళ్ళు, గుబురులలోనుంచి తొంగిచూస్తున్నాయి. మైలుదూరం నడిచాడు. కాని రోడ్డు నచ్చలేదు. ఎక్కడా జనసంచారం లేదు. చడీచప్పుడూ లేదు. తిరిగి ట్రంకురోడ్డుకు వెళదామనుకున్నాడు. అక్కడ కాస్త జనసంచారం ఉంటుంది. ఏ పల్లెటూరి ఎద్దుబండో సాగిపోతూ కనిపిస్తుంది. లేదా పక్కచుట్టలు వెనక కట్టుకుని ఏ మోటారుకారో దుమ్ము రేపుతూ బర్రున పరుగెత్తుకుపోతుంది. రోడ్డుచివరగా రైతులు గుంపులుగుంపులుగా

నడుస్తూ వెడతారు. కాని ఈచిన్నరోడ్డుపై చడీచప్పుడూ లేక పోవడంమూలాన స్వామికి దిగులేసింది. అంతేకాదు, ఇంటిబెంగ పట్టింది. ఇల్లు జ్ఞాపకంవచ్చేసరికి కుంగిపోయాడు. ఇంటిదగ్గిర వంటవాడు ఎంతరుచిగల వంటకాలు తయారుచేస్తాడని! తల్లి స్వయంగా నెయ్యి పెరుగు వడ్డిస్తానని పట్టుపట్టేది. విస్తరిముందు కూర్చుని తల్లి అలమారుతెరిచి పెరుగుగిన్నె తెచ్చి, అన్నం బోర్లిస్తూంటే, ఆ తెల్లటి మీగడ, పెరుగు ఎంత రుచిగా ఉండేదని! ఆకలి విపరీతంగా వేసింది తొడలు బరువెక్కాయి. నడుం పగిలిపోతోంది. కాని లక్ష్యపెట్టలేదు. సూర్యకిరణాలు పడమటనుంచి ఏటవాలుగా వచ్చిపడుతున్నాయి. పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి.

ఆకలిభరించలేక పళ్ళుకోసుకుని తిన్నాడు. దగ్గిరలోనే స్వచ్ఛమయిన మంచినీటికోనేరు కనిపించింది.

కొంచెంసేపు విశ్రాంతితీసుకుని ఇంటిదారిపట్టాడు, ఇపుడు కావలసిందల్లా ఇల్లు. తక్కినవిషయాలు దానిముందు కొరగాకుండాపోయాయి. బోర్డుస్కూలు గొడవవల్ల మించుకు పోయిందేమీలేదు. ఈ విషయం పెద్దగాతీసుకుని ఇన్నిచిక్కులలో ఎలా ఇరుక్కున్నానాఅని ఆశ్చర్యపోయాడు. హెడ్డు మాస్టరు బెత్తంఎత్తితే తను ఎందుకు లాగివేసినట్లు? పోనీ తిన్నగావెళ్ళి తండ్రికి సంగతంతా చెప్పాడా? లేదు. తండ్రి నాలుగు చివాట్లుపెట్టేవాడు. అంతే. అంతకుమించితే అమ్మ నాయనమ్మా వచ్చి అడ్డుపడేవారు. ఎన్నిచివాట్లుపెట్టినా ఎంత కోపగించినా తండ్రి ఈ చిక్కులోనుంచి తప్పించేవాడు. ఆయనంటే అందరికీ భయమే. ఇక రెండురోజులు పోటీఆట ఉంద

నగా ప్రాక్టీసుమానివేయడం తెలివితక్కువగాదూ? పోటీలో ఓడిపోతే రాజం ఏంచేస్తాడో తెలియదు.

ఇలా ఆలోచిస్తూ స్వామినాథన్ ట్రంకురోడ్డువేపు నడిచాడు. తొందరలోనే ట్రంకురోడ్డుఎక్కి తిన్నగా వెళితే మార్కెట్టురోడ్డుచేరుకుని అక్కడినుంచి ఇంటికి కళ్ళుమూసుకుని వెళ్ళవచ్చు. ఇంత పొద్దుపోయి ఇంటికిచేరితే తలిదండ్రులు కోపపడతారేమో? అంతగాఅయితే దారితప్పి తిరుగుతున్నానని చెప్పవచ్చు. ఇలా చెపితే నమ్ముతారా? పఠానువాళ్లు ఎత్తుకుపోయారు, అతికష్టంమీద తప్పించుకువచ్చాను, అని చెపితే......

చాలా సేపటినుంచీ నడుస్తున్నాను, ఇంకా ట్రంకురోడ్డుకు చేరుకోకపోవడమేమిటిఅనుకుని ఆగి చుట్టూచూశాడు. అత్తి, అడివిరేగితోపువెంటే ఇంకా నడుస్తున్నానని గ్రహించాడు. నేలమీద ఎండిపోయినపళ్ళు ఆకులు చెల్లాచెదరుగా పడిఉన్నాయి. వెళ్ళేటప్పటికంటె తిరిగివచ్చేటప్పుడు రోడ్డు ఎక్కువ పొడుగు అనిపించింది. రోడ్డు చీలి మెంపీఅడవిరోడ్డును చేరుకునే మలుపువెంటే అనుకోకుండా నడుస్తున్నాడు. అదీ అసలు విషయం. ఇంకా డబ్భయి మైళ్ళ అవతల ఈ రోడ్డు చిన్నచిన్నబాటలకింద చీలి మెంపీకారడవిలో కలిసిపోతుంది. ఈ మలుపువెంట వెళ్ళకపోతే ఎప్పుడో ట్రంకురోడ్డును చేరుకునేవాడు.

హఠాత్తుగా చీకటిపడింది. గుండె టకటకా కొట్టుకోసాగింది. ట్రంకురోడ్డును చేరుకోలేదని గ్రహించేసరికి నోరు ఎండిపోయింది. చెట్లు ఇంకా దట్టంగా ఉన్నాయి. రోడ్డు-

సన్నగానే ఉంది. ట్రంకురోడ్డు విశాలమయింది. చెట్లకొమ్మలు వెలుతురుకు అడ్డురావు. ఇక్కడ ఆకాశమే కనిపించడంలేదు. చెట్లకొమ్మల సందులలోనుంచి అక్కడక్కడ నక్షత్రాలు మినుకుమినుకుమంటూ కనిపిస్తున్నాయి. అలసిపోయినా తొందరగా నడవసాగాడు. కొద్దిదూరం పరుగెత్తాడు కూడా. కాళ్ళ కింద ఆకులు గలగలమన్నాయి. ఈ గలగలశబ్దానికి చెట్ల మీది పక్షులు అదిరిపోయి రెక్కలు కొట్టుకుంటున్నాయి. ఆ కటికచీకటిలో ఆ నిశ్శబ్దంలో పక్షులరెక్కలచప్పుడు విపరీతంగా భయం గొలుపుతోంది. స్వామినాథన్ హడలిపోయి కదలకుండా నిలబడ్డాడు. ఎలాగయినాసరే ట్రంకురోడ్డుకు చేరుకుని అక్కడినుంచి ఇంటిదారిపట్టాలి. ట్రంకురోడ్డుకు చేరుకునేసరికి పన్నెండుగంటలయినా పరవాలేదు. ఆ రోడ్డు వైశాల్యం, చెట్లు దట్టంగా లేకపోవడం ధైర్యం కలిగిస్తుంది. కాని ఇక్కడ చెట్ల బోదెలు, కొమ్మలు ఒకదానితో ఒకటి కలసిపోవడంవల్ల రోడ్డు దెయ్యాలు నివసించే పెద్ద చీకటిగుహలాగా ఉంది.

పక్షులగందరగోళం అణిగింది. స్వామినాథన్ మళ్ళీ నడకసాగించాడు. సత్తువకొద్దీ పరుగెత్తి తొందరగా ట్రంకు రోడ్డుచేరుకుని అక్కడినుంచి ఇంటికిచేరుకోవాలని ఎంత ఆదుర్దాపడుతున్నా, పక్షులు మళ్ళీ లేస్తాయేమోనని చప్పుడుచేయకుండా నడిచాడు. ఒకవేపు పరుగెత్తాలనేకోరిక, ఇంకోవేపు పరుగెత్తితే వచ్చేచిక్కు అతనిని సతమతంచేశాయి. పిచ్చిగా పరుగెత్తాలనేకోరికను అణచుకుంటూ చప్పుడుచేయకుండా మెల్లిగా నడుస్తూంటే, ఆ శ్రమకు నరాలు సడలిపోయాయి. గాలిదుమారంలో తాడుమీద నడుస్తున్నట్టుంది అతనిపని.

చెవులకు ఎక్కడలేనిశక్తి వచ్చింది. ఎంత చిన్నశబ్దమయినా స్పష్టంగా వినగలుగుతున్నాడు. నేలమీాది ఎండు రెమ్మలు, సగంసగం వాడినఆకులు, పూర్తిగా, ఎండినఆకుల కుప్పలనుబట్టి కాలుపడినపుడల్లా రకరకాలశబ్దాలు అవుతున్నాయి. అక్కడక్కడా వట్టినేల. ఆ నేలమీాద అడుగుపడినపుడు టప్‌టప్, పట్‌పట్‌మని ఒకటేచప్పుడయేది. ప్రతిశబ్దం స్వామినాథన్ చెవినిపడుతోంది. కొంతసేపటివరకు మరేశబ్దము అతనికి వినిపించలేదు. పాదాలు టప్‌టప్, పట్‌పట్‌మనేశబ్దాలు చేశాయి. ఈ శబ్దాలు ఎడతెగకుండా అతనిమనసులోకి చొచ్చుకుపోతున్నాయి. ఏదో గొప్ప త్యాగంచేయవలసిందని ఎవరో దుష్టులు బోధిస్తున్నట్టుంది. ఎవరో అతనిని పేరుపెట్టి మెల్లగా పిలుస్తున్నట్టు వినిపించింది. 'స్వామి...స్వామి... స్వామి...'అనేపిలుపు, ఆతరవాత త్యాగంచేయమనేమాట! ఏదోదెయ్యం చప్పుడుగాకుండా వెనకనుంచి వస్తూ అదేపనిగా అతనిచెవులలో ఈవిషయమే చెపుతోందా? ఆగి చుట్టూ చూశాడు. ఆ దెయ్యం పంగజాపుకుని చేతులు నెత్తిమీాద పెట్టుకుని నక్కిఉంది. అటూఇటూ కొద్దిగా ఊగింది. వచ్చి ఎక్కడమీాదపడుతుందో అనే భయంకొద్దీ దానిమీాదనుంచి చూపు మళ్ళించలేకపోయాడు. నేలకు అంటుకునిపోయి ఆ దెయ్యంవంకే చూడసాగాడు. తాను వెనకకు తిరగగానే దాన్నినోరు మూాతపడిందేం? తేరిపారజూస్తూ నిలబడ్డాడు. ఈవిధంగా అయిదునిమిషాలు గడిచింది. భయం కొద్దిగా తగ్గగానే అది దెయ్యంగాదు పెద్దపెద్ద చెట్లబోదెలు, పైకొమ్మలు అని గ్రహించాడు.

ముందుకు సాగిపోయాడు. ట్రంకురోడ్డు వచ్చేసింది. అక్కడినుంచి ఆడుకుంటూ పాడుకుంటూ ఇంటికివెళ్ళవచ్చు అనుకున్నాడు. ట్రంకురోడ్డుమీద కాస్త విశ్రాంతితీసుకుందామా లేక ఏకాయెకీ ఇంటికివెళదామా అని తటపటాయించాడు. కాళ్లు గుదులుకట్టాయి. ట్రంకురోడ్డుకు చేరుకోగానే కాసేపు కూచోవాలని నిశ్చయించుకున్నాడు. కూర్చున్నా మరేం పరవాలేదు. అర్ధరాత్రిఅయినా ట్రంకురోడ్డుమీద భయుండుండదు. కాసేపు విశ్రాంతితీసుకుంటే ఇంటికి పరుగెత్తుకుంటూ వెళ్ళవచ్చు.

చెట్లూ చేమా లేని ప్రదేశానికి చేరాడు. నక్షత్రాలు కనిపించాయి· ముందురోడ్డు మసకమసకగా ఉంది. ఇక్కడ చీకటిగా లేదు. చెట్లతోపులులేవు. ట్రంకురోడ్డుకు వచ్చాననే భ్రాంతితో ఒక నిమిషం·పట్టరాని. సంతోషం పొందాడు. ఆ రోడ్డు అచ్చంగా ట్రంకురోడ్డులాగానే ఉంది. పైన నక్షత్రాల కాంతి ఉత్సాహాన్ని కలిగించింది. ఆగి లక్షలకొలదీ నక్షత్రాలను చూస్తుంటే మనసుబరువుతీర్చుకుంటానికి పాటలుపాడాలని అనిపించింది. ఇలా అనుకునేసరికి బలం చేకూరి విశ్రాంతి తీసుకోకూడదని నిశ్చయించుకున్నాడు. ముందుకు సాగిపోగలననే భావించాడు. ఈ బ్రాంచిరోడ్డు ట్రంకురోడ్డుకు సమకోణంలో ఉందని జ్ఞాపకంవచ్చింది. కాని ఇక్కడనుంచి సూటిగా వెళుతోంది. ఒకనిమిషం ఆశ్చర్యపోయి నిలబడి, తా నింతకు పూర్వం ఇది చూడలేదు అనుకున్నాడు. ఏమయినా ట్రంకురోడ్డు దీనిని సమకోణంలో ఎక్కడో అక్కడ కలవాలి. అక్కడినుంచి కుడిచేతివేపుకు తిరిగితే ఇంటికి చేరుకుంటాడు. అటూ

ఇటూ చూశాడు. కాని ఎక్కడా రోడ్డుజాడ కనిపించలేదు. చీకటిమూలంగా ట్రంకురోడ్డు కనిపించడంలేదని సరిపెట్టుకున్నాడు. అక్కడ రోడ్డు ఉండే ఉంటుంది. కుడిచేతివేపుకుమళ్లి ఒకటిరెండు అడుగులు వేశాడోలేదో మోకాలిలోతు ఊబిలో దిగబడిపోయాడు. అతికష్టంమీద కాలుతీసివేస్తూ ముందుకు సాగాడు. సూదిలా గడ్డి మొహానికి కొట్టుకుంది. కొన్నిచోట్ల గడ్డిలో మునిగిపోయాడు. ఎలాగైతేనేం రోడ్డుకు చేరుకున్నాడు.

## II

పరిస్థితిని గ్రహించాడు. నడిరాత్రి ముక్కూమొహం ఎరగనిదూరపురోడ్డుమీదవున్నాడు. తనకు బాగా తెలిసినట్రంకు రోడ్డు వేపుకు నడుస్తున్నాననేఆశతో ఇంతవరకు తట్టుకున్నాడు. ఇపుడు ఆ ఆశ కాస్తా పోయేసరికి భయంతో కుంగిపోయాడు. ట్రంకురోడ్డును చేరుకునేఆశ కల్ల అని గ్రహించగానే ఇక నిలబడలేకపోయాడు. ప్రయోజనంలేదని తెలిసికూడా కాళ్ళీడ్చుకుంటూ ముందుకుసాగాడు. మతిపోయినవాడిలా నడిచాడు. ఆకు కిందపడితేచాలు ప్రతిధ్వనించేటంత నిశ్శబ్దం అతనిని నిలువునా కుంగదీసింది. ఏదో నరకలోకంలో తిరుగుతున్నట్టు అనిపించింది.

నిలువునా కూలబడి వెక్కివెక్కి ఏడిచాడు. 'నాన్నా, అమ్మా, నాయనమ్మా, రాజం, మణీ!' అంటూ కేకలు పెట్టాడు. అతని కేకలు కనిపించీకనిపించని నల్లటి ఆకారాలను దాటిపోయాయి. ఆ ఆకారాలు చెట్లు కావచ్చు, దెయ్యాలు, నరకద్వార స్తంభాలు కావచ్చు. అక్కడినుంచి తప్పించమని వేయిదేవుళ్ళకు మొక్కుకున్నాడు. ప్రతి శనివారం ఏనుగు

మొహం గణపతికి రెండేసికొబ్బరికాయలు కొడతానని, వీధుల వెంట దొర్లుకుంటూ ముప్పైఎత్తి దర్శనంచేసుకుంటానని తిరపతి దేవుడికి దండంపెట్టుకున్నాడు. తన మొర ఆలకించి రక్షించడానికి భూమ్మీదకు దిగివచ్చేందుకు దేవుళ్ళకువ్యవధిఇవ్వడానికా అన్నట్టు కొంచెంసేపు ఆగాడు.

ఇప్పుడు పిచ్చిపిచ్చి ఊహలతో మనసు నిండిపోయింది. వెనకకు తిరిగిచూశాడు. పెద్దచీకటిముద్ద అతనివేపుకు వస్తోంది. లాభంలేదు. అతనిని చూసింది. బ్రహ్మాండమయిన దంతాలు తెల్లగా కనిపించాయి. ఘీంకారంచేస్తూ వచ్చి తొండంతో వేళ్ళతోసహా ఒక చెట్టును పెకలించి నేలకువేసికొట్టింది. కోపంతో ఎర్రబడ్డ దాని చిన్నచిన్న కళ్ళు కనిపించాయి. దంతాలు కిందకివంచి తొండంపైకెత్తి సిద్ధంగా నిలబడింది. పక్కకు గెంతి తలవాసిలో తప్పించుకున్నాడు. రొప్పుతూ కాసేపు కింద పడుకున్నాడు. చెమటకు బట్టలు తడిసిపోయాయి. నెమ్మదిగా అడుగుల చప్పుడు, భయంకరమయిన గుర్రు విని పించాయి. ఏమిటో చూద్దామనుకుని తిరిగేలోపునే చెవుల వెనక బరువయిన దంతాలు వచ్చి తగిలాయి. మెడ వెనక వెచ్చటి ఊర్పుపడింది. తలవంచుకుని నేలమట్టంగా పడుకుని పెద్దపులిబారినుంచి తప్పించుకున్నాడు. ఇంతలో చిరుతపులి, సింహం, తిమింగిలం, అడవిపసుగుల సింహాల రాక్షసులగుంపు లతనిని చుట్టుముట్టినట్టు అనిపించింది. రాక్షసులు అతనిని చెవులుపట్టుకుని పైకిలేవదీసి తలమీద వెంట్రుకలు ఒక్కటికీ మిగల్చకుండా ఊడబెరికారు. కిందనుంచి పైదాకా చర్మం ఒలిచారు. చల్లగా సన్నగా ఇదేమిటికి కాళ్ళను పెనవేసుకుంటోంది?

కొండె పైకెత్తి ముందుకువస్తున్న తేలును చూసి వణికిపోయాడు ఇది మనుష్యులు ఉండదగినచోటు కాదు. పాములు, తేళ్ళు అతనికి ఒక అంగుళందూరంలో ఉన్నాయి. కెవ్వుమంటూ లేచి వెనకకు తిరిగిచూస్తూ పరుగెత్తసాగాడు. అతనంత వడిగానూ తేలు పరుగెత్తుకు వస్తోంది. ఇక దానిని తప్పించుకోలేడు. ఊపిరి బిగపట్టి ఉన్న శాస్త్ర సత్తువ కూడదీసుకుని రెట్టింపు వేగంతో పరుగెత్తసాగాడు.

అవతలివికెట్టును తాకి తిరిగివచ్చాడు. రెండు పరుగులు. బాటుపుచ్చుకుని నిలబడ్డాడు. వై. యం. యు. కాప్టెన్ చేయి చేసి ఆరు స్కోర్లుకొట్టాడు. చెవులు చిల్లులుపడేటట్లు చప్పట్లు వినిపించాయి. రాజం సంతోషంతో ఆటస్థలంచుట్టూ పరిగెత్తాడు. ముమ్మారు గోడమీదికిఎక్కి కిందికి దూకాడు. మళ్ళీ బంతి వేశారు. బాటుతో కొట్టకుండా స్వామినాథన్ బాటు అవతలపారవేసి తల ఢీఇచ్చాడు. బంతి వెనకకుమళ్ళి బౌలు చేసిన బోర్డుస్కూలు హెడ్డుమాస్టరు వేపు వడిగా వెళుతోంది. స్వామినాథన్ బంతివెనక పరిగెత్తి మధ్యదోవలోనే పట్టుకుని కాప్టెన్ తలకు గురిచూసి విసిరివేశాడు. బంతి తగిలి కాప్టెన్ తల బద్దలయింది. యం. సి. సి. గెలిచింది. వై. యం. యు. వాళ్ళని తరిమితరిమికొట్టారు. అలసి కిందపడిపోయేవరకు స్వామినాథన్ తెగనవ్వాడు.

## III

శనివారం ఉదయం పెందలాడే బండిమనిషి రంగ మెంపి అడవికి ఈ వేపున అయిదుమైళ్ళలోని తన గ్రామానికి తిరిగి వెళ్లుతున్నాడు. మధ్యాహ్నానికల్లా తన గ్రామం చేరుకోవాలని

మూల్గుడినుంచి తెల్లవారుఝామున రెండుగంటలకే బయలు దేరాడు. మెంపిఅడివి రోడ్డు మలుపుతిరిగి ఎద్దుతాళ్ళు బండికి కట్టి పడుకున్నాడు. వెంటనే నిద్రపట్టింది.

హఠాత్తుగా ఎద్దు ముందుకుపోలి ఆగింది. రంగ మేలుకుని ఎద్దుని తిడుతూ తాడు గట్టిగా గుంజాడు. గంటలు గణగణా మోగిస్తూ తలఊపిందేగాని, ఎద్దు కదలలేదు. రంగ మండిపడుతూ కిందిగి చూసేసరికి దోవకు అడ్డంగా మనిషి కనిపించాడు. "లే. సోమరివెధవ! నిద్రపోవడానికి యింతకంటె మంచి చోటు దొరకలా ?" అంటూ కేకలుపెట్టాడు. కాని ఆ నిద్రపోతున్న వ్యక్తి మేలుకోలేదు. లాగి అవతల పారవేద్దామని దగ్గరికి వెళ్ళాడు.

"అరె! చిన్నపిల్లాడు! యిక్కడెందుకు నిద్రపోతున్నాడబ్బా" అనుకుని మీదికి వంగిచూసి "పాపం! చచ్చిపోయాడు" అనుకున్నాడు. కాళ్ళు చేతులు మంచుతో తడిశాయి. పిల్లవాడిచొక్కా తీసి తాకిచూచాడు. శరీరం వెచ్చగానేఉంది. ప్రాణంపోలేదని సంతోషించాడు. ఇందులోనిరహస్యం తెలుసుకోలేక అతనిమనసు బాధపడింది. బట్టలు, వాలకం చూస్తే ఆ పిల్లవాడు బస్తీవాడని తెలుస్తోంది. కొనఊపిరితో ఎక్కడో దూరాన హైరోడ్డుకుఅడ్డంగా పడిఉన్నాడు. అతను ఎవరిపిల్లవాడు ?ఎక్కడినుంచి ఎందుకు ఇక్కడికి వచ్చాడు ? ఈ ప్రశ్నలతో రంగ సతమతమయినాడు. దెయ్యాలు మనుషుల్ని ఎత్తుకుపోయి ఎక్కడో దూరాన పారేస్తాయంటారు. ఏమో ఎవరికి తెలుసు? ఈవిషయంతనే తేల్చుకోవాలనుకోలేదు. అదిసర్కారు

ఆఫీసరుపని. తనకెందుకు? సర్కారుఆఫీసరు మూడు ఫర్లాం గులదూరంలో రహదారిబంగాళాలో ఉన్నాడు. రంగ పని అల్లా పిల్లవాడిని అక్కడికి తీసుకువెళ్ళడమే! మెల్లిగా పిల్ల వాడిని పైకెత్తి బండి దగ్గిరికి మోసుకువెళ్ళాడు.

బండిలో తనచోట కూచుని తాళ్ళుపట్టుకుని, పాదం పైకెత్తి ఎద్దు పొట్టమీద ఒక్క తన్ను తన్నాడు. ఆ తన్ను లోని అర్థం గ్రహించి ఎద్దు వళ్ళు విదిలించుకుని పరుగుచ్చు కుంది.

## IV

స్వామినాథన్ పిచ్చిగా ముందుకు చూశాడు. ఏమీా అర్థంకాలేదు. మొట్టమొదట ఇంతకాలంగా తా నున్న ఇంటి లోనే ఉన్నానని నమ్మాడు. కాని మనసు తెరిపిఇచ్చినకొద్దీ ఏవేవో గజిబిజిగా గుర్తుకొచ్చాయి. కళ్ళు గబగబా మిణక రించాడు. చేయిచాచి తడిమాడు. ముందున్నవస్తువులను పరీ క్షగా చూశాడు. మనసు నిలకడగా ఉంచుకోవడానికి ఎంతో కష్టపడవలసివచ్చింది. గోడమీాది బొమ్మమీాద దృష్టినిలిపాడు. అది బొమ్మా లేక కాలెండరా? ఇంటి దగ్గిర తన గదిలోని కాలెండరు ఇదేనా? దాని వివరాలు గ్రహిస్తుండగా హఠాత్తుగా అలసటతో మనసుకుంగిపోయి మళ్ళా గందరగోళం బయలు దేరింది. గోడమీాద అసలు వస్తువంటూ ఒకటి ఉందా? పరిపరి విధాలపోయే మనసుమీాద కోపంవచ్చింది....దగ్గిర కుర్చీలో ఒక వ్యక్తి అస్పష్టంగా కనిపించాడు. ఆ వ్యక్తి కుర్చీ అతని దగ్గిరకు లాక్కుని "సరే. కులాసాగా వుందా?" అని ప్రశ్నిం చాడు. జీవం ఇంకా కోలుకోని అతనిచెవులలో ఈ మాటలు

పడ్డాయి. తండ్రి అక్కడ ఎందుకున్నాడో స్వామినాథన్‌కు అర్థంకాలేదు. తన పక్కన ఎందుకు కూచున్నాడో తెలుసుకోవాలనుకున్నాడు.

"నాన్నా !" అని కేకపెట్టాడు ఆ వ్యక్తికేసి చూస్తూ.

"మీ నాన్నని యిపుడేచూద్దువుగాని. బెంగపెట్టుకోకు." అని ఆ వ్యక్తి అతనిని ఏ మనిషికయినా ఆసక్తి కలిగించే ప్రశ్నలు వేశాడు. ప్రశ్న ప్రశ్నకు జవాబు చెప్పడానికి స్వామినాథన్ చాలాసేపు తీసుకున్నాడు. ఆ జవాబులకు అర్థం పర్థం తలాతోకా లేకపోయేసరికి ఆ వ్యక్తికి మొదట వినోదంగాఉన్నా తరవాత కోపంవచ్చి అసలు ప్రశ్నలు వేయడమే మానివేశాడు. స్వామినాథన్‌ను అనేకసందేహాలు పీడించసాగాయి. ఈయనెవరు ? నాన్నేనా ? నాన్న కాకపోతే యిక్కడ ఎందుకున్నట్టు? నాన్న అయితేమట్టుకు ఎందుకు ఉన్నట్టు? యితనెవరు? ఏమిటి అంటున్నాడు ? బిగ్గరగా స్పష్టంగా మాటాడడేం ?

ఇంతలో ఆ వ్యక్తి గదిలోనుంచి బయటకి వెళ్ళాడు. ఆయన పేరు యం. పి. యస్. నాయర్. జిల్లాఫారెస్టుఆఫీసరు. మెంపీ అడవిదగ్గిర మకాం వేశాడు. పగలల్లా అడవిలో తిరిగి రాత్రి ఏడు గంటలకు ట్రావెలర్సు బంగాళా చేరుకున్నాడు. పట్టీలు, బూట్లు ఊడదీసుకుంటూంటే ఈ పిల్లవాడి విషయం తెలిసింది. మందులు, ఆహారం ఇచ్చేసరికి కొన్ని గంటలకు పిల్లవాడు కోలుకున్నాడు. కాని, ఏం లాభం ? తన విషయం చెప్పేస్థితిలోలేడు. పిల్లవాడిమాటలు నమ్మితే అతని ఊరు భూగోళశాస్త్రజ్ఞులే ఎరగనిది, విచిత్రమయినది అయివుండాలి.

మర్నాటి ఉదయం పిల్లవాడు లేచి చురుకుగా ఉండడం

నాయర్ చూశాడు. ఒక చెట్టుకు కొద్దిగజాలదూరంలో పిల్ల వాడు నిలబడిఉన్నాడు. పాదాలదగ్గిర రాళ్ళు గుట్టగా పడి ఉన్నాయి. పిల్లవాడు వంగి, ఒక రాయి తీసుకుని, నాలుగు గజాలు వెనకకు వెళ్ళి, గబగబా నాలుగుఅడుగులుముందుకు వేసి, టకీమని ఆగి చెట్టుబోదెను సూటిచేసి రాయివిసిరివేశాడు ఇలా గడియారంలా ఒకరాయితరవాత ఒకరాయి చొప్పున వేస్తున్నాడు.

"గుడ్ మార్నింగ్!" అన్నాడు మిస్టర్ నాయర్, "యెలా వున్నావు?"

"కృతజ్ఞుణ్ణి.మీరు నన్ను గొప్పఆపదనుంచిరక్షించారు."

"ఆ...చేతినిండా పనివున్నట్టుందే?"

"యేదో ప్రాక్టీసుచేస్తున్నాను. వై. యం. యు. మీద ఆడబోతున్నాం. బౌలింగుకు రాజం నా మీద ఆశ పెట్టుకుని వున్నాడు. నన్ను టేట్ అంటారు. చాలా రోజుల నుంచి ప్రాక్టీసుచేయడంలేదు. ఆటదగ్గిరలో వున్నపుడు ప్రాక్టీసు చేయకుండా యిలా వచ్చేయడం నా తెలివితక్కువే. యివాళ యేంవారం?"

"యెందుకు?"

"దయయుంచి చెప్పండి. ఆట ఇంకెన్నాళ్ళుందో తెలుసు కోవాలి?

"యివాళ ఆదివారం."

"యేమిటి? యేమిటి?" స్వామినాథన్ కొయ్యబారిపోయాడు. ఆదివారం! ఆదివారం! పాదాలదగ్గిరి. రాళ్ళ గుట్టకేసి తేరిపారజూశాడు.

"యేవిఁటి సంగతి ?"

"పోటీఆట ఆదివారంనాడే" అని స్వామినాధన్ నసిగాడు.

"అయితేనేం ? యింకా ఒకరోజువుంది. యివాళ శనివారం"

"ఆదివారం అని చెప్పావుగా ?"

"అబ్బే ! యివాళ శనివారమే. కావాలంటే కాలెండరు చూడు"

"కాని ఆదివారంఅని చెప్పావుగా ?"

"పొరపాటుపడ్డాను."

"ఆదివారానికిముందరే నన్ను యేదోవిధంగా ఆటస్థలానికి చేర్చండి.

"ఓ తప్పకుండా. యివాళసాయంకాలమే తీసుకువెళతాను. కాని మీా వూ రేదో యెవరికొడుకునో చెప్పాలి సుమా !"

# పద్దెనిమిదో ప్రకరణం

## తిరిగిరాక

### I

ఆదివారంమధ్యాహ్నం మూడున్నరగంటలయింది. యం. సి. సి. కి వై. యం. యు. కి పోటీఆట ఇంకా సాగుతూనేవుంది. వై. యం. యు. టాస్ గెలుచుకుంది. రెండు గంటలకల్లా యెనభైఆరుస్కోరుతో అంతా ఔటయారు. కాప్టెన్ అందరికంటె ఎక్కువ 32స్కోరు సంపాదించాడు.

యం. సి. సి. అతనిని బౌలుచేయాలి. మరలాగా నిలబడి కుడికి ఎడమకి కొట్టుతూ బౌలర్లందరికీ అలసట కలిగిస్తున్నాడు. ఇలా గంటలకొద్దీ ఆడాడు. తరవాత బాట్స్‌మన్ పెద్దగా స్కోరు సంపాదించకపోయినా అసాధ్యుడు. యం. సి. సి. లో ఉన్న నలుగురిపనీ అయిపోయింది. గట్టి బౌలరు ఉంటే బాగుండేది అనుకున్నాడు రాజం.

విశ్రాంతితరవాత మళ్ళా ఆట ప్రారంభమయింది. రాజం ప్రహారీగోడనీడను తనజట్టువాళ్ళతో కూచున్నాడు.

"రాజం! ఒక్కనిమిషం యిలా రా"అని పైనుంచి వినిపించింది. రాజం తల పైకెత్తి, చూసేసరికి గోడమీద తండ్రి మొహం కనిపించింది. "నాన్నా! తొందరపని వుందా?"

"ఆఁ, ఒక్కనిమిషంకంటె యెక్కువ అట్టేవుంచనులే."

రాజం గోడదూకి వెళ్ళేసరికి తండ్రి ఉత్తరంఒకటి చేతికి ఇచ్చాడు. ఉత్తరంచదివి తండ్రికి ఇచ్చివేస్తూ మామూలుగా "క్షేమంగా ఉన్నాడన్నమాట. అక్కడ యేంజేస్తున్నట్టు?" ఒకనిమిషం ఆలోచించి వెళ్ళిపోవడానికి వెనకకు తిరిగాడు.

"యీ వుత్తరం స్వామినాథన్‌నాన్నకు పంపుతున్నాను. కారువేసుకుని ఆయన అక్కడికి పరిగెత్తితీరతాడు. నేనూ ఆయనతో వెళ్ళాలి. నీకుకూడా రావాలనివుందా?"

రాజం ఒక్కనిమిషం మాటాడకుండా నిలబడి గట్టిగా "లేదు"అని చెప్పాడు.

"నీ స్నేహితుని కలుసుకుని వెంటబెట్టుకుని రావాలనిలేదా?"

"నాకేంపట్టింది?"అని రాజం వెళ్ళి స్నేహితులమధ్య

కూచున్నాడు. నాలుగో ఆటగాడు బాగా ఆడుతున్నాడు.
"పరవాలేదు. అప్పుడే ఆరుపరుగులుతీశాడు. బలే! బలే!"

"వాళ్ళు యాభైఅన్నా చేస్తే తక్కినవి మనం చూసు కోవచ్చు."

రాజం తలఊపాడు. కాని అతనిమనస్సులో ఒకమారు మూల ఇతరవిషయాలతో మునిగింది. తండ్రిచెప్పినవార్త అతనిలో అనేకభావాలను రేపింది "మణీ! స్వామి-" అని ఆపేశాడు. స్వామినాథన్ విషయంలో అతనికిఆసక్తిలేదు. మణి దిగ్గునలేచి, "స్వామిసంగతేమిటి? చెప్పు రాజం! కనిపించాడా?"

"నాకేం తెలీదు."

"రాజం! రాజం! స్వామివిషయం యేదో చెప్పబోయి మళ్ళీ ఫూరుకున్నావేం?"

"అబ్బే! యేంలేదు. యెవడేమయితేనాకేం!" అన్నాడు.

## II

స్వామినాథన్‌కు బాగా కులాసాచిక్కింది. ఇంక పరవాలేదనే ధైర్యం కలిగింది. అతనినిచూడడానికి వచ్చినవారంతా పొగడసాగారు. నాయనమ్మ, అమ్మ నిమిషం తెరిపిలేకుండా అతనిచుట్టూ తిరుగుతున్నారు. తొట్టిలోని చంటిపిల్లవాడి సంగతి ఎవరూ పట్టించుకోవడంలేదు. గావురుమంటున్నాడు. స్వామినాథన్‌కి మనసు కుదటపడింది.

అతని తండ్రిస్నేహితులు వచ్చి చూసిపోయారు. కాని అంతా ఒకమాదిరిగానే మెసలుకున్నారు. స్వామినాథన్ కేసి వేడుకగా చూసి, తిరిగివచ్చినందుకు సంతోషం తెలియజేసి ఒకేరకం ప్రశ్నలువేసి తమాషాగా ఒకటిరెండు మాటలాడి

వెళ్ళిపోయారు. తండ్రి ఒకస్నేహితునితో బయటకు వెళ్ళాడు. వెళుతూ వెళుతూ "స్వామి! నేను తిరిగివచ్చి మళ్ళీ నీకోసం వెదకక్కర్లేదనుకుంటాను" అన్నాడు. ఈమాటకు స్వామినాథన్ మనసు చివుక్కుమంది. తండ్రి చాలా క్రూరంగా దయాదాక్షిణ్యాలు లేకుండా ఈమాటలు అన్నాడని బాధపడ్డాడు.

తండ్రి వెళ్ళిపోయినతరవాత అతనికి స్వేచ్ఛ చిక్కింది. ఇంట్లో ఉన్నదల్లా తల్లి స్నేహితురాళ్ళూ, నాయనమ్మస్నేహితురాళ్ళూ, స్వామినాథన్ తండ్రి పుట్టకపూర్వంనుంచీ ఆ కుటుంబాన్ని ఎరిగిన కొంతమందివృద్ధులు. వాళ్ళమీద ఇష్టమొచ్చినట్టు దాష్టీకం చేయవచ్చు.

ప్రతివారూ స్వామినాథన్‌ను పరికాయించి చూచి అనదలచినది మొహంమీదనే అనసాగారు. ఆ జనంలో వంటవాడు కనిపిస్తే స్వామి అతన్ని చూసి చిరునవ్వు నవ్వాడు. పిచ్చాపాటీలో వంటవాడు అసందర్భంగా ఏదో అన్నాడు. ఇక తండ్రి తల్లి నాయనమ్మ ఉపవాసాలు చేయకర్లేదనే అర్థం వచ్చేటట్టు మాటాడేసరికి స్వామినాథన్‌కి కోపంవచ్చి కోపపడబోయేసరికి ఒక విధవరాలు కళ్ళుతిప్పుకుంటూ చేతులుపైకెత్తి "ఆ భగవంతుడు దయజూశాడు. అడవిమృగాల నోట్లోనుంచి రక్షించడానికి ఆ భగవంతుడే ఆ ఆఫీసరుని పంపాడు" అనడం వినిపించింది. 'ఏడుకొండలవాడి దయవల్లనే పిల్లాడు క్షేమంగా యింటికి చేరాడు. వెంటనే వెళ్ళి మొక్కు చెల్లించాలి' అంది నాయనమ్మ.

ఈలోగా స్వామినాథన్ తల్లి వంటింటిలోకి వెళ్ళి బాగా చక్కెరవేసిన కాఫీ వేడివేడి పలహారం తెచ్చిపెట్టింది. స్వామి

నాథన్ గబగబా తినేశాడు. వంటింటిలోనుంచి సువాసన గుప్పుమంది.

స్వామినాథన్ జరిగినది జ్ఞాపకంచేసుకున్నాడు. ఫారెస్టు ఆఫీసరుతో తాను మెలిగిన విధానానికి సిగ్గుచెందాడు. ఆయన జవాబుకోసం కాచుకుని ఉంటే చిన్నకారులో స్వామినాథన్ తల్లి, తండ్రి, రాజంతండ్రి, ఒక పోలీసు ఇనస్పెక్టరు చక్కా వచ్చారు. కొడుకు కంటపడగానే తల్లి ఎంత గొడవచేసిందని! రాజం తండ్రి పోలీసు ఇనస్పెక్టరు తనకు సంకెళ్లుతగిలిస్తారేమో నని మొదట్లో స్వామినాథన్ భయపడ్డాడు. రాజంతండ్రి ఎంత మంచివాడు! తన తండ్రికూడా ఎంత దయ చూపించాడు! అందుచేత అయిదునిమిషాలతరవాత స్వామినాథన్ తనకథంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. విని అంతా విరగబడి నవ్వారు. తల్లి కొంగుతో మొహం కప్పుకుని నవ్వు తెర ఆగినపుడల్లా కళ్లు తుడుచుకుంది...ఒక విషయం జ్ఞాపకంవచ్చి ఈ సంతోష మంతా మాయమయింది. ఫారెస్టు ఆఫీసరు కారు తలుపు తెరిచి దగ్గిరిగా నిలబడ్డా, ఆయనదగ్గిర స్వామి శెలవుతీసుకోవడం మరిచేపోయాడు. ఈ సంగతి జ్ఞాపకంవచ్చి మనసును బాధించింది. కారు జోరుగా పరుగెత్తుతూంటే తను రక్షించిన పిల్లవాడు వాడు వెళుతున్నానని చెప్పకుండా వెళ్లిపోతూంటే మనసు చివుక్కుమని అలాగే చూస్తూ నిలబడ్డ ఫారెస్టు ఆఫీసరురూపం కళ్ళకుకట్టేసరికి స్వామినాథన్‌కు ఊపిరాడలేదు.

ఇంతలో "స్వామి! ఓ స్వామి!" అని పెద్దగా కేకలు పెడుతూ సుడిగాలిలా మణి వచ్చిపడ్డాడు. ఏవేవో కేకలు దబ

దబా అడుగులచప్పుడు వినిపించింది. తీరాచూస్తే స్వామినాథన్, మణి కనిపించలేదు.

ఇద్దరూ దొడ్లో ఒక మారుమూలకు చేరుకున్నారు. "నువు చచ్చిపోయేవుంటావనుకున్నాను." అన్నాడు మణి.

"అంతపనీ అయింది"

"ఆ హెడ్డుమాస్టరంటే భయపడి పారిపోతావా? రాజం అంతా నాకు చెప్పాడు. మా బడికి వచ్చి రాజంను కలుసుకున్నపుడు నన్ను కలుసుకోకపోయినందుకు నాకు కోపం వచ్చింది..."

"నాకు వ్యవధిలేకపోయింది మణీ!"

"స్వామీ! నువు బతికివచ్చావు. అంతేచాలు. నేను నీకోసం యెంతో బాధపడ్డాను. యిన్నిరోజులు యెక్కడున్నావు?"

"నేను—నేను సరిగా చెప్పలేను. యెక్కడున్నానో నాకే తెలీదు" ఆనాటిరాత్రి భయపడిపోవడం, ఆ తరవాత జరిగిందంతా వివరంగా చెప్పాడు.

"నీఅంతపిరికివాడు లేడని నేను యిదివరకే చెప్పలా? గాబరాపడకుండా రోడ్డువెంట తిన్నగావస్తే యింటికి చేరేవాడివి. వున్నవీ లేనివీ వూహించుకుని బాధపడ్డావు."

ఈ మాటలు స్వామినాథన్ మెదలకుండావిని, "అయితే ఆ బండివాడు నన్ను లేవనెత్తాడంటే నమ్మలేకుండావున్నాను. యేమాత్రం జ్ఞాపకంలేదు."

"వాడుగనక దీపావళికో సంక్రాంతికో మీయింటికి వస్తే పిసినిగొట్టుగా ప్రవర్తించకు. వాడికో సంచెడు మొహిరీలు

యిచ్చినా రుణంతీరదు. వాడేగనక నిన్ను లేవదీయకపోతే యే పెద్దపులో నిన్ను గుటుక్కున మింగేసేది.”అని సలహా ఇచ్చాడు మణి.

“యింకో వెధవపనిచేశాను. నేను వచ్చేటపుడు ఆ ఫారెస్టుఆఫీసరుతో చెప్పిరాలేదు. ఆయన కారుదగ్గిరే నిలబడివున్నాడు.”

“అంతదగ్గిరిలో వుంటేనో రెందుకు కట్టేసుకున్నావు ?”

“కాదు సగందూరం వచ్చినతరవ్వాత జ్ఞాపకంవచ్చింది.”

“నువు వట్టి అశ్రద్ధమనిషివి. ఆయనకి కృతజ్ఞతచెప్పి రావలసింది.”

“యిపుడేంచెయ్యను ? వుత్తరం రాయనా ?”

“రాయి. కాని ఆయనఅడ్రెసు నీకు తెలుసా ?”

“నాకు తెలీదుగాని, మానాన్నకు తెలిసివుంటుంది.”

“యేమని రాస్తావు ?”

“నాకు తెలీదు. నాన్నని అడగాలి. మంచి వుత్తరం రాయాలి. పోనీ ఆటవేళకి నన్ను తీసుకువచ్చాడు. ఆయనకి నే నెంతయినా రుణపడివున్నాను.”

“యేమిటి అంటున్నావు ?”అని మణి అడిగాడు.

“నీకేం చెవుడా ? మంచివుత్తరం యెలారాయాలో నాన్నని అడుగుతానన్నాను. అంతే.”

“అదికాదు, యేదో పోటీఆట అన్నావు, యేమిటి ?”

“అవును.”

“పోటీవేళకు వచ్చానంటున్నావు, నీకేమయినా మతిపోయిందా ?”అని మణి వై. యం. యు. ఆడడం, ఓడిపోవడం,

యం. సి. సి. పని అయిపోవడానికి స్వామిబాధ్యత ఎంతో తెలియజేశాడు.

"యివాళే యెందుకు ఆడారు ?"

"యెందుకు ఆడకూడదు?"

"యివాళ శనివారమేకదా ?"

"శనివారమని యెవరు చెప్పారు ?"

"యివాళ శనివారమని ఫారెస్టుఆఫీసరు చెప్పాడు."

"అలాఅయితే అతను వట్టి తెలివితక్కువదద్దమ్మ."అని ఎత్తిపొడిచాడు మణి.

ఇవాళ ఆదివారంకాదంటూ స్వామి మొండిగా వాదించాడు. కిందపడవేసి గుండెలమీద కూర్చుని పేగులుతోడేస్తానని మణి భయపెడితేనేగాని ఊరుకోలేదు. స్వామి కొంచెం సేపు మాటాడకుండా ఊరుకుని "వుత్తరం రాయను. నన్ను మోసంచేశాడు"'

"యెవరు ?"

"ఫారెస్టుఆఫీసరు...యింతకీ రాజం నన్నుగురించి యేమంటున్నాడు ?"

"చాలాచాలా అంటున్నాడు. అవన్నీ మళ్ళా నీతో చెప్పడం నా కిష్టంలేదు. కాని ఒక్కవిషయంమాత్రం చెప్పదలిచాను. వాడికంటపడకు. యిక నీతో యెన్నటికీ మాటాడడు. కనిపిస్తే నిన్ను తుపాకితోకాల్చేయవచ్చు."

"నే నేంచేశాను ?"

"యం. సి. సి. ని నాశనంచేశావు. జంకేవాడివి మాట యివ్వకుండా వుండవలసింది. వెళ్లిపోతున్నానని మాటమాత్ర

మయినా చెప్పకపోతివి. బడిలో రాజంను కలుసుకున్నపుడు. రాజంతోయెందుకు చెప్పలేదు ? ఆవిషయం రాజం తెలుసుకోవాలనుకుంటున్నాడు ?''

స్వామినాథన్ నెమ్మదిగా ఏడ్చాడు. రాజంను శాంతపర్చమని మణిని బతిమాలుకున్నాడు. అతనిమీద తనకున్న ప్రేమను, సంజాయిషీని తెలియజేయమన్నాడు కాని, మణి మాత్రం ఈవిషయంలో కలుగజేసుకోనంటూ, "నీకు రాజం సంగతి తెలీదు. వాడు వజ్రంలాంటివాడు. కాని వాడితో పడడం కష్టం."

తెచ్చిపెట్టుకున్న ఆశాభావంతో "నేను కనిపిస్తే సవ్యంగానేవుంటాడు. రేపుపుదయం వెళ్లి కలుసుకుంటా."

మణి ఈవిషయం మార్చాలని "మళ్లీ బడికి వెళతావా ?''అన్నాడు.

"ఆ-వచ్చేవారంనుంచి వెళతాను. మా నాన్న అప్పుడే హెడ్డుమాస్టరుని కలుసుకున్నాడు. బడిలో అంతా సాఫీగానే జరిగిపోతుంది. బోర్డుస్కూలుగొడవంతా మా నాన్నకి తెలిసిపోయినట్టుంది."

"అవును. నేనూ రాజం ఆయనతో అంతా చెప్పేశాం."

"మళ్లీ బోర్డుస్కూలుకే వెళ్లాలి. యిపుడు యింకో బడికి వెళ్లడానికి వీల్లేదని మానాన్న అన్నాడు."

# పందొమ్మిదో ప్రకరణం

## వీడ్కోలుకానుక

## I

పదిరోజులతరవాత మంగళవారం ఉదయం అయిదు గంటలకల్లా ఎంతో పట్టుదలతో స్వామినాథన్ పక్కమీాద నుంచి లేచాడు. రాజం వెళ్ళే రెలు మాల్గుడిస్టేషనుకు వచ్చి వెళ్ళడానికి ఇంకా అరగంట వ్యవధిఉంది.

కిందటిరాత్రి పదిగంటలకు మణి వచ్చి రాజంతండ్రికి బదిలీఅయిందనీ వాళ్ళంతా ఉదయం రైలులో వెళ్ళిపోతా రనీ చెప్పేవరకు స్వామికి ఈ విషయమే తెలియదు. మణికి ఈవిషయం వారంరోజులక్రితమే తెలుసు. స్వామినాథన్‌తో చెప్పవద్దని రాజం నిక్కచ్చిగా చెప్పడంవల్ల మణి చెప్పలేదు. కాని ఆఖరినిమిషంలో మణి చెప్పకుండా ఉండలేక రాజం మాటను జవదాటాడు.

వెంటనే విచారం ముంచెత్తింది. హఠాత్తుగా ప్రపంచ మంతా శూన్యంగా కనిపించింది. రాజంలేని లాలీఎక్స్టెన్షన్ స్మశానంలా తోచింది. ఇక ఎన్నడూ అక్కడికి వెళ్ళనని స్వామి ఒట్టుపెట్టుకున్నాడు. మణిమీాద మండిపడ్డాడు. మణి అదంతా భరించాడు. రాజంలేని ప్రపంచాన్ని స్వామి ఊహించలేక పోయాడు. ఇక సాయంకాలంపూట ఏంచేయాలి? శెలవుల్లో మధ్యాహ్నాలు గడపడ మెలా? ఇక స్నేహితుడని ఎవరిని అను కోవాలి? ఏదో తప్పుచేశాననిమాత్రం తలచాడు. తాను తిరిగి వచ్చినతరవాత ఒక్కసారయినా వెళ్ళి రాజంనుచూచిరాలేదు.

భయం, సిగ్గుమూలంగా ప్రతిరోజూ వెళదామనుకుని మాను కున్నాడు. రెండుసార్లు రాజం ఇంటిగేటుదాకా వెళ్ళి ఆఖరి నిమిషంలో ధైర్యంచాలక వెనక్కు తిరిగివచ్చాడు. రేపు రాజంను కలుసుకుందామని ఆలోచిస్తుండగా మణి వచ్చి ఈ చెడువార్త చెప్పాడు. ఆ నిమిషంలోనే రాజంఇంటికి వెళదా మనుకున్నాడు. కాని బాగుండదని మళ్లా జంకాడు. రేపు ఉదయం స్టేషనులో కలుసుకుంటే సరిపోతుంది. రైలు ఆరింటికి బయలుదేరుతుంది. అయిదింటికే వెళితేసరి.

"మణి! రేపువుదయం అయిదింటికి నన్ను కేకవేస్తావా?"

"ఊహుఁ—నేను రాజంయింటోనే నిద్రపోయి వాడితో స్టేషనుకు వెళతాను."

ఒకనిమిషం స్వామినాథన్ అసూయలో మునిగి పోయాడు. మణి రాజంఇంటో నిద్రపోవడమా? ఆఖరివరకు కూడాఉండడమా? అర్ధరాత్రిదాకా వాడితో నవ్వుతూపేల డమా? తనను దూరంగా ఉంచడమా? మణిని గట్టిగాపట్టు కుని వెళ్ళకుండా ఆపివేద్దామనుకున్నాడు.

మణి వెళ్లిపోగానే స్వామి లోపలికివెళ్లి దేవదారు చెక్కపెట్టె తెరిచి తేరిపారజూస్తూ నిలబడ్డాడు. మర్నాడు ఉదయం రాజంకు బహుమతిగా ఇవ్వడానికి తగిన వస్తువు తీయాలనుకున్నాడు. ఆ పెట్టెలోరకరకాలవస్తువులు ఉన్నాయి. అట్టపెట్టె, బొమ్మ గడియారం, కేటలాగు, బొమ్మలపుస్తకాలు, గడియలు, మరమేకులు—అవీ ఇవీ పెట్టెనిండా ఉన్నాయి. అరగంటసేపు పెట్టె అంతా గాలించాడు. కాని రాజంకు బహుమానంగా ఇవ్వతగ్గది ఒక్కటీ కనిపించలేదు.వాటిల్లో

కల్లా చెప్పుకోతగ్గది సంవత్సరం క్రితం రాజం స్వయంగా ఇచ్చిన ఆకుపచ్చని ఇంజను. రెండుచోట్ల సొట్టలుపడి వంగిపోయిన ఆ ఇంజను కంటపడేసరికి వెనకటిసంగతులు జ్ఞాపకంవచ్చాయి. స్నేహం చెడిందిగా, ఇక దీనిని రాజంకు తిరిగిఇచ్చివేస్తే? రాజంకు తిరిగిఇచ్చివేద్దామనే ఉద్దేశంతో చేతితో దానిని లేవనెత్తాడు. కాని ఆ ఇంజనంటే అతనికి మహాఇష్టం. పైగా ఇంతకాలమయినతరవాత బహుమతి తిప్పి ఇచ్చివేయడం అవమానపర్చినట్టు. ఈ కారణాలు ఆలోచించి మళ్లా ఇంజను కింద పెట్టేశాడు... రాజంకు పుస్తకాలంటే ఇష్టం. అందుకని ఏదయినా పుస్తకం బహుమతిగా ఇద్దామని స్వామి నిశ్చయించుకున్నాడు. క్లాసుపుస్తకాలు ఇవ్వడానికి వీలులేదుకదా? అతనికి ఒక పుస్తకమంటే గౌరవం. అది పైకితీశాడు. అది ఆండర్సన్ 'ఫెయిరీ టేల్సు' అనే పుస్తకం. వాళ్లనాన్న చాలా కాలం క్రితం మదరాసులో కొనిపెట్టాడు. అందులో మాటలు చాలా అతనికి అర్థంకావు. చదవనుకూడా సరిగా చదవలేడు. ఈ పుస్తకం రాజంకు ఇస్తే సరి. రాతబల్లదగ్గిరికివెళ్లి అట్టమీద 'ప్రియమయిన స్నేహితుడు రాజంకు' అని రాశాడు.

## II

పుస్తకం చేత్తోపట్టుకుని స్వామి రైలుస్టేషనుకు చేరుకునేసరికి ఇంకా సందెచీకటిగా ఉంది. స్టేషనుమాస్టరు అప్పుడేలేచి కిరసనాయిలుదీపంముందు కూచుని పనిచేసుకుంటూ, టెలిగ్రాఫ్ మోత పట్టించుకోవడమేలేదు.

బయట కారువచ్చి ఆగింది. కారులోనుంచి రాజం, వాళ్లనాన్న, అమ్మ, మణి, ఇంకెవరో కొత్తమనిషి దిగడం

స్వామినాథన్ చూశాడు. రాజం కనిపించేసరికి స్వామి వెనకకు జంకాడు. దొరపిల్లవాడిలాగా దుస్తులువేసుకుని రాజం ప్లాటు ఫారంమీాదికి వచ్చేసరికి స్వామినిశ్చయం సడలిపోయింది. తన బట్టలవంకచూసుకుని, రాజంతో సరితూగనని అను కున్నాడు. అందుకని జంకి ఎవరికంటాపడకుండా ఉండాలని యత్నించాడు.

వెంటనే పోలీసు ఆఫీసర్లతో, జవాన్లతో ప్లాటుఫారం నిండిపోయింది. రాజందగ్గిరికి వెళ్లడం కష్టం. యూనిఫారం వేసుకున్న జనం మధ్య తండ్రిపక్కన, నిలబడిఉన్నాడు రాజం. ఇద్దరు పోలీసులమధ్యగా రాజం ఎడమకాలు మాత్రం కనిపి స్తోంది. పోలీసువాళ్లు దగ్గిరికి జరిగినపుడు ఆమాత్రంకూడా కని పించడంలేదు. ఇంకెక్కడినుంచయినా చూడవచ్చేమోనని చుట్టూ తిరిగాడు స్వామి.

రైలు వస్తోంది. గందరగోళం బయలుదేరింది. రైలు ప్లాటుఫారంమీాదికి వచ్చి ఆగింది. గల్లంతు ఎక్కువయింది, రాజం అతనితాలూకువాళ్లు ప్లాటుఫారంచివరకు చేరుకున్నారు. డజనుమంది పోలీసులు సామాను గబగబా సెకండ్లుక్లాసు పెట్టెలోకి ఎక్కించారు. రాజంతల్లి రైలు ఎక్కింది. రాజం, అతనితండ్రి పెట్టెబయట నిలబడ్డారు. పోలీసులు ఆఫీసర్లు వారి చుట్టూ చేరి పూలమాలలువేసి శెలవుపుచ్చుకుంటున్నారు. పెద్ద గులాబీపూలదండ రాజంమెడలోవేశారు. ఒక క్షణం స్వామినాథన్ రాజంను చూడగలిగాడు.

స్వామి....ఎలాగో మణిని కలుసుకున్నాడు. "మణి! రాజం వెళ్ళిపోతున్నాడు!

"అవును స్వామి! వెళ్ళిపోతున్నాడు.!"

"మణి! రాజం నాతో మాట్లాడతాడా?"

"ఆ- యెందుకు మాట్లాడడు?"

రాజం, తండ్రి రైలు ఎక్కారు. తలుపుమూసి గడి వేశారు.

"మణి! యీ పుస్తకం రాజంకు యిచ్చితీరాలి." అన్నాడు స్వామి. ఇక ఆలసించడానికి వీల్లేదు. గంటకొట్టారు. జనంలో తోసుకుని వెళ్ళి ఒక కిటికీదగ్గిర నిలబడ్డాడు. స్వామికి పైన ఏమీ కనిపించలేదు. తల పిడికాకామాత్రమే వచ్చింది. వెనకనుంచి జనం ముందుకు తోస్తున్నారు.

"యిడుగో స్వామి, నిన్ను పంపించడానికి వచ్చాడు." అన్నాడు మణి బిగ్గరగా. స్వామినాథన్ కాలిబొటనవేళ్ల మీద నిలబడ్డాడు. కిటికీలోనుంచి రాజం తలబైటపెట్టి,

"గుడ్ బై మణి! నన్ను మరిచేపోకు, వుత్తరాలు రాస్తూవుండు," అన్నాడు.

"గుడ్ బై రాజం! యిడుగో స్వామి!" అన్నాడు మణి. రాజం మెడ బాగా వంచాడు. స్వామినాథన్ కళ్ళు అతనికళ్లూ కలుసుకున్నాయి. స్వామినాథన్ ఉండబట్టలేక "రాజం!! రాజం! వెళ్లిపోతున్నావా? వెళ్ళిపోతున్నావా? మళ్లా యెప్పుడు తిరిగివస్తావు?" అంటూ ఏడిచాడు. రాజం మాట్లాడకుండా స్వామివంకే చూడసాగాడు. ఏదో చెప్ప బోయినట్లు కనిపించాడు. ఇంతలో గార్డు ఈల, రైలుకూత మాటకు అడ్డంవచ్చాయి. గొలుసుల గలగల, ఇంజనుమోత వినిపించింది. రైలు కదలసాగింది. రాజంమొహం కనిపించకుం

డాపోతోంది. స్వామినాధన్ నిరాశతో "మణీ! యేమయినాసరే యీపుస్తకం రాజంకు అందజేయాలి"అని పుస్తకం మణి



రైలు కదలసాగింది. రాజరో మొహం కనిపించకుండా పోతోంది.

చేతిలో పెట్టాడు. మణి రైలుతో పాటు పరుగెత్తి రైలు మోత కంటె బిగ్గరగా "స్వామి యీ పుస్తకం నీకిమ్మన్నాడు." రాజం చేయిజాచి పుస్తకం తీసుకుని చేయి ఊపాడు. స్వామినాథన్ కూడా పిచ్చిగా చేయి ఊపాడు.

స్వామినాథన్ మణి నిలబడ్డ పళ్ళాన నేలకు అంటుకుపోయి నట్టయిపోయి రైలును చూడసాగారు. ఆఖరి పెట్టె వెనక తగిలించిన ఎర్రదీపం చాలా సేపటి వరకు కనిపించింది. నిమిష నిమిషానికి చిన్నదవుతూ ఒక మలుపులో మాయమయింది. నడిచే రైలు శబ్దం నిట్టూర్పులా వినిపించసాగింది. స్వామి అన్నాడు: "మణి! రాజం పుస్తకం పుచ్చుకున్నాడు. నాకు సంతోషమయింది. మణి! నా కేసి చేయి ఊపాడు. యేదో చెప్పాలనుకున్నాడు కాని ఇంతలో రైలు కదిలింది. మణి! నా కేసే చేయి వూపాడు. నా ఒక్కడి కేసే చేయి వూపాడు. కాదనకు"

"అవునవును." అంటూ మణి ఒప్పుకున్నాడు.

స్వామినాథన్ కుంగిపోయి వెక్కి వెక్కి ఏడ్చాడు.

"యేమిటి పిచ్చిగాని" అన్నాడు మణి.

"నన్నెపుడయినా తలుచుకుంటాడా ?" అని పిచ్చివాడిలా అడిగాడు స్వామి.

"ఆఁ, తప్పకుండా తలుచుకుంటాడు" అన్నాడు మణి. ఒక నిమిషం ఆగి "బెంగెట్టుకోవద్దు. నీతో మాటాడకపోతేనేం, వుత్తరం రాస్తాడులే."

"యేమిటీ ?"

"అలా అని నాతో చెప్పాడు."

"కాని వాడికి నా అడ్రసు తెలీదే ?"

"నన్ను అడిగితే చెప్పాను."

"అబ్బే! అబద్ధం. నిజమయితే నాఅడ్రసు యేమిటో చెప్పు చూద్దాం."

"యేదయితేనేం, రాజంకు చెప్పాగా."

మణి నిజం చెప్తున్నాడా పరియాచకాలాడుతున్నాడా అని మొహంవంక తేరిపారజూచాడు. కాని మణిమొహంలో ఏమీ పొడగట్టలేదు.



బాల్యంలో బాలుర హృదయాలు స్వచ్ఛంగా నిర్మలంగా వుంటాయి. కాని బాధ్యతారహితంగా ప్రవర్తిస్తారు. కొంటె పనులతో విసిగిస్తారు. స్వామి స్నేహితుల కథ చిన్న చిన్న సామాన్య విషయాలతో అతి సన్నిహితానుభవంతో, ఆసక్తి కలిగించే విధంగా రచింపబడింది. భావిపౌరులు కాగల బాలురజీవితాలను తీర్చిదిద్దడానికి చక్కగా ఉపయోగ పడుతుం దీ నవల.

ప్రపంచ ప్రఖ్యాతిగల శ్రీ ఆర్. కె. నారాయణ్ రచనలలో దేశదేశాలలో విఖ్యాతి పొందిన నవలల్లో ఇది ఒకటి.

